# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 16 సంచిక : 12 హైదరాబాద్ 209 డిసెంబర్ 2018 పేజీలు : 68 రు. 25

* తెలంగాణ ఎన్నికల్లో పార్టీల వాగ్దానాలు
* భూస్వాముల కోసమే రైతు బంధు
* ప్రజా ఉద్యమ గుండెచప్పుడు ధర్నాచౌక్
* మీ టూ ప్రకటనల నేపథ్యంలో శబరిమల
* రాజకీయ కీలుబొమ్మగా సిబిఐ
* సర్దార్ పటేల్ విగ్రహం ఎందుకు?
* ఖషోగీ హత్య వెనుక అసలు నిజాలు

209

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

డిసెంబర్ 2018
సంపుటి : 16
సంచిక : 12







**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2018 నవంబర్ నెలలో వచ్చిన విరాళాలు - కె. శ్రీనివాస్ - హన్మకొండ - రు. 250; అక్కినేని కుటుంబరావు - హైదరాబాద్ - రు. 2,000; జె. సత్యానంద్ - శేరిలింగంపల్లి - రు. 5,000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

*రష్యాలో సోషలిజం వైఫల్యానికి లెనిన్ బాధ్యుడు కాదు శీర్షికతో జి.సత్యనారాయణరెడ్డి విమర్శకు ప్రతిస్పందన. 'రష్యాలో సోషలిజం వైఫల్యానికి లెనిన్ బాధ్యుడు కాదు' శీర్షికతో వీక్షణం నవంబర్ 2018 సంచికలో ఒక చర్చా వ్యాసం ప్రచురించారు. చైనా–శాస్త్రీయ అధ్యయనం: సమీర్ అమీన్ విశ్లేష (వీక్షణం అక్టోబర్ 2018) అన్న నా వ్యాసాన్ని అభినందిస్తూనే జి.సత్యనారాయణరెడ్డి పై శీర్షికలోని అంశాన్ని లేవనెత్తారు. ఇక్కడొక సూక్ష్మమైన అంశాన్ని వారు గమనించలేదు. దాని గురించి క్లుప్తమైన వివరణ అవసరం.*

*'లెనిన్ నేతృత్వంలోని రష్యాలో ఇలా సాగలేదని' బోల్షివిక్ పార్టీ ఫెయిల్ అయిన విషయంలో మావో కృతకృత్యులయ్యారని 'లెనిన్ కంటే మెరుగ్గా మావో ఈ విషయాన్ని అర్థం చేసుకున్నారు' స్వతంత్రమైన మార్క్సిస్టు ఆలోచనలు కల మావో ఆయన! అని మరోచోట సమీర్ అమీన్ వ్యక్తం చేసిన అభిప్రాయాలు వాస్తవానికి అనుగుణంగా లేవు అని చర్చించారు.*

*'రష్యన్ మార్గానికి భిన్నంగా 'ఒరిజినల్ మార్గం'లో చైనాలో విప్లవం, నిర్మాణం కూడా మావో నేతృత్వంలో మొదలై నేటికీ కొనసాగుతున్నది' అని సమీర్ అమీన్ అంటారు. రైతాంగ విప్లవం చైనా విప్లవంలో కీలకాంశం అన్నది తెల్సిందే. ఆ విషయంలోనే చైనా, మావోల విశిష్టతను సమీర్ అమీన్ వివరించారు. 'గ్రామీణ జనబాహుళ్యంతో కార్మిక ఐక్య సంఘటనను జయప్రదంగా నిర్మించగలిగారు' అని సమీర్ అమీన్ఇలా అంటారు*

*వ్యవసాయ సమస్యకు చైనా విప్లవంలో కనుగొన్న పరిష్కారం చాలా విశిష్టమైనది. రైతాంగానికి పంచబడిన వ్యవసాయ భూమిని ప్రైవేటీకరించలేదు. భూమి యావత్ దేశానికి చెందిన ఆస్తిగా ఉన్నది. రష్యాలో అలా జరగలేదు. ప్రైవేటు ఆస్తిగా భూమిని గుర్తించాల్సిన తప్పనిసరి పరిస్థితులను (ఫెయిట్ అకాంప్లిట్) లెనిన్ ఎదుర్కొన్నారు. చైనాలో పరిస్థితి వేరు, వియత్నాంలో కూడా చైనాలో లాగే. ఈ రెండుచోట్లా రైతాంగం ఈ పరిస్థితిని అంగీకరించింది. ఇది మరెక్కడా లేదు. ఈ రెండు దేశాల కమ్యూనిస్టు పార్టీలు అమలుచేసిన వివేకవంతమైన, విశిష్టమైన రాజకీయ పంథా ఫలితం ఇది.*

*చైనాకి సంబంధించిన ఈ నిర్దిష్ట లక్షణం చాలా చాలా ముఖ్యమైనది. వ్యవసాయ భూమి సరకుగా (కమోడిటీగా ) మారకూడదు. భూమిని అమ్మడం, కొనడం అనుమతించరానిది – అన్న సూత్రాన్ని చైనాలో అమలు చేయగలిగారు. రష్యాలో అలా జరగలేదు. భూమిని సమిష్టి ఆస్తిగా మార్చాలని (కలెక్టివైజేషన్) స్టాలిన్ బలవంతం చేయగా, అక్కడ అంతులేని రైతాంగ యుద్ధాలు సాగినాయి అని గుర్తుచేస్తారు సమీర్ అమీన్.*

*వీక్షణంలో ప్రచురించిన భాగాలే ఇవి. వాటి సారాంశం స్పష్టమే. రైతాంగ సమస్యను, భూమి సమస్యను చైనాలో పరిష్కరించిన తీరు విశిష్టమైనది. అది చైనా విప్లవపు ఒరిజినల్ మార్గంలో ఒక ముఖ్యభాగం. రష్యాలో అలా జరుగలేదు అంటూ దానికి 'తప్పని పరిస్థితులను' కారణంగా చెప్పారు. స్టాలిన్ అనుభవాన్ని పేర్కొన్నారు. ఇక్కడ విషయం ఇంతవరకే. రష్యాలో సోషలిజం వైఫల్యానికి లెనిన్ బాధ్యుడు అన్నది సమీర్ అమీన్ విశ్లేషణ కాదు. అలా ఇక్కడ రాయనూలేదు. రైతాంగ భూమి సమస్యల ఈ సూక్ష్మతను గమనించకుండా సత్యనారాయణరెడ్డిగారు రాశారు. లేవనెత్తని అంశాన్ని విశ్లేషించారు.*

*లెనిన్ కంటే మెరుగ్గా మావో ఈ విషయాన్ని అర్థం చేసుకున్నారు. స్వతంత్రమైన మార్క్సిస్టు ఆలోచనలు కల మావో ఆయన! అని మరొకచోట లెనిన్ వ్యక్తం చేసిన అభిప్రాయాలు వాస్తవానికి అనుగుణంగా లేవు. మావో మాత్రమే స్వతంత్రమైన, ఒరిజినల్ ఆలోచనలు కలవాడిగా ఆయన పేర్కొనడం ఏ విధంగానూ సరైందికాదు.. అని సత్యనారాయణరెడ్డిగారు రాశారు.*

*మార్క్సిజం అభివృద్ధి క్రమంలో–లెనిన్ ఎలా అభివృద్ధి చేశారు, తర్వాత మావో ఎలా అభివృద్ధి చేశారు అన్నవి తెల్సినవే. మా–లె–మావో ఆలోచను అనడం వాటి కొనసాగింపును, కొత్త అంశాలను ఎత్తి చూపడానికే. అదే మార్క్సిజం విశిష్టత. అది పిడివాదం కాదు, కార్యాచరణకు మార్గదర్శి అని లెనిన్– మావోలు అన్వయించి వివరించారు. ఇందులో తర్వాత వారు మెరుగు చేశారనడంలో తప్పేమిలేదు. అదే అభివృద్ధి, హార్షణీయం కూడా.*

*విప్లవంలోనూ, నిర్మాణంలోనూ కూడా చైనా విశిష్టమైన, విభిన్నమైన మార్గాన్ని, ప్రక్రియలను అనుసరించింది. ఇది తెల్సిన విషయమే. వాటినే ఒరిజినల్ మార్గం అన్నారు సమీర్ అమీన్. ప్రత్యేకించి వ్యవసాయ సమస్యపై ఫోకస్ చేస్తూ అన్న మాటలివి. రష్యా విప్లవంలో లెనిన్ కొత్త అంశాలను అభివృద్ధి చేయలేదు. లెనిన్ మార్గంలో ఒరిజినాలిటి లేదు. మావోకి మాత్రమే ఆ లక్షణం ఉన్నది అని అమీన్ అనలేదు. అలా నేను రాయలేదు. లెనిన్ని కాదనడానికి ఈ విశ్లేషణ చేయలేదు.*

*'లెనిన్ మరణం తర్వాత రష్యాలో జరిగిన పరిణామాలకూ,అక్కడి వైఫల్యాలకూ లెనిన్ను ఎట్లా బాధ్యుడిని చేస్తాం?' అని ప్రశ్నించారు రచయిత. సమీర్ అమీన్ ఈ వ్యాసంలో ఆ సమస్యలోకే వెళ్లలేదు. అదిక్కడ చర్చనీయాంశం కాదు.*

*కాబట్టి సమీర్ అమీన్ అనని, ఇక్కడ రాయని అంశాల ఆధారంగా లెనిన్ పైన ఆయన తనపై పత్రంలో వ్యక్తం చేసిన అభిప్రాయాలు పూర్తిగా తప్పని చెప్పడంతప్పు.*

*సత్యనారాయణరెడ్డిగారు రష్యా విప్లవం లెనిన్ ల గురించి అనేక విషయాలు ప్రస్తావించారు. అందులో ఎవరూ కాదన(లే)ని అంశాలు చాలా ఉన్నాయి. అవి ఇక్కడ చర్చనీయాంశం కాదు.*

*చైనా తప్పుదారి పట్టిందనే రచనలు వీక్షణంలో చాలానే వచ్చాయి. ఆ విషయంలో సత్యనారాయణరెడ్డి గారు కోరుతున్నట్లు వీక్షణం కొత్తగా చొరవ తీసుకోవాల్సింది ఏమీలేదు. ఈ రెండో అభిప్రాయాన్ని ప్రచురించి చర్చకు దోహదం చేస్తున్నందుకు అభినందనలు.*

**– కె.జె.రామారావ్**

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# మళ్లీ ఎన్నికల ఎత్తుగడగా అయోధ్య వివాదం

వీక్షణం

ఎంతగా మతవిద్వేషాలు రెచ్చగొట్టి, మతోన్మాదహింసతో నెత్తుర్లు పారిస్తే, అంతగా ఆ నెత్తుటి పంట కోసుకోవచ్చుననే కుటిల ఆలోచనలతో సంఘ్ పరివార్ కనీసం మూడు దశాబ్దాలుగా మనుగడ సాగిస్తున్నది. 1980లలో సాగించిన ఏకాత్మతా రథయాత్రలు, సరిగ్గా 1989 ఎన్నికలకు ముందు ఎల్ కె అద్వానీ ప్రారంభించిన రామజన్మభూమి వివాదం, 1992 డిసెంబర్ 6న బాబ్రీ మసీదు విధ్వంసం, గుజరాత్ మతోన్మాద హింసాకాండ తర్వాత ఎన్నికలు వంటి ప్రయోగాలన్నిటిలోనూ సంఘ పరివార్ కు ప్రత్యక్ష ప్రయోజనాలు సిద్ధించాయి. రాజకీయాధికారమైనా చేజిక్కింది, ఎన్నికల ఫలితాలలో గణనీయమైన పెరుగుదల అయినా దక్కింది. ఆ రెండు తక్షణ ప్రయోజనాలు కాకపోయినా, సమాజం నిట్టనిలువునా చీలిపోవడం, హిందువులు తమనే రక్షకులుగా భావించడం, ముస్లింలు తమను చూసి భయోత్పాతంలో మునిగిపోవడం వంటి దీర్ఘకాలిక ప్రయోజనాలైనా సిద్ధించాయి. ఏప్రిల్ 2019లో సార్వత్రిక ఎన్నికలు జరగవలసి ఉన్న సమయంలో ఆ వ్యూహాన్నే మరొకసారి మరింత పకడ్బందీగా అమలు చేయడానికి సంఘపరివార్ శక్తులు పూనుకుంటున్నాయి. ఆరు నెలల ముందునుంచే పెద్ద ఎత్తున సన్నాహాలు చేస్తున్నాయి. ఈసారి కూడ ఈ విష కాషాయ ప్రయోగానికి పునాదిగా ఉన్నది దశాబ్దాల నాటి రామజన్మభూమి వివాదమే గాని కలిసి వచ్చినవి మాత్రం ఇటీవలి రాజకీయ పరిణామాలు, న్యాయస్థానాల పరిణామాలు.

అప్పటికే రెచ్చగొట్టిన మతవిద్వేషాలు, కాంగ్రెస్ అవినీతి ఆరోపణలు పునాదిగా 2014లో అభివృద్ధి నినాదం మీద, నరేంద్ర మోడీ పేరు మీద గెలిచిన భారతీయ జనతా పార్టీ ఈ నాలుగున్నర సంవత్సరాలలో ప్రతి ఒక్క రంగంలోనూ విఫలమయింది. చేసిన వాగ్దానాలలో ఏ ఒక్కటీ సగమో పావో అయినా నిలబెట్టుకోలేకపోయింది. విదేశీ అక్రమ ధన నిలువలను వెనక్కి తెచ్చి ప్రతి ఒక్కరికీ పంపిణీ చేస్తాననే వాగ్దానాన్ని తుంగలో తొక్కడం మాత్రమే కాదు, పెద్ద నోట్ల రద్దు, వస్తు సేవల పన్ను వంటి గుదిబండలను దేశ ప్రజల మీద మోపింది. దళితుల మీద, ముస్లింల మీద, ఆదివాసుల మీద, భిన్నాభిప్రాయాలు గలవాళ్లందరి మీద హంతక అసహనాన్ని ప్రదర్శించింది. ఈ క్రమంలో 2019 ఎన్నికల్లో అధికారం సంగతి అలా ఉంచి, గౌరవనీయమైన సంఖ్యలో స్థానాలైనా వస్తాయా అనే అనుమానం సంఘ పరివార్ అగ్ర నాయకత్వానికే మొదలయింది. నరేంద్ర మోడీ స్థానాన్ని మరొక నాయకుడి ముఖంతో బదలాయించినా గెలుపు అవకాశాలు బలపడతాయా అని అనుమానాలు మొదలయ్యాయి. ఈ స్థితిలో సంఘ్ పరివార్ ముందు మిగిలినవి రెండే మార్గాలు. ఒకటి, దేశంలో మరింతగా కుల, మత విద్వేషాలను రెచ్చగొట్టి, తద్వారా ప్రజల్లో మరింతగా చీలికలు తెచ్చి, విద్వేషం పెంచి, తామే రక్షకులమని కొందరిని నమ్మించి గెలుపుకు మార్గం సుగమం చేసుకోవడం, రెండు, రానున్న ఓటమిని అంగీకరించి, ఇంకా మిగిలిన పదవీకాలపు అతి తక్కువ సమయంలోనే వీలయినంతగా రాజ్యాంగ వ్యవస్థలన్నిటినీ ధ్వంసం చేయడం, పనికి రాకుండా చేయడం, వివాదాస్పదం చేయడం, భవిష్యత్తులో తన పునరుత్థానానికి వీలుగా తన మనుషులతో నింపడం.

గత ఐదారు నెలలుగా ఈ రెండు పనులూ ఉధృతంగా జరుగుతున్నాయి. అందులో భాగమే ఒకవైపు రామజన్మభూమి ఆందోళన పునరుద్ధరణ, మరొకవైపు సుప్రీం కోర్టు, సిబిఐ, ఆర్‌బిఐ, కేంద్ర ఇన్ఫర్మేషన్ కమిషన్ వంటి ఉన్నత సంస్థల విధ్వంసం. లేదా రెండు పనులనూ కలగలపడం.

అయోధ్యలో బాబ్రీ మసీదును కూల్చిన తర్వాత రెండున్నర దశాబ్దాలుగా అసలు ఆ స్థలం మీద యాజమాన్యం ఎవరిదనే వివాదం సుప్రీం కోర్టు ముందర నలుగుతున్నది. ఆ వివాదమే సంఘ్ పరివార్ ఎంత కోరుకున్నప్పటికీ అక్కడ ఆలయ నిర్మాణానికి అడ్డు పడుతున్నది. ఈ ఎన్నికల సందర్భంగా మళ్లీ ఒకసారి ఆ వివాదాన్ని పైకి తేవడానికి, ఆలయ నిర్మాణ అంశాన్ని తెరపైకి తెచ్చి ఎన్నికల నాటికి సమాజంలో మతోన్మాద విభజన రెచ్చగొట్టడానికి సంఘ్ పరివార్ పూనుకుంటున్నది. సుప్రీం కోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి దీపక్ మిశ్రా ఈ వివాదంలో అసలు ఇస్లాంలో మసీదు అవిభాజ్యమైనదా కాదా అనే అంశం మాత్రమే విచారించి, స్థల యాజమాన్య వివాదాన్ని అక్టోబర్ 29కి వాయిదా వేసి, అక్టోబర్ 2న పదవీ విరమణ చేశారు. తర్వాత ప్రధాన న్యాయమూర్తి రంజన్ గోగోయి దాన్ని జనవరికి వాయిదా వేయడం మాత్రమే కాదు, ఆ విచారణకు అంత తొందరేమీ లేదని సంఘ్ పరివార్ ఎన్నికల తొందర మీద నీళ్లు చల్లారు. ఈ నేపథ్యంలో సంఘ్ పరివార్ లో భాగమైన విశ్వహిందూ పరిషత్ నవంబర్ 25న అయోధ్యలో లక్ష మందితో ధర్మ సభ జరపాలనీ, రామ మందిర నిర్మాణాన్ని ప్రారంభించాలనీ, అయోధ్య–ఫైజాబాద్ ముస్లింలనూ, దేశవ్యాప్తంగా ముస్లింలనూ, ప్రగతిశీల శక్తులనూ ఆందోళనలో ముంచాలనీ పన్నాగం పన్నింది. ఈ ధర్మ సభ ఆయోధ్యలో రామ మందిరం నిర్మాణం మాత్రమే కాదు, వారణాసి లో జ్ఞాన్ వ్యాపి మసీదును కూల్చి విశ్వనాథాలయాన్ని నిర్మిస్తామనీ, ఢిల్లీలో జామా మసీదును కూలుస్తామనీ వీరాలాపాలు పలుకుతున్నది. ఈలోగా, ముస్లింలలో సున్నీలకూ షియాలకూ ఉన్న విభేదాలను కూడ తమ మత విద్వేష రాజకీయాలలో భాగం చేసుకోవడానికి కుటిల యత్నాలు పన్నుతున్న సంఘ్ పరివార్ షియా నాయకులను చేరదీస్తున్నది. ఉత్తరప్రదేశ్ షియా వక్ఫ్ బోర్డ్ అధినేత సయ్యద్ వసీమ్ రజ్వీ చేత రామజన్మభూమి అనే మతోన్మాద హింసాపూరిత డాక్యుమెంటరీ నిర్మింపజేసి దాని ట్రైలర్ ను నవంబర్ 26న విడుదల చేయించింది. అత్యంత అభ్యంతరకరమైన సంభాషణలతో, చిత్రాలతో ఉన్న, తీవ్రంగా రెచ్చగొట్టగలిగిన ఈ చిత్రాన్ని సంఘ్ పరివార్ ప్రచారం చేస్తున్నది. ఒకవైపు ఇలా హింసోన్మాదం పెచ్చరిల్లుతుంటే ప్రభుత్వం, అధికార యంత్రాంగం నిమ్మకు నీరెత్తినట్టు మౌన ప్రేక్షకులుగా ఉండిపోతున్నారంటే, సుప్రీం కోర్టు విచారణ వాయిదా వేయడం గురించి స్వయంగా ప్రధాని మోడీ అభ్యంతరకర వ్యాఖ్యలు చేశారంటే, ఈ వ్యవహారాన్ని సంఘ్ పరివార్ ఎటువైపు నడపదలచుకున్నదో స్పష్టంగా కనబడుతున్నది. ఈ వేడి ఇలాగే నాలుగైదు నెలలు సాగితే, దేశమంతా రగుల్కొంటే, సమాజం దహించుకుపోయే ఆ అగ్ని మీద ఈ చాయ్ వాలా గాని, చాయ్ వాలాను నడిపే నాగపూర్ కేంద్ర కార్యాలయం గాని అధికారాన్ని తిరిగి చేపట్టడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. 1930ల జర్మనీ పునరావృతమవుతున్నదనీ, ఆ చరిత్ర గుణపాఠాలతోనైనా ఈసారి నరహంతకులను ఆపాలనీ మరొకసారి హెచ్చరిక మోగుతున్నది. వీ

**సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ**

# పళ్లూడగొట్టుకోవడానికి ఏ రాయి అయితేనేమిటి?

**ఈ** సంపాదకీయం చదివే సమయానికి తెలంగాణ శాసనసభ ఎన్నికలు రోజుల్లోకో, గంటల్లోకో వస్తాయి. ఈ ఎన్నికల్లో ఎవరిని గెలిపించాలో, ఎవరిని ఓడించాలో అత్యధిక సంఖ్యాక పాఠకులు ఇప్పటికే నిర్ణయించుకుని ఉంటారు. ఎవరు గెలిచినా ఎవరు ఓడినా మౌలికమైన మార్పులేమీ రావని కూడ కొందరు నిర్లిప్తంగా ఉండి ఉంటారు. తెలంగాణలో ప్రజా సమస్యల్లో అత్యధిక భాగానికి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ పాలనే కారణమనీ అది తొలగిపోతే తెలంగాణ ప్రజాప్రయోజనాలు నెరవేరుతాయనీ 2014 దాకా ఉద్యమం ఆశించింది. ఏర్పడిన తెలంగాణను ఉద్యమ నాయకుల చేతుల్లో పెడితే ఉద్యమాకాంక్షలు నెరవేరుతాయని తెలంగాణ సమాజం 2014లో భావించింది. కాని నాలుగున్నరేళ్ల అనుభవంలో ఆ ఆశ నెరవేరలేదని రుజువైంది. తెలంగాణ సమాజపు ఆకాంక్షలు, ఉద్యమ కాలంలో ఈ నాయకులే చేసిన వాగ్దానాలు, చివరికి 2014 ఎన్నికల ప్రణాళికలో ఇచ్చిన హామీలు ఏ ఒక్కటీ సంపూర్ణంగా అమలు కాలేదు. పైగా ఏ దోపిడీ పీడక పాలనావిధానాన్ని కూలదోయడానికి తెలంగాణ ప్రజలు ఉద్యమించారో అదే పాలనా విధానం, ఆ మాటకొస్తే రెండాకులు ఎక్కువ చదివిన పాలనా విధానం ఈ నాలుగున్నరేళ్లలో అమలయింది. ఈ స్థితిలో మరొక నిర్ణయం తీసుకోవడానికి, పాలకులను కొనసాగించడానికి, లేదా మార్చడానికి ప్రజలకు మరొక అవకాశం వస్తున్నది. కాని ఇటువంటి నిర్ణయాత్మక సమయంలో ప్రజల ముందర రెండు వైపులా నమ్మకద్రోహమే ఎదురు నిలుస్తున్నది. ఒకవైపు నుయ్యి మరొక వైపు గొయ్యి కనబడుతున్నది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో తెలంగాణ ప్రజా ప్రయోజనాలను నెరవేర్చని వారూ, తెలంగాణ ఆకాంక్షలను వ్యతిరేకించిన వారూ ఒకవైపునా, ప్రత్యేక తెలంగాణలో తెలంగాణ ప్రజా ప్రయోజనాలను నెరవేర్చడానికి ప్రయత్నించని వారూ, పాత దోపిడీదారులకే పెద్దపీట వేసి, స్వార్థ స్వప్రయోజక, నిరంకుశ రాజ్యాన్ని నడిపిన వారూ మరొక వైపునా నిలబడి ఉన్నారు. నిజంగానే అధికారంలో ఉన్నవారిని దించివేద్దామనిపించేంత ఆగ్రహం కలిగినా, అవతలి వాళ్ల వైపు చూస్తే అనుగ్రహం కలిగే చరిత్ర గాని, ప్రవర్తన గాని ఏమీ లేదు. దేశంలో కొనసాగుతున్న పార్లమెంటరీ ఎన్నికల పద్ధతిలో నిజమైన ప్రజాభిప్రాయం వ్యక్తం కావడానికి అవకాశమే లేదనే సైద్ధాంతిక అవగాహన మరొకసారి రుజువయ్యే వాతావరణం నెలకొని ఉంది. ఇటువంటి డోలాయమాన స్థితిలో తప్పనిసరిగా భావోద్వేగాలకూ, డబ్బుకూ, మద్యానికీ, తాత్కాలిక ఆకర్షణలకూ, కుల మతాలకూ ప్రాధాన్యత పెరుగుతుంది. అంటే గెలుపు ఓటములను బట్టి ప్రజల అంగీకారాన్నో, తిరస్కారాన్నో నిర్ధారించలేని స్థితి తలెత్తుతుంది. అభ్యర్థులలో ఎవరు గెలిచి ఎవరు ఓడినా నిజమైన ఓటమి ప్రజలదే అవుతుంది, నిజమైన గెలుపు దోపిడీ, పీడనల పాలకవర్గ ముఠాలలో ఒక ముఠాదే అవుతుంది. అందువల్ల బుద్ధిజీవుల, ఆలోచనాపరుల ముందు ఉన్న ఏకైక కర్తవ్యం ఎవరి గెలుపు ఓటములకో కుంగిపోవడమో, పొంగిపోవడమో కాకుండా తమ చైతన్యాన్ని, ప్రశ్నా సంస్కృతిని, ధిక్కార స్వభావాన్ని, జాగరూకతను కాపాడుకోవడం మాత్రమే. నిరంతర జాగరూకతే ప్రజాస్వామ్యానికి మూల్యం అనే ప్రజాస్వామ్య మూలసూత్రానికి అర్థం ఎవరు గెలిచినా ఎవరు ఓడినా ప్రజలు మాత్రం నిరంతరం జాగరూకంగా ఉండవలసిన అవసరం ఉంటుందని మాత్రమే. తెలంగాణ సమాజానికి దశాబ్దాలుగా ఆ జాగరూకత ఉంది. అప్పుడప్పుడు నివురు కమ్మినట్టు కనిపిస్తున్న ఆ నిరంతర జాగరూక నిప్పుకణిక ఆరిపోకుండా కాపాడడమే బుద్ధిజీవుల కర్తవ్యం. వీ

**సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్**

# అన్నార్తులకు సహాయం అందించడమే రాజద్రోహం!

**చం**ద్రబాబు నాయుడు రాజకీయాలనూ, విధానాలనూ, వ్యవహార సరళినీ, నిరంకుశత్వాన్నీ రెండు దశాబ్దాలకు పైగా నిత్యమూ గమనిస్తున్నవారు కూడ ఇంకా ఇన్ని కళలున్నాయా అని ఆశ్చర్యపోయేంతగా కొత్త ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు నడుస్తున్నాయి. వ్యవస్థను మార్చే ఆలోచనాచరణలో, భిన్నాభిప్రాయాలో మాత్రమే కాదు, చివరికి అన్నార్తులకు సహాయం అందించే మానవీయ స్ఫూర్తి కూడ రాజద్రోహంగా పరిగణించే విచిత్ర అమానుష స్థితికి ఆంధ్రప్రదేశ్ రాజకీయవ్యవస్థను దిగజార్చిన ఘనత చంద్రబాబు నాయుడుదే. అక్టోబర్ 11న శ్రీకాకుళం జిల్లా మీద విరుచుకుపడిన తిత్లీ తుపాను సృష్టించిన బీభత్సం అందరికీ తెలుసు. ఆ తుపాను తాకిడికి దాదాపు రెండువేల గ్రామాల్లో రెండు లక్షలకు పైగా కుటుంబాలు దెబ్బతిన్నాయి. యాభై వేల ఇళ్లు ధ్వంసమయ్యాయి, నాలుగు లక్షల ఎకరాల వ్యవసాయ పంటలు, లక్ష ఎకరాల కొబ్బరి, జీడిమామిడి తోటలు ధ్వంసమయ్యాయి. ఒక్క మాటలో చెప్పాలంటే శ్రీకాకుళం జిల్లాలోని దాదాపు డజను మండలాలలో జనజీవనం అస్తవ్యస్తమయింది, పెను విషాదం సంభవించింది. ఈ విషాదానికి గురైన ప్రజలకు తక్షణమే అవసరమైన సహాయ పునరావాస చర్యలు చేపట్టవలసిన ప్రభుత్వ యంత్రాంగం దారుణమైన తాత్సారాన్నీ, అలక్ష్యాన్నీ ప్రదర్శించింది. వారాల తరబడి సహాయ చర్యలు అందలేదు. సహాయ చర్యల కోసం బాధిత ప్రజానీకం ఆందోళనలు జరపవలసి వచ్చింది. ఆందోళన జరుపుతున్న బాధితుల మీద పోలీసు నిర్బంధం కొనసాగింది. నష్టపరిహారం కోసం నష్టాన్ని నమోదు చేయడంలో, నష్టపరిహారం అందించడంలో రాజకీయ ఒత్తిళ్లకు లోనైన అధికార యంత్రాంగం అవకతవకల నమోదులు చేసి, అక్రమంగా నష్టపోనివారికి పరిహారాలు, నష్టపోయినవారికి నిరాకరణలు సాగించింది. ఈ నేపథ్యంలో, ఉద్యమాల మారు పేరు అయిన ఈ ఉద్దాన ప్రాంతపు బాధితులే స్వయంగా తిత్లీ తుపాను బాధితుల కమిటీగా ఏర్పడి వాస్తవ నష్టపు లెక్కలు తయారు చేశారు. ప్రభుత్వం దృష్టికీ, ప్రజల దృష్టికీ తీసుకువచ్చారు. ఒకవైపు నష్ట పరిహారం కోసం, సహాయ పునరావాస చర్యలలో తోడ్పాటు కోసం కేంద్ర ప్రభుత్వానికి విజ్ఞప్తులు చేస్తున్న రాష్ట్ర ప్రభుత్వం ఈ వాస్తవ గణాంకాలు తయారుచేస్తున్నవారి మీద ఉక్కుపాదం మోపడం మొదలుపెట్టింది. ఈ గణాంకాల ఆధారంగా, బాధితులకు కనీసం బియ్యం వంటి నిత్యావసర వస్తువులైనా అందజేద్దామని రాష్ట్రవ్యాప్తంగా ప్రజాసంఘాలు, దాతలు మానవతా దృష్టితో ముందుకొచ్చారు. ఎన్నోచోట జోలెపట్టి సేకరించిన బియ్యం బాధితులకు పంచడానికి శ్రీకాకుళం తీసుకువెళ్లారు. అలా బియ్యం తీసుకువెళ్లి పంచుతున్న దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమం, ప్రజా కళా మండలి, అమరుల బంధుమిత్రుల సంఘం, తుపాను బాధితుల కమిటీలకు చెందిన పద్నాలుగు మంది కార్యకర్తలను, నాయకులను అరెస్టు చేసి రాజద్రోహం, నేరపూరిత కుట్ర, ప్రజాభద్రతకు భంగం వంటి ఎన్నో నేరాలు ఆరోపించి జైలు పాలు చేశారు. నిర్బంధాల, దుర్మార్గాల చరిత్రలో తన రికార్డును తానే అధిగమించడానికి చంద్రబాబు నాయుడు కంకణం కట్టుకున్నట్టున్నారు. ఈ సమాజంలో బాధితులకు, అన్నార్తులకు బియ్యం పంచడం ఎప్పటినుంచి రాజద్రోహంగా, కుట్రగా, ప్రజాభద్రతకు భంగకరంగా పరిగణించబడుతున్నాయని ప్రశ్నించడం ఇవాళ బుద్ధిజీవుల కనీస బాధ్యత. వీ

# శ్రీలంకలో రాజకీయ సంక్షోభం

- బైరెడ్డి సతీష్

బాధ్యతాయుతమైన అత్యున్నత పదవిలో ఉన్నవాళ్లు అహంతో, అధికార దాహంతో వ్యవహరిస్తే దేశం ఏ విధంగా సంక్షోభంలోకి నెట్టబడుతుందో శ్రీలంక అధ్యక్షుడు మైత్రిపాల సిరిసేన నిరూపించారు. 2015లో ఆనాటి అధ్యక్షుడైన మహేంద్ర రాజపక్స మంత్రివర్గంలో సభ్యుడైన, నేటి అధ్యక్షుడైన సిరిసేన సైద్ధాంతికంగా భిన్న ధృవాలైన రాణిల్ విక్రమ సింఘే నాయకత్వంలోని శ్రీలంక నేషనల్ పార్టీతో జతకట్టి జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పర్చారు. గత మూడున్నర ఏళ్లుగా అనేక భేదాభిప్రాయాలు ఉన్నప్పటికీ ఆనాటి పరిస్థితులు సృష్టించిన అనివార్యత వల్ల ప్రభుత్వాన్ని నెట్టుకొస్తున్నారు. ఆకస్మికంగా దేశం మొత్తాన్ని ఆశ్చర్యానికి గురిచేస్తూ ప్రధాని విక్రమసింఘేను పదవి నుండి తొలగిస్తూ, ఒకప్పటి మిత్రుడు అనేక అవినీతి ఆరోపణలు, మానవ హక్కుల ఉల్లంఘనలు, అనేక మంది తమిళ మైనారిటీల హత్యలకు కారణమైన రాజపక్సను ప్రధాని పీఠంపై కూర్చోబెట్టడమే కాకుండా పార్లమెంట్‌లో మెజారిటీ 'సంపాదించు'కునేందుకై పార్లమెంట్‌ను నిరవధికంగా వాయిదా వేశాడు. దేశం ఎదుర్కొంటున్న రాజకీయ, ఆర్థిక సంక్షోభం, తన హత్యకు కుట్ర స్థితిలో గత్యంతరం లేక ఈ నిర్ణయం తీసుకున్నానని తన చర్యను సమర్థించుకున్నాడు.

ఈ చర్యను అప్రజాస్వామిక మైనదిగా, రాజ్యాంగ విరుద్ధమైనదిగా విక్రమ సింఘేను రాజకీయంగా వ్యతిరేకించినవారు సైతం బలంగా అభిప్రాయ పడ్డారు. దేశ రాజ్యాంగానికి జరిగిన 19వ సవరణ ద్వారా అధ్యక్షుడికి ప్రధానిని తొలగించే అధికారం లేదు. 42 (4) ఆర్టికల్ ప్రకారం పార్లమెంట్ విశ్వాసాన్ని చూరగొన్న వ్యక్తిని మాత్రమే ప్రధానిగా నియమించాలని శ్రీలంక రాజ్యాంగంలో స్పష్టంగా పేర్కొనబడింది. అధ్యక్షుడు తనకు లేని అధికారాన్ని ఆపాదించుకోవడమే కాకుండా అప్రజాస్వామికంగా వ్యవహరించి రాజ్యాంగ ఉల్లంఘనకు పాల్పడ్డాడు. పార్లమెంట్ స్పీకర్ నూతన ప్రధానిని గుర్తించ నిరాకరించడమే కాకుండా నూతనంగా నియమించబడిన రాజపక్స పైన అవిశ్వాస తీర్మానాన్ని ప్రవేశపెట్టేలా వ్యవహరించి, దాన్ని చర్చించేందుకు పార్లమెంట్‌ను సమావేశపరిచిన సందర్భంలో రాజకీయ ప్రత్యర్థులు ఒకరిపై ఒకరు భౌతిక దాడులకు దిగి దేశ ప్రతిష్ఠను మరింత దిగజార్చేలా వ్యవహరించారు. 225 మంది సభ్యులున్న హౌజ్‌లో 122 మంది సభ్యులు రాజపక్సను నిర్ద్వందంగా తిరస్కరించారు. ఈ స్థితిని గమనించి అధ్యక్షుడు సిరిసేన ఏకంగా పార్లమెంట్‌నే రద్దుపరిచి మధ్యంతర ఎన్నికలను ప్రకటించాడు. పార్లమెంట్‌ను పరిగణనలోకి తీసుకోకుండా రద్దుపరిచే చర్య పూర్తిగా రాజ్యాంగ విరుద్ధమని ప్రజాస్వామ్య స్ఫూర్తికి వ్యతిరేకమని ప్రతిపక్షాలు శ్రీలంక సుప్రీంకోర్టు తలుపు తట్టగా దేశ అధ్యక్షుడు తీసుకున్న నిర్ణయాన్ని కోర్టు కొట్టివేయడంతో పరిస్థితి మరింత సంక్లిష్టంగా మారిపోయింది.

రోజురోజుకి దిగజారిపోతున్న ఆర్థికవ్యవస్థ పైన దృష్టి పెట్టకుండా విద్యా, ఉపాధి రంగాలను గాలికొదిలేసి వ్యక్తిగత అహాల చుట్టూ దేశ ప్రయోజనాలను తిప్పుకొనే స్థాయికి రాజకీయ వ్యవస్థను తీసుకురావడం అత్యంత ప్రమాదకరం. దశాబ్దాలుగా అణచివేతకు, పీడనకు గురైన శ్రీలంక మైనారిటీలు ముఖ్యంగా తమిళుల గాయాలు మానే దిశలో నిజాయితీ నిబద్ధతతో కూడిన కార్యాచరణ రూపుదాల్చకముందే 'రాజపక్స'ల రాకడ మళ్లీ ఆ సమూహాన్ని భయాందోళనకు గురిచేస్తున్నది. రాజనీతిజ్ఞతను ప్రదర్శించి తక్షణమే దేశ అధ్యక్షుడు సిరిసేన పార్లమెంట్ విశ్వాసం పొందగలిగే మరో నాయకుడిని ప్రధానిగా నియమించడమో లేదా విక్రమ సింఘేతో ఉన్న వైరుధ్యాలను పరిష్కరించుకొని రాజ్యాంగ స్ఫూర్తిని, వ్యవస్థీకృతమైన ప్రజాస్వామిక విలువలను ఎత్తిపట్టేలా వ్యవహరించడం మినహా మరో గత్యంతరంలేదు. ఉన్నా వాంఛనీయం కాదు. వీ





❖ **బతుకు వెతుకులాట** – కనిపిస్తారు మీరూ ఒకచోట – రాయలసీమ మాండలిక పద పరిమళం – సడ్లపల్లె చిదంబర రెడ్డి – తపన సాహిత్య వేదిక ప్రచురణలు – 508 పేజీలు, 1/8 డెమీ, రు. 400, ప్రతులకు: పి. కళానిధి, ఇ.నెం. 21-6-139, వెలుగు-చిగురు, టీచర్స్ కాలనీ, హిందుపురం, అనంతపురం-515211, ఫోన్: 9440073636, 08556-297255



❖ **ఊరు ఒక నారుమడి** – కవిత్వం – జూకంటి జగన్నాథం – నయనం ప్రచురణలు – 108 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: జూకంటి జగన్నాథం ఇ.నెం. 6-5-101, విద్యానగర్, సిరిసిల్లా, కరీంనగర్ – 505301, ఫోన్: 9441078095



❖ **వరి కల్లం** – కవిత్వం – నాగవర్మ ముత్యం – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఇ.నెం. 16-11-20/6/1/1, 403, విజయ సాయి రెసిడెన్సీ, సలీమ్‌నగర్, మలక్‌పేట, హైదరాబాద్-36, ఫోన్: 27678430



❖ **కొత్త చరిత్ర** – తెలంగాణ రాష్ట్రం-అస్తిత్వ చైతన్యం – బి.ఎస్. రాములు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 304 పేజీలు, 1/8 డెమీ, రు. 200



❖ **సౌందరనందము** – పింగళి లక్ష్మీకాంతం – కాటూరి వేంకటేశ్వరరావు – నవచేతిన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 89 పేజీలు, 1/8 డెమీ, రు. 70,
పై రెండు ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జిఎస్ఐ పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్ – 500068



❖ **మోడీ నాలుగేళ్ల దుష్పరిపాలన-2 – రాజ్యాంగం ధిక్కారం నిర్వీర్యం నాశనం** – సిపిఐ (ఎం) ప్రచురణ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 15



❖ **మోడీ నాలుగేళ్ల దుష్పరిపాలన-3 – వాగ్దానాల భంగం ప్రజలకు ద్రోహం** – సిపిఐ (ఎం) ప్రచురణ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 15



❖ **మోడీ నాలుగేళ్ల దుష్పరిపాలన-4 – జీవితాలకు, భవిష్యత్తుకు ప్రమాదం** – సిపిఐ (ఎం) ప్రచురణ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 15,
పై మూడు ప్రతులకు: సిపిఐ (ఎం) రాష్ట్ర కమిటీ కార్యాలయం, ఇ.నెం. 27-13-3, ఆకుల వారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ-2, ఫోన్: 0866 – 2577202, 9490098042



❖ **అనేక రామాయణాలు** – వ్యాస సంకలనం – సంపాదకత్వం: పౌలా రిచ్మాన్ – తెలుగు అనువాదం పి. సత్యవతి – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500 006



❖ **మమతల మల్లెలు** – కథల సంపుటి – డా. తాళ్లపల్లి యాకమ్మ – అమ్ములు నాని ప్రచురణలు-115 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: సోమారపు వీరస్వామి, ఇ.నెం. 1-6-64, నర్సంపేట్‌రోడ్, గుమ్మనూర్, మహబూబాబాద్-506101, ఫోన్ : 9849963491, 9704226681



❖ **అశోక నివాళి** – మొదటి భాగం – సింగంపల్లి అశోక్ కుమార్ – ఆలోచన ప్రచురణ – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 100



❖ **అశోక నివాళి** – రెండవ భాగం – సింగంపల్లి అశోక్ కుమార్ – ఆలోచన ప్రచురణ – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 100
పై రెండు ప్రతులకు: ఆలోచన ప్రచురణ, ఫ్లాట్ నెం. 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతీనగర్, విజయవాడ – 520004, ఫోన్: 0866 – 6617375,



❖ **స్పందన** – కథా సంపుటి – డా. అమృతలత – అపురూప పబ్లిషర్స్-206 పేజీలు, 1/8 డెమీ, రు.150



❖ **సృష్టిలో తీయనిది** – డా. అమృతలత – అపురూప పబ్లిషర్స్ – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 100,
పై రెండు ప్రతులకు: డా. అమృతలత, విజయ హైస్కూల్, ముబారక్‌నగర్, నిజామాబాద్ – 503003, ఫోన్: 08462 – 237887, సెల్: 9848868068



❖ **మార్పుకు పిడికిలి అడ్డుపెడుతున్న మార్క్సిస్టులు** – విజయవిహారం రమణమూర్తి – జైభారత్ పబ్లికేషన్స్ ప్రచురణ – 50 పేజీలు, 1/8 డెమీ, రు. 18



❖ **జైభారత్ పాటలు** – 'ఖదిజ్జాసి క్రాంతికారి కళామంచ్' సమర్పణ – జైభారత్ పబ్లికేషన్స్ ప్రచురణ – 70 పేజీలు, 1/8 డెమీ, రు. 50
పై రెండు ప్రతులకు: జైభారత్ పబ్లికేషన్స్, ఇ.నెం. 3-8-347, మన్సూరాబాద్, చంద్రపురి కాలనీ, ఎల్.బి. నగర్, హైదరాబాద్-500074, పోన్: 9848019076

# పార్టీల వాగ్దానాలు - ప్రజల ఆకాంక్షలు

*ప్రతి ఎన్నికల సందర్భంలోనూ ప్రజలు తమ ఆకాంక్షలు ప్రకటించడం, పోటీ పడుతున్న రాజకీయ పక్షాలు తాము అధికారానికి వస్తే ఏమేమి చేస్తామో ప్రణాళికలు ప్రకటించడం ఆనవాయితీ. ప్రణాళికలో చేసిన వాగ్దానాలకు ఎప్పుడూ కట్టుబడకపోయినా, ఆ వాగ్దానాలలో పదో వంతు కూడా నెరవేర్చకపోయినా ఎన్నికల ప్రణాళిక విడుదల, దాని మీద చర్చ ప్రతి రాజకీయ పార్టీకి, పత్రికలకు దశాబ్దాలుగా అలవాటయిన పనులు. ప్రస్తుత తెలంగాణ ఎన్నికలలో ప్రజలూ, ప్రజల తరఫున వివిధ ప్రజాసంఘాలూ, సంస్థలూ చాలా ముందుగానే తమ ఆకాంక్షలు ప్రకటించాయి. రాజకీయ పక్షాలు మాత్రం తమ మొక్కుబడి ప్రణాళికలు ప్రకటించడానికి కూడా మల్లగుల్లాలు పడ్డాయి. ఒకరి కంటె ఒకరు హెచ్చు వాగ్దానాలు చేయడానికి ప్రతి ఒక్కరూ అవతలి వారి కోసం వేచి చూస్తూ కాలం గడిపారు. ఇది రాస్తున్న నవంబర్ 28 నాటికి, అంటే ఎన్నికలకు సరిగ్గా పది రోజుల ముందు కూడా తెలంగాణ రాష్ట్ర సమితి, భారతీయ జనతా పార్టీ తమ ప్రణాళికలే విడుదల చేయలేదు. 2014లో తెలంగాణ రాష్ట్ర సమితి ప్రణాళిక ముసాయిదాను చాలా ముందే తయారు చేసి, ఉద్యమంలో పాల్గొన్న ప్రముఖ మేధావులందరినీ ఒకరోజు భోజనానికి పిలిచి, రోజంతా ప్రణాళిక చర్చించి, ఎన్నికలకు చాలా ముందే విడుదల చేసింది. అంత కసరత్తు చేసిన ప్రణాళికనే తుంగలో తొక్కగలిగినప్పుడు ఇప్పుడు అసలు కసరత్తూ, ప్రణాళికా ఎందుకని భావించినట్టున్నారు. ఇప్పటి వరకు ప్రణాళికలు విడుదల చేసిన రాజకీయ పార్టీల వాగ్దానాలను, ప్రజల ఆకాంక్షలను ఒక్కచోట తులనాత్మకంగా పరిశీలించడం కోసం ఇక్కడ పొందుపరుస్తున్నాం. రాజకీయ పార్టీల ప్రణాళికల, ప్రజా సంస్థల ఆకాంక్షల క్రోడీకరణ* **వై. రామచంద్రం.**

### కాంగ్రెస్

- ఒకే దఫాలో రు. 2 లక్షల వరకు రైతుల వ్యవసాయ రుణాలు మాఫీ.
- సహకార రంగంలో రైతులు తీసుకున్న ఎల్‌టి రుణాలపై వడ్డీ ప్రభుత్వమే భరిస్తుంది.
- ఎకరానికి రు. 5 వేల చొప్పున పెట్టుబడి సహాయం.
- రైతులకు రు. 5 వేల కోట్లతో ధరల స్థిరీకరణ నిధి ఏర్పాటు.
- ప్రత్యేక రైతు సంక్షేమ, వ్యవసాయ బడ్జెట్, వ్యవసాయ శాఖ పేరు 'రైతు సంక్షేమ వ్యవసాయ అభివృద్ధి శాఖ'గా మార్పు.
- తెలంగాణ ఏర్పడ్డాక ఆత్మహత్య చేసుకున్న రైతు కుటుంబాలకు ఆర్థిక సాయం.
- పంపుసెట్లపై వసూలు చేస్తున్న రు. 83 కోట్ల విద్యుత్ సర్ ఛార్జీల ఎత్తివేత.
- 17 రకాల పంటలకు కనీస గిట్టుబాటు ధర కల్పిస్తాం.
- నిరుద్యోగులకు నెలకు రు. 3 వేల భృతి.
- 20 వేల పోస్టులతో మెగా డిఎస్‌సి.
- ఏడాదిలోపే లక్ష ప్రభుత్వ ఉద్యోగాల భర్తీ.
- రెగ్యులర్‌గా డిఎస్‌సి నిర్వహణ, డిగ్రీ పర్సంటేజీతో నిమిత్తం లేకుండా బిఇడి, డిఇడి, టెట్ అర్హతలున్నవారికి డిఎస్‌సి అవకాశం.
- డిఎస్‌సి 1994, 1996, 1998, 2008 నోటిఫికేషన్లలో ఎంపికైన బిఇడి అభ్యర్థులకు న్యాయం.
- మలిదశ ఉద్యమకారుల కుటుంబాలకు రు. 10 లక్షల ఆర్థికసాయం, వారి కుటుంబాల్లో అర్హులైనవారికి పెన్షన్, ఆరోగ్యకార్డు, ఉచిత బస్‌పాస్, డబుల్ బెడ్‌రూమ్ ఇల్లు. ఉద్యమకారులపై కేసుల ఎత్తివేతకు కృషి.
- ప్రభుత్వ కాంట్రాక్టు పనుల్లో ఉద్యమంలో పాల్గొన్న యువతకు ప్రాధాన్యం.
- రాష్ట్ర ఖజానాలో 20 శాతం ఆదాయం విద్య కోసం ఖర్చు.
- ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం అమలు...రెండు వాయిదాల్లో ఫీజు చెల్లింపు.
- ఆరోగ్యశ్రీ పథకం కింద అన్నిరకాల వ్యాధులకు రు. 5 లక్షలు వర్తింపు.
- అర్హులైన ప్రతి కుటుంబానికి సొంత ఇంటి స్థలంలో ఇల్లు నిర్మించుకోవడానికి రు. 5 లక్షలు, ఎస్.సి., ఎస్.టి.లకు రు. 6 లక్షలు.
- ఇందిరమ్మ ఇళ్ల పాత బకాయిలు చెల్లింపు. అదనపు గదికి రు. 2 లక్షలు.
- ఎస్.సి.ల వర్గీకరణ అమలుకు చర్యలు.
- అర్హులైన ఎస్.సి., ఎస్.టి.లకు 200 యూనిట్ల ఉచిత విద్యుత్ సరఫరా.
- బి.సి.ల నుంచి టిఆర్‌ఎస్ తీసేసిన 26 కులాలు తిరిగి చేర్పు.
- ప్రభుత్వంలో ఆర్.టి.సి. విలీనం, ప్రభుత్వ ఉద్యోగుల వయో పరిమితి 60 ఏళ్లకు పెంపు.
- పదవీ విరమణ సమయంలో... తెలంగాణ ఇంక్రిమెంట్ చెల్లింపు.
- పోలీసులకు వారాంతపు సెలవు కచ్చితంగా అమలు.

### తెలుగుదేశం

- కాళోజీ నారాయణరావు పేరిట ప్రతి జిల్లా కేంద్రంలో సాంస్కృతిక వేదికల ఏర్పాటు. దాశరథి రంగాచార్య పేరిట పురస్కారాలు.
- హైదరాబాద్‌లో ధర్నాచౌక్ పునరుద్ధరణ. జిల్లా, మండల కేంద్రాల్లో ధర్నాచౌక్‌ల ఏర్పాటు.
- విభజన అంశాల అమలుకు కేంద్రంపై ఒత్తిడి, ముఖ్యమంత్రి, మంత్రుల నివాసాలు, కార్యాలయాలు శాశ్వత ప్రాతిపదికన ఏర్పాటు.
- నిరుద్యోగ యువతకు ప్రతి నెలా రు. 3 వేల భృతి.
- ప్రభుత్వం ఏర్పాటైన తొలి ఏడాదే లక్ష ఉద్యోగాల భర్తీ.
- ఇంటర్ నుంచి యూనివర్సిటీ స్థాయిదాకా విద్యార్థులకు ఉచితంగా ల్యాప్ టాప్‌లు.
- ప్రగతి భవన్‌ను ప్రజా ఆస్పత్రిగా మార్పు. ప్రభుత్వ ఆస్పత్రిల్లో మౌలిక సదుపాయాలు మెరుగుపరచడానికి రు. 5 వేల కోట్ల కేటాయింపు.
- రాష్ట్ర వ్యాప్తంగా ఐలమ్మ మహిళా సాధికారత కార్యక్రమాల నిర్వహణ, బెల్ట్‌షాపుల రద్దు.
- గర్భిణుల ఆరోగ్యం, పౌష్టికాహారానికి రు. 15 వేలు అందజేత.

- పేదకుటుంబాల యువతులకు పెళ్లి సమయంలో రు. 1.50 లక్షల అందజేత.
- 8వ తరగతి నుంచి ఇంటర్ వరకు బాలికలకు ఉచితంగా సైకిళ్లు.
- బి.సి.లు, మైనారిటీలకు సబ్‌ప్లాన్ అమలు.
- ఎస్.సి రిజర్వేషన్ల వర్గీకరణకు చర్యలు.
- వికలాంగులకు రు. 3 వేల పెన్షన్. 60 ఏళ్లు దాటిన వృద్ధులు, అనాథలు, వితంతువులకు రు. 2 వేల పెన్షన్. ప్రభుత్వ ఉద్యోగులకు గతంలో ఉన్న పెన్షన్ విధానం అమలు.
- ఉద్యోగుల పదవి విరమణ వయసు 60 ఏళ్లకు పెంపు.
- సొంత స్థలంలో ఇల్లు కట్టుకునేవారికి రు. 5 లక్షల ఆర్థిక సహాయం.
- రు. 2 లక్షల వరకు వ్యవసాయ రుణ మాఫీ. కౌలు రైతులకూ వర్తింపు.
- వ్యవసాయరంగానికి 24 గంటల ఉచిత నాణ్యమైన విద్యుత్.
- రాష్ట్ర వ్యాప్తంగా కార్పొరేషన్‌లు, మునిసిపాలిటీలు, మండల స్థాయిల్లో ఎన్‌టిఆర్ క్యాంటిన్‌ల ఏర్పాటు. రు. 5కే పౌష్టికాహారం.
- ప్రతి కుటుంబంలో ఒక్కో సభ్యుడికి 7 కిలోల నాణ్యమైన బియ్యం. రూపాయికే కిలో చొప్పున పంపిణీ.
- జర్నలిస్టుల, లాయర్ల సంక్షేమానికి ప్రత్యేక చర్యలు.
- వికలాంగులకు ప్రభుత్వ ఉద్యోగాల్లో రిజర్వేషన్ల అమలు.
- చేనేత కార్మికులకు రు. 5 లక్షలతో ఇల్లు, షెడ్డు కోసం ప్రత్యేకంగా నిధుల మంజూరు.
- రైతులను ఆదుకునేందుకు మార్కెట్ ఇంటర్వెన్షన్ పథకానికి రు. 10 వేల కోట్లు కేటాయింపు.
- ట్రాఫిక్ సమస్యలేని నగరంగా, అండర్‌గ్రౌండ్ కేబుల్ ప్రజలకు ఇబ్బందుల్లేని నగరంగా తీర్చిదిద్దేందుకు చర్యలు.

## తెలంగాణ జన సమితి

- రాష్ట్రంలో తెలంగాణ జన సమితి నేతృత్వంలో ఏర్పడబోయే ప్రభుత్వంలో ప్రజలకు రోజూ ఉదయం ఒక గంటపాటు ముఖ్యమంత్రి అందుబాటులో ఉంటారు.
- ప్రభుత్వ పాలనలో పారదర్శకత, ప్రజాస్వామ్యం, జవాబు దారీతనాన్ని పెంచడానికి పౌరసమాజం నుంచి సలహాలను స్వీకరిస్తాం.
- రైతులకు ఏకకాలంలో రు. 2 లక్షల రుణమాఫీ, తొలి ఏడాదిలోనే లక్ష ఉద్యోగాల కల్పన, ఏటా నియామక క్యాలెండర్, రు. 3 వేల నిరుద్యోగ భృతి.
- వంద రోజుల్లోపు ఉద్యమ కేసుల ఎత్తివేత. ఏడాదిలోగా అమరుల స్మృతి చిహ్నం నిర్మాణం. ధర్నాచౌక్‌ను పునరుద్ధరించడంతోపాటు ప్రగతి భవన్‌ను తెలంగాణ మ్యూజియంగా మార్పు.
- నాలుగున్నరేళ్లుగా జరిగిన భారీ కాంట్రాక్టుల కేటాయింపులపై న్యాయ విచారణ.
- ప్రైవేటు యూనివర్సిటీల చట్టం రద్దు.
- పౌరసేవా చట్టం ద్వారా అన్ని పథకాల ప్రయోజనాలు ప్రజలకు హక్కుగా అందే అవకాశం.
- తెలంగాణ రాష్ట్ర ప్రయోజనాలకు విరుద్ధంగా ఉన్న ఆర్టికల్ 8 రద్దు.
- తెలంగాణ భూసేకరణ చట్టం–2016 రద్దు.
- పార్టీ ఫిరాయింపుల చట్టానికి సవరణలు.
- విద్య కోసం రాష్ట్ర బడ్జెట్‌లో 21 శాతం నిధులు.
- 100 యూనిట్ల వరకు ఉచిత విద్యుత్. మల్లన్న సాగర్ రిజర్వాయర్ సామర్థ్యాన్ని 5 టిఎంసిలకు తగ్గింపు.
- పాలమూరు–రంగారెడ్డి, కాళేశ్వరం ప్రాజెక్టులపై సమీక్ష.
- కొత్త జిల్లాలు, జోనల్ వ్యవస్థ ఏర్పాటుపైనా సమీక్ష.
- నయీం డైరీ, మియాపూర్ భూ కుంభకోణం పై న్యాయవిచారణ.
- బెల్టు షాపులు, పర్మిట్ రూముల ఎత్తివేత.

## సిపిఐ

- వ్యవసాయ రంగానికి ప్రత్యేక బడ్జెట్‌తో పాటు రైతులతో సమానంగా కౌలుదారులకూ అన్ని పథకాల అమలు.
- భూ చట్టాలను మార్చి కొత్త వాటిని తీసుకురావడంతో పాటు సమగ్ర భూ సర్వే జరపడం.
- రీడిజైనింగ్ చేసిన ప్రాజెక్టులను సమీక్షించడంతో పాటు భూ నిర్వాసితులకు 2013 భూసేకరణ చట్టాం అమలు.
- అమరవీరుల కుటుంబాల అందరికీ రు. 25 లక్షల ఆర్థిక సాయం, హైదరాబాద్‌లో 200 గజాల ఇంటి స్థలం, ఇంట్లో ఒకరికి ఉద్యోగం.
- రు. 2 లక్షల వరకు ఒకే విడతలో వ్యవసాయ రుణమాఫీ.
- నేరెళ్ల ఘటనలో గాయపడిన దళితులు, బాధితులకు పరిహారం, ఉపాధి కల్పన.
- నయీం కేసుపై సమగ్ర విచారణ.
- ప్రాజెక్టుల్లో అవినీతి వెలికి తీయడం.
- తెరాస హయాంలో ఉద్యమకారులపై బనాయించిన కేసుల మాఫీ.
- రాష్ట్రంలో జరిగిన ఎన్‌కౌంటర్లపై సమగ్ర విచారణ.
- ప్రాజెక్టుల్లో అవినీతిని వెలికి తీయడం.
- తెరాస హయాంలో ఉద్యమకారులపై బనాయించిన కేసుల మాఫీ.
- రాష్ట్రంలో జరిగిన ఎన్‌కౌంటర్లపై సమగ్రవిచారణ, బాధితులకు సాయం.
- మద్య నియంత్రణకు కఠిన చర్యలు.

## మహాకూటమి కనీస ఉమ్మడి ప్రణాళిక

- అధికారంలోకి వచ్చిన మొదటి సంవత్సరంలో లక్ష ఉద్యోగాలు.
- రైతులకు ఏక కాలంలో రు. 2 లక్షల చొప్పున రుణమాఫీ.
- జిల్లాలు, జోనల్ వ్యవస్థలపై సమీక్ష.
- సాగునీటి కాంట్రాక్టుల్లో ఈపీఎస్ వ్యవస్థ రద్దు, స్థానిక కాంట్రాక్టర్లకే ప్రాధాన్యం.
- కర్ణాటక తరహాలో లోకాయుక్త వ్యవస్థ బలోపేతం.
- రు. 10 వేల కోట్లతో ధరల స్థిరీకరణ నిధి.
- ప్రభుత్వోద్యోగులకు పాత పెన్షన్ విధానం వర్తింపు.
- పరిశ్రమల్లో స్థానిక యువతకు ఉద్యోగాల్లో రిజర్వేషన్లు.
- ప్రతి గ్రామానికి పక్కా రోడ్డు, రక్షిత మంచినీరు, బస్సు సౌకర్యం.
- భూమి లేని నిరుపేద ఎస్‌సి, ఎస్‌టి కుటుంబాలకు 3 ఎకరాల భూమి, అర్హులందరికీ ఇచ్చేంతవరకు నెలకు రు. 3 వేల ఆర్థిక సాయం.
- అర్హులైన జర్నలిస్టులందరికీ అక్రెడిటేషన్, వైద్య సౌకర్యం, గృహ వసతి, సంక్షేమం కోసం ప్రత్యేక నిధి.
- 104, 108 సేవలు ప్రభుత్వ పరిధిలోకి తెచ్చేలా కార్పొరేషన్ ఏర్పాటు.
- నిజాం షుగర్స్, సిర్పూర్ పేపర్ మిల్లు, సారంగపూర్ షుగర్ ఫ్యాక్టరీల పునరుద్ధరణ.

## సిపిఐ (ఎం)

- రైతుల పెట్టుబడికి సరిపడా బ్యాంకులు, సహకార సంస్థల రుణాలు.
- పంటకు గిట్టుబాటు ధర కల్పన.
- భూమిలేని వ్యవసాయ కూలీలకు మిగులు భూమి పంపిణీ.
- విత్తన చట్టానికి తక్షణమే ఆమోదం.
- కార్మికులకు కనీస వేతనంగా నెలకు రు. 18 వేలు.
- ఒప్పంద, పొరుగుసేవల ఉద్యోగుల క్రమబద్ధీకరణ.
- వ్యవసాయాధారిత పరిశ్రమల అభివృద్ధి.
- ప్రభుత్వ శాఖల్లోని ఖాళీల భర్తీ, 3–18 ఏళ్ల వయసున్న విద్యార్థులకు విద్యాహక్కు చట్టం అమలు. ప్రైవేట్, కార్పొరేట్ విద్యా సంస్థల నియంత్రణ.

- ❖ కార్పొరేట్ వైద్యం నియంత్రణ, ప్రభుత్వ ఆరోగ్య రంగం పటిష్టీకరణ.
- ❖ పూర్తి స్థాయిలో ఎస్.సి., ఎస్.టి. ఉప ప్రణాళిక నిధుల వ్యయం. గిరిజనులకు 10 శాతం, మైనారిటీలకు 12 శాతం రిజర్వేషన్ల పెంపు. భూమిలేని పేదలకు మూడెకరాలు పంపిణీ.
- ❖ డప్పు కొట్టే వారికి, చర్మకారులకు నెలకు రు. 3 వేలు పింఛను.
- ❖ వికలాంగుల పింఛను రు. 5 వేలకు పెంపు. 50 ఏళ్లు దాటిన రైతులకు, వ్యవసాయ కార్మికులకు నెలకు రు. 3 వేల చొప్పున వృత్తి పింఛను.
- ❖ సింగరేణిలో వారసత్వ ఉద్యోగాల కొనసాగింపు.

## బహుజన లెఫ్ట్ ఫ్రంట్

- ❖ ప్రభుత్వ ఆధ్వర్యంలోనే సామాన్య ప్రజలకు ఉచితంగా విద్యా వైద్యాన్ని అందిస్తుంది.
- ❖ కామన్ స్కూల్ విధానం అమలు చేస్తుంది.
- ❖ ఇల్లు కట్టుకునే స్థోమత లేని కుటుంబానికి ఇల్లు–ఇంటి స్థలం పథకాన్ని అమలుచేస్తుంది.
- ❖ భూమిలేని ప్రతి కుటుంబానికి మూడెకరాల భూమి పంచుతుంది. ఎకరానికి రు. 4 వేలు సహాయం, రుణమాఫీ, పంటలకు గిట్టుబాటు ధర కల్పిస్తుంది. కౌలు దారుల చట్టాలను అమలుచేస్తుంది. రైతులకు అందించే రాయితీలన్నీ కౌలుదారులకు వర్తింపజేస్తుంది.
- ❖ తెలంగాణలో ఖాళీగా ఉన్న 2.50 లక్షల పోస్టులను భర్తీ చేస్తుంది. రాష్ట్రంలో పండే పంటకు, దొరికే ఖనిజాలకు అనుబంధంగా పరిశ్రమలు ఏర్పాటు చేస్తుంది. ప్రైవేటు రంగంలో రిజర్వేషన్లు అమలుచేస్తుంది.
- ❖ కాంట్రాక్ట్, ఔట్‌సోర్సింగ్ ఉద్యోగులను రెగ్యులరైజ్ చేస్తుంది. ప్రతి కార్మికుడికి సుప్రీంకోర్టు తీర్పు ప్రకారం రు. 18 వేల కనీస వేతనం ఇస్తుంది.
- ❖ భారతదేశంలో మొదటి మహిళా ఉపాధ్యాయురాలు సావిత్రిభాయి పూలే పేరు మీద చదువుల సావిత్రి పథకం అమలు చేస్తుంది.
- ❖ ప్రజాస్వామ్యం, పౌరహక్కులు, వ్యక్తి స్వేచ్ఛ పునరుద్ధరించ బడతాయి.
- ❖ తెలంగాణలో ప్రతి పల్లెకు అందుబాటులో 10 వేల కేంద్రాల్లో రు. 5 కే భోజనం అందించే పథకం.
- ❖ 200 యూనిట్లలోపు వాడే వారికి ఉచిత కరెంటు ఇవ్వబడుతుంది.
- ❖ రైతు బంధు పథకంలాగే కూలీ బంధు పథకం ద్వారా అమలు చేస్తుంది. సెక్యూరిటీ లేకుండా రు. 2 లక్షల వరకు రుణాలు అందజేస్తుంది.
- ❖ పార్టీ పిరాయింపుల చట్టాన్ని నిబద్ధతతో అమలుచేస్తుంది.
- ❖ పర్యావరణ పరిరక్షణకు కృషిచేస్తుంది.
- ❖ సంచార జాతులను విడిగా గుర్తించి ప్రత్యేక వెల్ఫేర్ బోర్డు ఏర్పాటు చేస్తుంది.
- ❖ ట్రాన్స్‌జెండర్లకు ఉపాధి అవకాశాలు, వసతి సౌకర్యాలు కల్పిస్తుంది. ప్రభుత్వ సంక్షేమ పథకాలు వర్తింపజేస్తుంది.
- ❖ జనాభా పెరుగుదలకు అనుకూలంగా గిరిజనులకు 10 శాతం, మైనారిటీలలోని బి.సి.లకు రిజర్వేషన్లు పెంచుతుంది.
- ❖ వికలాంగులకు పింఛన్ రు. 5 వేలకు పెంచుతుంది. సంక్షేమ పథకాల్లో 5 శాతం కేటాయిస్తుంది.
- ❖ చట్ట సభల్లో మహిళా రిజర్వేషన్‌కోసం బలమైన ఒత్తిడి తెస్తుంది. వరకట్నం నిషేధం, ఆస్తి హక్కు చట్టాలను అమలుచేస్తుంది.
- ❖ బి.సి.ని ముఖ్యమంత్రిని, మహిళను, ఒక ఎస్.సిని ఉప ముఖ్యమంత్రులను చేస్తుంది.
- ❖ కులాంతర, మతాంతర వివాహాలకు రు. 2 లక్షల బహుమతితో ప్రోత్సహిస్తుంది. ఒకరికి ఉద్యోగం, ఇల్లు మంజూరు చేస్తుంది. ఇలా ఇతర అంశాలు కూడా ఉన్నాయి.

## తెలంగాణ ప్రజా ఫ్రంట్

- ❖ అభ్యర్థుల 'ఎన్నికల ప్రణాళిక'ను గురించి వారితోనే చర్చించి, తమతమ నియోజక వర్గాలకు అవసరమయిన కార్యక్రమాలను వారి ప్రణాళికలో చేర్చేలా డిమాండ్ చేయడం.
- ❖ భూసంస్కరణ చట్టాలను అమలు చేయాలి. దున్నేవారికి భూమి హక్కును కల్పిస్తూ, ప్రభుత్వ బంజరు భూములను, దేవాదాయ, ఇనాం తదితర భూములను భూమి లేని పేద రైతాంగానికి పంచాలి. ఇతర ఆదాయ వనరులు ఉన్నవారిని భూయాజమాన్యం నుంచి తొలగించాలి. దున్నే వారి ప్రాతిపదికన భూ సర్వే నిర్వహించాలి. పోరాటాల ద్వారా రైతులు స్వాధీనం చేసుకున్న భూములకు పట్టాలు ఇవ్వాలి. కోనేరు రంగారావు కమిటీ సిఫారసులను అమలు చేయాలి.
- ❖ 2011 భూ అధీకృత సాగుదారుల (కౌల్దారీ) చట్టాన్ని అమలుచేయాలి. కౌలు రైతులందరికీ గుర్తింపు కార్డులు, బ్యాంకు రుణాలు, రైతుబంధు పథకం, తదితర ప్రభుత్వ సహాయం అందించాలి.
- ❖ 1977 అసైన్డ్ భూమి చట్టం ప్రకారం పంపిణీ చేసిన భూములకు పట్టాలు ఇవ్వాలి. అన్యాక్రాంతమైన అసైన్డ్ భూములను వాస్తవ హక్కుదారులకు అప్పగించాలి. దళిత, ఆదివాసీ, ఇతర పేద కుటుంబాలకు ప్రభుత్వం 3 ఎకరాల భూమి ఇవ్వాలి.
- ❖ అటవీ హక్కుల చట్టం ప్రకారం పోడు రైతులకు పట్టాలు వెంటనే ఇవ్వాలి. ఆదివాసీ ప్రాంతాలలో 1/70 చట్టాన్ని అమలు జరపాలి. ఆదివాసేతర భూస్వాముల అక్రమణలో ఉన్న భూములను స్వాధీనం చేసుకుని ఆదివాసులకు పంచాలి.
- ❖ ప్రత్యేక ఆర్థిక మండళ్లకు అప్పనంగా కేటాయించిన ప్రత్యేక భూములను పునఃసమీక్షించి, తిరిగి స్వాధీనం చేసుకోవాలి. చట్టప్రకారం చర్యలు చేపట్టాలి.
- ❖ తెలంగాణలో లభ్యమవుతున్న సహజ వనరుల ఆధారంగా ప్రభుత్వమే పరిశ్రమలను ఏర్పరచి, ఉత్పత్తిని ప్రారంభించాలి. స్థానికులకే ఉద్యోగాలు కల్పించాలి.
- ❖ నిజాం షుగర్, ఐడిపిఎల్, సర్సిల్క్, ఆల్విన్, హెచ్ఎమ్‌టి, కాగజ్‌నగర్ పేపర్ మిల్లు, కమలాపూర్ బిల్ట్, అజాంజాహి మిల్స్ లాంటి మూసివేసిన పరిశ్రమలను పునరుద్ధరించాలి.
- ❖ సింగరేణిలో ఓపెన్ కాస్ట్ మైనింగ్ రద్దు చేసి అండర్ గ్రౌండ్ మైనింగ్ మాత్రమే జరపాలి.
- ❖ కౌలుదార్లందరినీ రిజిస్టర్ చేసి 1/3 వంతు కౌలు రేటు నిర్ణయించి, కౌలుదార్లకి రుణ సౌకర్యం కల్పించాలి. వ్యవసాయ దారులకు అందించే పెట్టుబడి, ప్రోత్సాహకాలు కౌలు రైతులకు నేరుగా అందించాలి.
- ❖ సాంప్రదాయిక సాగునీటి వ్యవస్థ అయిన గొలుసు కట్టు చెరువులను పునరుద్ధరించి నదీ జలాలతో అనుసంధానం చేయాలి.
- ❖ ఆదివాసులకు నష్టదాయిని, వినాశకర పోలవరం ప్రాజెక్టును రద్దు చేయుటకు కేంద్రంపై రాష్ట్ర ప్రభుత్వం ఒత్తిడి తేవాలి.
- ❖ నల్లగొండ జిల్లా ఫ్లోరైడ్ బాధిత రైతాంగానికి సాగునీరు, త్రాగునీరు అందించడానికి ఎలిమినేటి మాధవరెడ్డి ప్రాజెక్టులో భాగంగా నాగార్జునసాగర్ నుండి ప్రత్యేక పథకంగా చేపట్టాలి.
- ❖ మహిళా, ఆదివాసీ, మైనార్టీలకు, మైనింగ్, వెటర్నరీ, హార్టి కల్చర్ యూనివర్సిటీలను ప్రాంతాల వారిగా, ఐటిఐ లాంటి సాంకేతిక విద్యా సంస్థలను విస్తృతంగా ఏర్పాటు చేయాలి.
- ❖ అన్ని స్థాయిల విద్యా సంస్థల్లో విద్యార్థి సంఘాల ఎన్నికలు నిర్వహించాలి. తద్వారా సామాజిక బాధ్యతగా విద్యార్థులు సమాజ నిర్మాణంలో పాలుపంచుకునే అవకాశాలు కల్పించాలి.

- ప్రజలందరికి ప్రభుత్వమే ఉచితంగా వైద్యం అందించాలి. ప్రతి గ్రామ పంచాయితీలో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని ఏర్పాటు చేస్తూ ఆర్ఎంపి, పిఎంపి డాక్టర్లకు తగిన శిక్షణను ఇచ్చి ప్రభుత్వ ఆరోగ్య కార్యకర్తలుగా నియమించాలి.
- చట్ట సభల్లో, మహిళలకు 50 శాతం రిజర్వేషన్లు కల్పించాలి.
- స్త్రీ, పురుషులకు సమాన పనికి సమాన వేతనం అమలు చేయాలి. మహిళలకు పని స్థలాల్లో ప్రత్యేక వసతులు ఏర్పాటు చేయాలి.
- జోగిని, బసివిని, మాతంగి, దేవదాసీ వ్యవస్థల రద్దు చట్టాన్ని అమలు చేయాలి.
- జల్, జంగల్, జమీన్ పై సంపూర్ణాధికారం కోసం ఆదివాసులకు స్వయంపాలన కల్పించాలి.
- ఆదివాసులు సాగుచేసుకుంటున్న భూములకు పట్టాలివ్వాలి. హరితహారం పేరుతో ఆదివాసీలను పోడు భూముల నుండి గెంటివేయడాన్ని నిలిపివేయాలి.
- కవ్వాల్ టైగర్ జోన్, కుంటాల జలపాతంపై జలవిద్యుత్ ప్రాజెక్టుల వంటి వివిధ పథకాల ద్వారా ఆదివాసీలను నిర్వాసితులను చేసే ప్రక్రియను రద్దు చేసుకోవాలి.
- ప్రతి దళిత కుటుంబానికి మూడు ఎకరాల భూమిని కేటాయించి, సాగునీటి వసతి, రుణసౌకర్యం కల్పించాలి.
- ఎస్.సి, ఎస్.టి అత్యాచార నిరోధక చట్టాన్ని పటిష్టంగా అమలు పరచాలి, ఈ చట్టాన్ని బలహీనపరచకుండా కేంద్రంపై ఒత్తిడి తేవాలి. ఎస్.సి రిజర్వేషన్ వర్గీకరణను జనాభా దామాషా ప్రకారం చేయాలి. మత మార్పిడి అయిన దళితులకు హిందూ మతోన్మాదుల నుంచి రక్షణ కల్పించాలి. దళిత క్రైస్తవుల సమస్యలను పరిష్కరించాలి.
- ముస్లిం మైనార్టీలకు పన్నెండు శాతం రిజర్వేషన్లు కల్పించాలి.
- ముస్లింలు, క్రిస్టియన్లు, పార్శీలు, సిక్కులు, జైనులు, బౌద్ధులు మొదలైన మత మైనార్టీలకు సామాజిక భద్రత కల్పించాలి.
- సచార్ కమిటి(2005), సుధీర్‌కుమార్(2015) సిఫారసులను అమలు జరపాలి.
- బోధనా, న్యాయ, పాలనపరమైన నిర్వహణ మొత్తం తెలుగులో జరగాలి.
- భాషాభివృద్ధికి తోడ్పడే విధంగా ప్రతి గ్రామంలో గ్రంథాలయాల్ని ఏర్పాటు చేయాలి.
- ప్రతి నెల జర్నలిస్టులకు కనీస వేతనం ఇచ్చేలా యాజమాన్యాలపై నియంత్రణ పెట్టాలి. నిరుద్యోగులకు కనీసం 5 వేల జీవనభృతి ఇవ్వాలి.
- ప్రజల వాక్, సభా స్వాతంత్ర్యాలను, నిరసన తెలిపే హక్కును కాలరాసే నిర్బంధ చట్టాలను రద్దు చేయాలి.
- రాజకీయ కార్యకర్తలపై పెట్టిన అక్రమ కేసులను ఎత్తి వేయాలి, వారిని వెంటనే విడుదల చేయాలి. ప్రజల పక్షాన పోరాడే ప్రజా సంఘాలను, కార్యకర్తలను నిర్బంధిస్తే వీరిని రాజకీయ ఖైదీలుగా గుర్తించాలి.
- బూటకపు ఎన్‌కౌంటర్లు జరగకుండా చర్యలు తీసుకోవాలి. ఎన్‌కౌంటర్లో పాల్గొన్న పోలీసులపై భారత శిక్షాస్మృతి సెక్షన్ 302 ప్రకారం విచారించాలన్న హైకోర్టు తీర్పును అమలు చేయాలి.
- ప్రజాభిప్రాయానికి భిన్నంగా నడుచుకొనే ప్రతినిధులను వెనిక్కి పిలిచే “రీ కాల్” వ్యవస్థను కూడా తీసుకరావాలి, ఇందుకు రాష్ట్ర ప్రభుత్వం కేంద్రంపై ఒత్తిడితేవాలి.
- తెలంగాణ ఉద్యమకారులపై పెట్టిన కేసులన్నీ ఎత్తివేయాలి.
- కేంద్ర ప్రభుత్వ భూసేకరణ చట్టం–2013 లోని లోపాలను సవరించి అమలు పర్చాలి. తెలంగాణ భూసేకరణ చట్టం 2017ను రద్దుచేయాలి.
- ఎం.ఎల్.ఏ, ఎం.పి, ప్రభుత్వ ఉన్నతాధికారుల అక్రమ ఆస్తులపై దర్యాప్తు జరపాలి.
- అవినీతి ఆరోపణలు, నేర చరిత్ర ఉన్న వారిని ఎన్నికల్లో పోటీచేయడానికి అనర్హులుగా ప్రకటించాలి.
- హైదరాబాద్ నగర శివారు కాలనీల్లో భూగర్భ డ్రైనేజి వ్యవస్థను ఇప్పటి జనాభా అవసరాలకు, భవిష్యత్ జనాభా అవసరాలకు అనుగుణంగా ఆధునీకరించాలి.
- ప్రభుత్వ, ప్రైవేటు రంగ పరిశ్రమల్లో 85 శాతం ఉద్యోగాలు స్థానికులకే ఇవ్వాలి.
- సంపూర్ణ మద్య నిషేధాన్ని అమలు చేయాలి.
- వికలాంగులకు ప్రత్యేక కార్పొరేషన్ ఏర్పాటు చేయాలి.

## టి జెఏసి ప్రజల మేనిఫెస్టో

- రాష్ట్ర బడ్జెట్‌లో 20 శాతం నిధులతో వ్యవసాయానికి ప్రత్యేక బడ్జెట్ ఏర్పాటు.
- వ్యవసాయ అనుబంధ రంగాల్లోని మహిళలకు గుర్తింపు కార్డులు. వ్యవసాయ కూలీలు, ఆత్మహత్య చేసుకున్న రైతు కుటుంబాల్లోని మహిళల ఉపాధికి సహకారం.
- కొత్త పట్టదారు పాసు పుస్తకాల చట్టంలో సాగుదారుల కాలమ్ పునరుద్ధరణ. భూమి లేని పేదలకు భూ పంపిణీ.
- శ్రీశైలం ప్రాజెక్టు సహా వివిధ సాగునీటి, అభివృద్ధి ప్రాజెక్టుల్లో నిర్వాసితుల సంక్షేమానికి పెద్దపీట.
- కాళేశ్వరం, పాలమూరు–రంగారెడ్డి ఎత్తిపోతల పథకాల పునఃపరిశీల. ప్రాణహిత – చేవెళ్ల ప్రాజెక్టును అవసరమైన మార్పులతో పునరుద్ధరణ.
- గృహ, వ్యాపార, చిన్న, కుటీర పరిశ్రమలకు విద్యుత్ చార్జీల తగ్గింపు. 100 యూనిట్ల వరకు ఉచితం. 200 యూనిట్ల వినియోగంపై సగం చార్జీ.
- ఉపాధిహామీ పథకంలో నమోదు చేసుకున్న 51 లక్షల కుటుంబాలకు పక్కాగా 100 రోజుల పనిదినాలు. ఉపాధి కూలీల సంక్షేమ బోర్డు ఏర్పాటు.
- ఎస్‌సి, ఎస్‌టి ప్రత్యేకాభివృద్ధి నిధులను పూర్తిస్థాయిలో ఖర్చు. బి.సి.లకూ ప్రత్యేక అభివృద్ధి నిధి ఏర్పాటు.
- ఆదివాసి ప్రజల ఉనికి, గుర్తింపునకు హామీ. అటవీ హక్కుల చట్టం, 1/70 చట్టం, పెసా చట్టాల పక్కా అమలు. పోడు భూములకు పట్టాల పంపిణీ.
- బీడీ కార్మికులకు కనీస వేతనాలు. హమాలీ కూలీలకు సమగ్ర చట్టం. ఆటో, మోటారు వాహన రంగాల్లోని కార్మికుల సంక్షేమం, భద్రతకు చర్యలు.
- చిన్న, కుటీర, గృహ పరిశ్రమలకు ప్రత్యేక ప్రోత్సాహకాలు. సింగరేణి పరిధిలో ఓపెన్ కాస్ట్ మైనింగ్ రద్దు.
- రాష్ట్రంలో మద్య నిషేధం అమలు. నీరా ఆధారిత ఉత్పత్తులకు ప్రోత్సాహకారం.

## తెలంగాణ విద్యార్థి వేదిక మేనిఫెస్టో

- ప్రభుత్వ ప్రాథమిక, ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలల్లో విద్యా ప్రమాణాల మెరుగుదలకు ప్రతి తరగతి గదికి ఒక ఉపాధ్యాయులు ఉండాలి. తరగతికి ఒక గది ఉండాలి.
- ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలో స్టాఫ్ ప్యాటర్న్ ప్రకారం అన్ని సబ్జెక్టులకు ఉపాధ్యాయులను నియమించాలి.
- ప్రభుత్వ పాఠశాలలన్నింటిలో అవసరమైన మౌలిక సదుపాయాలు కల్పించాలి.

- మధ్యాహ్న భోజనం కాంట్రాక్టర్స్‌కి అప్పజెప్పకుండా పాఠశాలలోనే వండాలి.
- పాఠశాల స్థాయివరకు మాతృభాషా మాధ్యమాన్ని ప్రభుత్వ, ప్రైవేట్ పాఠశాలలన్నింటిలో తప్పనిసరిగా అమలు చేయాలి.
- గురుకుల ప్రవేశ పరీక్ష విధానాన్ని రద్దుచేయాలి.
- చదువుకుంటాననే ప్రతి విద్యార్థికి అడ్మిషన్ ఇవ్వాలి.
- రెగ్యులర్ ప్రాతిపదికన టీచింగ్ పోస్టులు భర్తీ చేయాలి.
- ప్రభుత్వ జూనియర్, డిగ్రీ కళాశాలల్లో, వృత్తి విద్యా కళాశాలల్లో బోధన, బోధనేతర పోస్టులన్నింటిని రెగ్యులర్ ప్రాతిపదికననే భర్తీ చేయాలి.
- ప్రతి ప్రభుత్వ కళాశాలకు అనుబంధంగా ఉచిత హాస్టల్ వసతి కల్పించాలి.
- ప్రతి మండలానికి జూనియర్ కళాశాల, ప్రతి నియోజకవర్గానికి డిగ్రీ, పి.జి. కళాశాల, ప్రతి జిల్లాకు ఒక యూనివర్సిటీని ఏర్పాటు చేయాలి.
- ప్రైవేట్ యూనివర్సిటీల బిల్లును రద్దుచేయాలి.
- ఆదివాసి ప్రాంతాల్లో మాతృభాష గోండును గుర్తించి వారి భాషలోనే విద్యాబోధన జరగాలి.
- ముస్లిం ప్రజలు ఉన్న ప్రాంతాలలో ఉర్దూ మీడియం పాఠశాలలను ఏర్పాటు చేయాలి.
- వివిధ శాఖలలో తెలుగుతో పాటు ఉర్దూ భాషకు ప్రాధాన్యత కల్పించాలి.
- ముస్లింలు ఎక్కువగా నివసిస్తున్న నిజామాబాద్ ప్రాంతంలో ఉర్దూ యూనివర్సిటీని ఏర్పాటు చేయాలి.
- ఎస్.సి, ఎస్.టి, బి.సి, మైనారిటీ హాస్టల్స్‌కు సొంత భవనాలు నిర్మించాలి.
- విద్యారంగానికి కేంద్ర బడ్జెట్‌లో 10 శాతం, రాష్ట్ర బడ్జెట్‌లో 30 శాతం నిధులు కేటాయించాలి. విద్యా వ్యాపారాన్ని అరికట్టాలి.
- ప్రజా ప్రతినిధులు, ప్రభుత్వ అధికారులు, తమ పిల్లల్ని ప్రభుత్వ పాఠశాలలు, కళాశాలలకే పంపాలి.
- గ్రామ స్థాయి నుండి జిల్లా స్థాయి వరకు గ్రంథాలయాలను ఏర్పాటు చేయాలి. పాఠ్య ప్రణాళికలను, పాఠ్యాంశాలను, అన్ని రకాల ఆధిపత్యాలను అంతం చేసే విధంగా రూపొందించాలి.

## పాలమూరు అధ్యయన వేదిక ప్రజా ఎజెండా

- 14 నియోజకవర్గాల మహబూబ్‌నగర్ జిల్లా పరిస్థితులపై సిట్టింగ్ జడ్జితో కమిషన్ వేసి విచారణ జరపాలి.
- భూసంస్కరణలను సమీక్షించి ప్రభుత్వ వ్యవస్థల అండతో దురాక్రమించిన భూముల విషయం తేల్చడానికి, భూమిలేని పేదలకు భూములు పంచడానికి భూమి కమిషన్ నియమించాలి. భూములు పంచాలి. రియల్ ఎస్టేట్ దందా ఆపాలి. పంట భూములు కాపాడాలి.
- 1970లలో మహబూబ్‌నగర్ జిల్లా కరువు పరిస్థితులపై కేంద్ర ప్లానింగ్ కమిషన్ చొరవతో భారత వ్యవసాయ పరిశోధనా మండలి (ఇసిఎఆర్) రూపొందించిన నివేదికలోని ప్రజానుకూల అంశాలను వెంటనే అమలు పరచాలి.
- ప్రజల భావ ప్రకటన స్వేచ్ఛ, పౌర ప్రజాస్వామిక హక్కులు, జీవించే హక్కు కాపాడాలి. తెలంగాణ ఉద్యమంలోను, పౌర ప్రజాస్వామిక విప్లవ ఉద్యమాలలో అమరులైన వారి కుటుంబాలకు ఉపాధి జీవన భద్రత భవిష్యత్తు కల్పించాలి.
- వలసలు, వ్యవసాయ సంక్షోభం, వృత్తుల విధ్వంసం, మద్యం, వనరుల దురాక్రమణ, ఉపాధి అవకాశాల లేమితో, కుటుంబాలలో నెలకొన్న ఆర్థిక సంక్షోభం వల్ల, ప్రమాదాల వల్ల పోషించే వారు అసహజ మరణాలకు, ఆత్మహత్యలకు బలైన కుటుంబాల భవిష్యత్తు కోసం, భద్రత కోసం ప్రత్యేకమైన చర్యలు చేపట్టాలి.
- జోగినీ వ్యవస్థను నిర్మూలించాలి. మౌలిక వనరులు, విద్య, ఉపాధి, భద్రత, భవిష్యత్తు కల్పించాలి.
- పాకీపని వ్యవస్థను నిర్మూలించాలి. ఆ కుటుంబాలకు మౌలిక వనరులు, ఉపాధి అవకాశాలను కల్పించి ఆదుకోవాలి.
- నల్లమలలో చెంచుల రక్షణకు, వారి జనాభాను కాపాడడానికి, విద్య, వైద్యం, తాగునీరు, సాగునీరు, వ్యవసాయ వనరులు అందించాలి. చదువుకున్న అందరికి ఉద్యోగాలు ఇవ్వాలి. ఆదివాసుల కోసం సబ్‌ప్లాన్ రూపొందించి అమలు పరచాలి. నల్లమలలో యురేనియం తవ్వకాల ప్రతిపాదన విరమించుకోవాలి.
- కురిసిన వాన నీటిని కాపాడడానికి జిల్లాలోని 679 చెరువులను, 5374 కుంటలను పటిష్టంగా పునర్నిర్మించాలి. పేరిన ఒండ్రుమట్టిని గ్రామ పంచాయితీల ద్వారా మాత్రమే అన్ని పంట పొలాలలో చల్లించాలి. అన్ని మండలాలలో అనువైన చోట్ల కొత్త చెరువులు, కుంటలు నిర్మించాలి. ఈ అన్నింటిని దురాక్రణ నుంచి కాపాడాలి.

### పార్టీల వారీగా ప్రకటించిన అభ్యర్థుల సామాజిక సమీకరణాలు

| పార్టీ | టిఆర్ఎస్ | కాంగ్రెస్ | టిడిపి | టిజెఎస్ | సిపిఐ | బిజెపి | బిఎల్ఎఫ్ |
|---|---|---|---|---|---|---|---|
| **స్థానాలు** | **119** | **99** | **13** | **8** | **3** | **119** | **109** |
| **ఒసి** | **59** | **41** | **7** | **3** | **1** | **50** | **5** |
| రెడ్డి | 37 | 36 | 3 | 2 | 1 | 32 | 2 |
| వెలమ | 12 | 4 | – | – | – | 10 | 1 |
| కమ్మ | 6 | – | 3 | – | – | – | 1 |
| బ్రాహ్మణ | 1 | 1 | – | 1 | – | 5 | 1 |
| ఇతర | 3 | – | 1 | – | – | 3 | – |
| **బిసి** | **26** | **24** | **3** | **2** | **–** | **34** | **58** |
| యాదవ | 6 | 1 | – | – | – | 2 | 7 |
| గౌడ | 6 | 6 | 2 | – | – | 4 | 7 |
| ముదిరాజ్ | 1 | 2 | 1 | 1 | – | 1 | 3 |
| ము.కాపు | 8 | 8 | – | 1 | – | 7 | 8 |
| ఇతర | 5 | 7 | – | – | – | 20 | 33 |
| **ఎస్‌సి** | | | | | | | |
| మాదిగ | 11 | 9 | 1 | 1 | – | 10 | 13 |
| మాల | 7 | 8 | – | – | 1 | 10 | 13 |
| ఇతర | 1 | – | – | – | – | 1 | 1 |
| **ఎస్‌టి** | | | | | | | |
| లంబాడ | 7 | 5 | – | – | – | 7 | 5 |
| ఆదివాసి | 5 | 5 | 1 | 2 | 1 | 5 | 6 |
| **మైనారిటీ** | **3** | **7** | **1** | **–** | **–** | **2** | **8** |
| **మహిళలు** | **4** | **11** | **1** | **1** | **1** | **15** | **10** |

- ❖ పాలమూరు–రంగారెడ్డి ఎత్తిపోతల పథకాన్ని రెండు భాగాలుగా విభజించి అమలు చేయాలి.
- ❖ పాలమూరు–రంగారెడ్డి ఎత్తుపోతల ఫేజ్–1ను జూరాల నుండి కృష్ణానది వరద నీటితో చేపట్టి 35 రోజులలో 70 టిఎంసిల నీరు తీసుకునే విధంగా జిఒ 72 అమలు చేయాలి.
- ❖ పాలమూరు–రంగారెడ్డి ఎత్తిపోతల ఫేజ్–2ను ప్రస్తుత శ్రీశైలం నుండి కల్వకుర్తి ఎత్తిపోతల పథకంతో సమన్వయపరుస్తూ పూర్తి చేయాలి.
- ❖ భీమా ఫేజ్–1, కోయిల్‌సాగర్ పథకాల నికరజలాలను 35 రోజులలో తీసుకునే విధంగా ఆ పథకాల సామర్థ్యం పెంచాలి.
- ❖ కల్వకుర్తి ఎత్తిపోతల పథకానికి నికర జలాలు సాధించాలి.
- ❖ నెట్టంపాడు ఎత్తిపోతల పథకానికి నికర జలాలు సాధించాలి.
- ❖ ఆర్‌డిఎస్ కట్టను కొత్తగా నిర్మించాలి. కాలువను ఆధునీకరించాలి.
- ❖ జిల్లాలోని అన్ని సాగునీటి పథకాలలో ఆయకట్టు స్థిరీకరణ జరపాలి.
- ❖ జిల్లాలో సూపర్ స్పెషాలిటీ పరిశోధనల స్థాయి వైద్య విశ్వవిద్యాలయం నెలకొల్పాలి.
- ❖ జిల్లా నుండి వలసలను సమీక్షించి వలస నమోదు చర్యలను చేపట్టాలి.

### మహిళా, ట్రాన్స్‌జండర్ ఐక్యకార్యాచరణ

- ❖ వ్యవసాయ సంక్షోభాన్ని అరికట్టాలి. వ్యవసాయంలో మహిళల భాగస్వామ్యాన్ని గుర్తిస్తూ, మహిళలకు రైతులుగా గుర్తింపు కార్డులు ఇవ్వాలి.
- ❖ విదేశాలకు వలస వెళ్లే వలస కార్మికుల కుటుంబాల సమస్యలపై అధ్యయనాలు జరగాలి.
- ❖ స్కూల్ అడ్మిషన్స్ అప్లికేషన్స్‌లో ఆడ, మగ అనే కాలం మాత్రమే కాకుండా ఇతరులు/ట్రాన్స్ జండర్స్ అనే కాలం కూడా ఉండాలి.
- ❖ ప్రతి సంవత్సరం బడ్జెట్‌లో 10 శాతం వైద్య రంగానికి కేటాయించాలి. ప్రభుత్వ వైద్య విధానాన్ని పటిష్టపరచాలి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను బలోపేతం చేయాలి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల సేవల నాణ్యత పెంచడం కోసం ఆరోగ్య బడ్జెట్‌లో 60 శాతం పైగా నిధులు కేటాయించాలి.
- ❖ గ్రామంలో మద్యం సరఫరా లేకుండా చేయాలి. మద్యం దుకాణాల సంఖ్య పూర్తిగా తగ్గించి వేయాలి.
- ❖ సహజవనరులు కార్పొరేట్ సంస్థలకు, మైనింగ్ సంస్థలకు, విదేశీ పెట్టుబడులకు, కాంట్రాక్టర్లకు ఎర్ర తివాచీ పరిచే సంస్కృతికి చరమ గీతం పాడాలి. ఓపెన్ కాస్ట్ మైనింగ్‌కు స్వస్తి పలికి నాశనమయిన పర్యావరణాన్ని పునరుజ్జీవింపచేయాలి.
- ❖ కులాంతర, మతాంతర వివాహాలలో పితృస్వామ్య, కుల, మత పరమైన ఆధిపత్య హింసలను అరికట్టేందుకు ప్రత్యేక చట్టాన్ని తీసుకురావాలి. వివాహ విషయమై మేజర్లయిన యువతీ యువకుల నిర్ణయాన్ని గౌరవిస్తూ వారికి రక్షణ కల్పించాలి.
- ❖ ప్రధాన నేతదారుగా మహిళ ఉన్న కుటుంబాలలో మగ్గాలన్నీ కూడా మహిళల పేరు మీదే రిజిస్టర్ అయి ఉండాలి.
- ❖ మహిళా జర్నలిస్టులందరికీ అక్రిడేషన్ సదుపాయాన్ని కల్పించాలి. ప్రెస్ అకాడమీలోనూ, జర్నలిస్టులకు సంబంధించిన అన్ని సంఘాల్లోనూ మహిళా జర్నలిస్టులకు యాభై శాతం పదవులు కేటాయించాలి.
- ❖ తెలంగాణాలో కనుమరుగయిన చారిత్రాత్మక మహిళల చరిత్రలు చిరస్థాయిగా నిలిచే విధంగా అధ్యయనం చేసే అకాడమిని ఏర్పాటు చేయాలి.

### తెలంగాణ వర్కింగ్ జర్నలిస్టు ఫెడరేషన్

- ❖ తెలంగాణలో జర్నలిస్టులు ఎదుర్కొంటున్న సమస్యలను అన్ని రాజకీయ పార్టీలు తమ ఎన్నికల మేనిఫెస్టోలో చేర్చి అమలు చేయాలి.

### తెలంగాణ బిసి జాగృతి

- ❖ పార్లమెంట్‌లో బి.సి బిల్లు ప్రవేశపెట్టి చట్టసభల్లో 50 శాతం రిజర్వేషన్లు కల్పించాలి.
- ❖ కేంద్రంలో బి.సిలకు ప్రత్యేక మంత్రిత్వ శాఖ ఏర్పాటుచేయాలి.
- ❖ పార్లమెంట్‌లో మహిళా బిల్లును ఆమోదించి బిసి మహిళలకు 50 శాతం ఉప కోటా కేటాయించాలి.

### ప్రజాధ్వని

- ❖ బాలల హక్కులు అమలు కావడం లేదని, వారి హక్కులను పరిరక్షించడంతో పాటు అన్ని పార్టీలు మేనిఫెస్టోలో చేర్చి అధికారంలోకి వచ్చాక వాటిని అమలుపరచాలి.

### తెలంగాణ దళిత ఉమెన్ నెట్‌వర్క్

- ❖ దళితులకు కేటాయించిన రిజర్వేషన్ స్థానాలలో 50 శాతం దళిత స్త్రీలకు కేటాయించాలి.
- ❖ ఇళ్లు, భూమి దళిత స్త్రీల పేర్లమీదనే ఇవ్వాలి.
- ❖ దళిత వాడల్లో మౌలిక వసతులు కల్పించాలి.
- ❖ ఎస్.సి, ఎస్.టి సబ్ ప్లాన్ నిధులు 50 శాతం దళిత స్త్రీల అభివృద్ధి, సంక్షేమం కోసమే వినియోగించాలి.
- ❖ దళిత మహిళా ఎం.ఎల్.ఏలకు మంత్రివర్గంలో స్థానం కల్పించాలి.

### ఫోరమ్ ఫర్ ఎ బెటర్ హైదరాబాద్, వివిధ ప్రజా సంఘాలు

- ❖ నగరంలో వాయు, ధ్వని, గాలి, నీటి కాలుష్యం తగ్గించి రవాణా సౌకర్యాన్ని మెరుగుపర్చాలి.
- ❖ నగరంలో 2,400 చెరువులు 800కు చేరాయని, చిన్న చెరువులను గొలుసుకట్టు విధానంలో అమలుచేయాలి.
- ❖ నడవడానికి యోగ్యంగా ఫుట్‌పాత్‌లను అందుబాటులోకి తేవాలి.
- ❖ రోడ్ల నిర్మాణం, డ్రైనేజీ వ్యవస్థను పునర్వ్యవస్థీకరించాలి.
- ❖ మైసూర్‌లో హెరిటేజ్ భవనాలను ప్రభుత్వ కార్యాలయాలుగా మార్చుకొని ఉపయోగించుకుంటున్నారని, అలాంటి పరిస్థితులు ఇక్కడ రావాలి.

### డయల్ యువర్ విలేజ్ (తెలంగాణ ఎన్ఆర్ఐ)

- ❖ అవినీతిని బట్టబయలు చేసేందుకు, పాలనలో పారదర్శకత తెచ్చేందుకు ఉద్దేశించిన సమాచారహక్కు చట్టం పక్కాగా అమలు చేయాలి.
- ❖ స్థానిక సంస్థలకు కల్పించిన రాజ్యాంగ సవరణ 73, 74ను అమలు చేసి మూడంచెల పంచాయతీరాజ్ వ్యవస్థను పటిష్ట పరచాలి.
- ❖ అన్ని ప్రభుత్వ పాఠశాలల్లో ఆంగ్ల మాధ్యమంలో ప్రీ ప్రైమరీ పాఠశాలలు ఏర్పాటు చేయాలి.
- ❖ 100 శాతం అక్షరాస్యత సాధించేలా తగిన కార్యచరణ, ప్రణాళిక అమలు చేయాలి.
- ❖ ప్రభుత్వ పాఠశాలల్లోని విద్యార్థుల విద్యా సామర్థ్యాన్ని ప్రతి మూడు నెలలకు స్వతంత్ర సంస్థతో పరిశీలించాలి.
- ❖ రసాయనిక ఎరువుల వాడకం తగ్గించి ప్రకృతి, సేంద్రీయ, సహజ వ్యవసాయాన్ని ప్రోత్సహించేలా ప్రభుత్వ విధానాలు ఉండాలి.
- ❖ సాగునీటి పరిమితులను బట్టి మెట్ట పంటలు, చిరుధాన్యాలను ప్రోత్సహించాలి. వీ

## తెలంగాణ 2018 అసెంబ్లీ ఎన్నికల్లో పోటీ చేస్తున్న పార్టీల అభ్యర్థులు, నియోజకవర్గాలు

| సం. | నియోజకవర్గం | టిఆర్ఎస్ | ప్రజాకూటమి | బిజెపి | ఇతరులు |
|---|---|---|---|---|---|
| **ఆదిలాబాద్** | | | | | |
| 1 | సిర్పూర్ (ఎస్సి) | కోనేరు కోనప్ప | పాల్వాయి హరీష్ (కా) | డా. కె. శ్రీనివాస్ | రావి శ్రీనివాస్ (బి.ఎస్.పి) |
| 2 | చెన్నూరు | బాల్క సుమన్ | బి. వెంకటేష్ నేత | ఎ. శ్రీనివాసులు | బోడ జనార్దన్ (బి.ఎస్.పి) |
| 3 | బెల్లంపల్లి | దుర్గం చిన్నయ్య | గుండా మల్లేష్ (సిపిఐ) | కొయ్యల ఎమాజీ | గడ్డం వినోద్ (బి.ఎస్.పి) |
| 4 | మంచిర్యాల | ఎన్. దివాకర్‌రావు | కె. ప్రేమ్‌సాగర్ రావు | వి. రఘునాథరావు | సత్యనారాయణ (బి.ఎస్.పి) |
| 5 | ఆసిఫాబాద్ | కోవ లక్ష్మి | ఆత్రం సక్కు | ఎ. ఆత్మారామ్ నాయక్ | కె. విజయ్ (టి.జె.ఎస్) |
| 6 | ఖానాపూర్ | రేఖానాయక్ | రమేష్ రాథోడ్ | సట్ల అశోక్ | భీమ్ రావు (టి.జె.ఎస్) |
| 7 | ఆదిలాబాద్ | జోగు రామన్న | గండ్రత్ సుజాత | పాయల శంకర్ | సత్యనారాయణ (బిఎస్‌పి) |
| 8 | బోథ్ | రాథోడ్ బాబూరావు | సోయం బాపూరావు | మాడవి రాజు | అనిల్ జాదవ్ (కా. రెబల్) |
| 9 | నిర్మల్ | ఎ. ఇంద్రకరణ్‌రెడ్డి | ఏలేటి మహేశ్వర్‌రెడ్డి | స్వర్ణారెడ్డి | అలివేలు మంగ (బిఎల్ఎఫ్) |
| 10 | ముథోల్ | జి. విఠల్‌రెడ్డి | రామారావు పటేల్ పవార్ | పడకంటి రమాదేవి | నారాయణ్‌రావు పటేల్ (ఎన్‌సిపి) |
| **నిజామాబాద్** | | | | | |
| 11. | ఆర్మూర్ | ఆశన్నగారి జీవన్‌రెడ్డి | ఆకుల లలిత | పి. వినయ్ కుమార్‌రెడ్డి | కె. సుదాకర్ (బిఎస్‌పి) |
| 12. | బోధన్ | షకీల్ అహ్మద్ | పి. సుదర్శన్‌రెడ్డి | అల్జాపూర్ శ్రీనివాస్ | బి. జీవన్ (బిఎల్ఎఫ్) |
| 13. | జుక్కల్ | హన్మంత్ సిండే | సౌదాగర్ గంగారామ్ | అరుణతార | భరత్ (బిఎల్ఎఫ్) |
| 14. | బాన్సువాడ | పోచారం శ్రీనివాస్‌రెడ్డి | కాసుల బాలరాజు | నాయుడు ప్రకాష్ | భీంరావు (బిఎస్‌పి) |
| 15. | ఎల్లారెడ్డి | ఏనుగు రవీందర్‌రెడ్డి | జాజల సురేందర్ | లక్ష్మారెడ్డి | సిద్దార్థ రాజ్ (బిఎల్ఎఫ్) |
| 16. | కామారెడ్డి | గంప గోవర్ధన్ | షబ్బీర్ అలీ | కె. వెంకట రమణారెడ్డి | మల్లికార్జున్ (బిఎల్ఎఫ్) |
| 17. | నిజామాబాద్ (అ) | బిగాల గణేశ్ గుప్తా | తహెర్‌బిన్ అమ్దాన్ | యెండల లక్ష్మీనారాయణ | రత్నాకర్ (ఐఎఫ్‌బి) |
| 18. | నిజామాబాద్ (రూ) | బాజిరెడ్డిగోవర్ధన్ | ఆర్. భూపతిరెడ్డి | కేశపల్లి ఆనంద్‌రెడ్డి | నూర్జహాన్ (బిఎల్ఎఫ్) |
| 19. | బాల్కొండ | వేముల ప్రశాంత్‌రెడ్డి | ఇ. అనిల్ కుమార్ | ఆర్. రాజేశ్వర్ | సునీల్‌రెడ్డి (బిఎస్‌పి) |
| **కరీంనగర్** | | | | | |
| 20. | కోరుట్ల | కె. విద్యాసాగర్‌రావు | జువ్వాడి నర్సింగారావు | జె. వెంకట్ | పి. లింబాద్రి (బిఎస్‌పి) |
| 21. | జగిత్యాల | డా. సంజయ్‌కుమార్ | టి. జీవన్‌రెడ్డి | ముదుగంటి రవీందర్‌రెడ్డి | కె. శంకర్ (బిఎల్ఎఫ్) |
| 22. | ధర్మపురి | కొప్పుల ఈశ్వర్ | అడ్లూరి లక్ష్మణ్ కుమార్ | కన్నం అంజయ్య | ఎం. రవీందర్ (బిఎల్ఎఫ్) |
| 23. | రామగుండం | సోమారపు సత్యనారాయణ | ఎం.ఎస్. రాజ్‌ఠాకూర్ | బల్మూరి వనిత | కె. చందర్ (ఎఫ్‌బి) |
| 24. | మంథని | పుట్ట మధుకర్ | దుద్దిళ్ల శ్రీధర్‌బాబు | రెండ్ల సనత్‌కుమార్ | ఐ. మహేశ్ (బిఎస్‌పి) |
| 25. | పెద్దపల్లి | దాసరి మనోహర్‌రెడ్డి | సి. విజయరమణా రావు | జి. రామకృష్ణారెడ్డి | ఎం. బాపయ్య (బిఎస్‌పి) |
| 26. | కరీంనగర్ | గంగుల కమలాకర్ | పొన్నం ప్రభాకర్ | బండి సంజయ్ | వేణు ప్రసాద్ (శివసేన) |
| 27. | చొప్పదండి (ఎస్సి) | సుంకె రవిశంకర్ | మేడిపల్లి సత్యం | బొడిగె శోభ | కె.వంశీ (బిఎల్ఎఫ్) |
| 28 | వేములవాడ | చెన్నమనేని రమేశ్ | ఆది శ్రీనివాస్ | ప్రతాప రామకృష్ణ | పి. భూమేశ్ (బిఎస్‌పి) |
| 29. | సిరిసిల్ల | కె.టి.ఆర్ | కె.కె. మహేందర్‌రెడ్డి | నర్సాగౌడ్ | కె. రమేశ్ (బిఎల్ఎఫ్) |
| 30. | మానకొండూర్ | రసమయి బాలకిషన్ | ఆరెపల్లి మోహన్ | గడ్డం నాగరాజు | ఎన్. రామచంద్రం (బిఎస్‌పి) |
| 31. | హుజూరాబాద్ | ఈటెల రాజేందర్ | కౌశిక్‌రెడ్డి | పుప్పాల రఘు | శ్రీనివాసరెడ్డి (ఎంసిపిఐ) |
| 32. | హుస్నాబాద్ | వి. సతీష్ కుమార్ | చాడ వెంకట్‌రెడ్డి (సిపిఐ) | చాడ శ్రీనివాసరెడ్డి | పి. రాజు (బిఎల్ఎఫ్) |
| **మెదక్** | | | | | |
| 33. | సిద్దిపేట | టి. హరీశ్‌రావు | భవానీరెడ్డి (టిజెఎస్) | నాయిని నరోత్తమ్‌రెడ్డి | డి. చంద్రమ్ (స్వతంత్ర) |
| 34. | మెదక్ | పద్మదేవేందర్‌రెడ్డి | ఉపేందర్‌రెడ్డి | ఆకుల రాజయ్య | శశిధర్‌రెడ్డి (ఎన్‌సిపి) |
| 35. | నారాయణ్‌ఖేడ్ | ఎం. భూపాల్‌రెడ్డి | సురేశ్‌కుమార్ షెట్కార్ | సంజీవరెడ్డి | బస్వరాజ్ పాటిల్ (బిఎల్ఎఫ్) |
| 36. | ఆందోల్ | చంటి క్రాంతి కిరణ్ | దామోదర్ రాజనరసింహ | బాబుమోహన్ | జయలక్ష్మి (బిఎల్ఎఫ్) |
| 37. | నర్సాపూర్ | సి. మదన్‌రెడ్డి | సునీతాలక్ష్మారెడ్డి | ఎస్. గోపి | ఎస్. లక్ష్మి (బిఎస్‌పి) |
| 38. | జహీరాబాద్ (ఎస్సి) | కె. మాణిక్ రావు | జె. గీతారెడ్డి | జంగం గోపి | రాంచందర్ (సిపిఎం) |

| సం. | నియోజకవర్గం | టిఆర్ఎస్ | ప్రజాకూటమి | బిజెపి | ఇతరులు |
|---|---|---|---|---|---|
| 39. | సంగారెడ్డి | చింత ప్రభాకర్ | జగ్గారెడ్డి | బి. రాజేశ్వర్‌రావు దేశ్‌పాండే | బి. మల్లేశం (సిపిఎం) |
| 40. | పటాన్‌చెరు | గూడెం మహిపాల్‌రెడ్డి | శ్రీనివాస్ గౌడ్ | పి. కరుణాకర్‌రెడ్డి | ఆర్. శ్రీనివాస్ (సిపిఎం) |
| 41. | దుబ్బాక | ఎస్. రామలింగారెడ్డి | మద్దుల రాజేశ్వర్‌రెడ్డి | ఎం. రఘునందన్ రావు | రాజ్‌కుమార్ (టిజెఎస్) |
| 42. | గజ్వేల్ | కె. చంద్రశేఖరరావు | వంటేరు ప్రతాప్‌రెడ్డి | ఆకుల విజయ | ఎస్. శ్రీనివాస్ (బిఎల్ఎఫ్) |
| రంగారెడ్డి | | | | | |
| 43. | మేడ్చల్ | చామకూర మల్లారెడ్డి | కిచ్చన్నగారి లక్ష్మారెడ్డి | పి. మోహన్‌రెడ్డి | ఎన్. ప్రభాకర్ (బిఎస్‌పి) |
| 44. | మల్కాజిగిరి | ఎం. హనుమంత రావు | దిలీప్‌కుమార్ (టిజెఎస్) | రామచందర్ రావు | ఐలయ్య (బిఎల్ఎఫ్) |
| 45. | కుత్బుల్లాపూర్ | కె.పి. వివేకానంద | కూన శ్రీశైలంగౌడ్ | కాసాని వీరేశ్ | లింగస్వామి (బిఎల్ఎఫ్) |
| 46. | కూకట్‌పల్లి | మాధవరం కృష్ణారావు | సుహాసిని (టిడిపి) | మాధవరం కాంతారావు | పి. హరీష్‌రెడ్డి (బిఎస్‌పి) |
| 47. | ఉప్పల్ | బేతి సుభాష్‌రెడ్డి | వీరేందర్ గౌడ్ (టిడిపి) | ఎన్‌విఎస్ఎస్ ప్రభాకర్ | వి. కృష్ణ (బిఎల్ఎఫ్) |
| 48. | ఇబ్రహీంపట్నం | మంచిరెడ్డి కిషన్‌రెడ్డి | సామ రంగారెడ్డి (టిడిపి) | కొత్త అశోక్ గౌడ్ | మల్‌రెడ్డి రంగారెడ్డి (బిఎస్‌పి) |
| 49. | ఎల్‌బి నగర్ | ఎం. రాంమోహన్ గౌడ్ | డి. సుదీర్‌రెడ్డి | పేరాల శేఖర్ రావు | రాంచందర్ (బిఎల్ఎఫ్) |
| 50. | మహేశ్వరం | తీగల కృష్ణారెడ్డి | పి. సబితా ఇంద్రారెడ్డి | ఎ. శ్రీరాములు యాదవ్ | అరుణ్ ( (బిఎల్ఎఫ్) |
| 51. | రాజేంద్రనగర్ | టి. ప్రకాష్ గౌడ్ | గణేష్ గుప్తా (టిడిపి) | బద్దం బాల్‌రెడ్డి | మీర్జా రహ్మత్‌బేగ్ (మజ్లీస్) |
| 52. | శేరిలింగంపల్లి | అరికెపుడి గాంధీ | బి. ఆనందప్రసాద్ (టిడిపి) | జి. యోగానంద్ | తాంద్రకుమార్ (ఎంసిపిఐ) |
| 53. | చేవెళ్ల | కాలె యాదయ్య | కె.ఎస్. రత్నం | కంజెర్ల ప్రకాష్ | జె. అశోక్ (బిఎల్ఎఫ్) |
| 54. | పరిగి | కొప్పుల మహేష్‌రెడ్డి | టి. రామ్మోహన్‌రెడ్డి | కరణం ప్రహ్లాద రావు | వెంకటయ్య (బిఎల్ఎఫ్) |
| 55. | వికారాబాద్ (ఎస్‌సి) | మెతుకు ఆనంద్ | గడ్డం ప్రసాద్ కుమార్ | రాయిపల్లి సాయికృష్ణ | చంద్రశేఖర్ (ఎఫ్‌బి) |
| 56. | తాండూరు | పట్నం మహేందర్‌రెడ్డి | పి. పైలట్ రోహిత్‌రెడ్డి | పటేల్ రవిశంకర్ | ఎం. సునీల్ (బిఎల్ఎఫ్) |
| హైదరాబాద్ | | | | | |
| 57. | ముషీరాబాద్ | ముఠా గోపాల్ | ఎం. అనిల్‌కుమార్ యాదవ్ | కె. లక్ష్మణ్ | ఎం. నగేశ్ (బిఎల్ఎఫ్) |
| 58. | మలక్‌పేట్ | చావ సతీష్ కుమార్ | ముజఫర్ (టిడిపి) | ఆలె జితేందర్ | అహ్మద్ బలాల (మజ్లీస్) |
| 59. | అంబర్‌పేట | కాలేరు వెంకటేష్ | నిజ్జన రమేష్ (టిజెఎస్) | జి. కిషన్‌రెడ్డి | శ్రీహరి (బిఎల్ఎఫ్) |
| 60. | ఖైరతాబాద్ | దానం నాగేందర్ | దాసోజు శ్రవణ్ | సి.ఎచ్. రామచంద్రారెడ్డి | ఎం. గోవర్ధన్‌రెడ్డి (బిఎస్‌పి) |
| 61. | జూబ్లీ హిల్స్ | మాగంటి గోపీనాథ్ | పి. విష్ణువర్ధన్‌రెడ్డి | శ్రీదర్‌రెడ్డి | అంజిబాబు (బిఎల్ఎఫ్) |
| 62. | సనత్‌నగర్ | టి. శ్రీనివాస్ యాదవ్ | కూన వెంకటేశ్ గౌడ్ (టిడిపి) | భవర్‌లాల్ వర్మ | వెంకటేశ్వర్ (బిఎల్ఎఫ్) |
| 63. | నాంపల్లి | ఎం. ఆనంద్ గౌడ్ | మహ్మద్ ఫిరోజ్ ఖాన్ | దేవర కరుణాకర్ | జఫర్ హుస్సేన్ (మజ్లీస్) |
| 64. | కార్వాన్ | జీవన్‌సింగ్ | ఉస్మాన్ మహ్మద్ అల్‌హాజ్రీ | టి. అమర్ సింగ్ | కౌసర్ మొహియుద్దీన్ (మజ్లీస్) |
| 65. | గోషామహల్ | ప్రేమ్‌సింగ్ రాథోడ్ | ఎం. ముఖేష్ గౌడ్ | రాజా సింగ్ | చంద్రముఖి |
| 66. | చార్మినార్ | మహ్మద్ సలావుద్దీన్ | మహ్మద్ గౌస్ | టి. ఉమా మహేంద్ర | ముంతాజ్ అహ్మద్‌ఖాన్ (మజ్లీస్) |
| 67. | చంద్రాయణగుట్ట | సీతారాంరెడ్డి | ఇసాబినోబైద్ మిస్రీ | సయ్యద్ షహజాదీ | అక్బరుద్దీన్ ఓవైసి (మజ్లీస్) |
| 68. | యాకత్‌పురా | సామ సుందర్‌రెడ్డి | కె. రాజేందర్‌రాజు | చర్మాని రూపరాజు | పాషా ఖాద్రీ (మజ్లీస్) |
| 69. | బహదూర్‌పురా | ఇనాయత్ అలీ బక్రీ | కాలెం బాబా | అనీఫ్ అలీ | మొజంఖాన్ (మజీస్) |
| 70. | సికింద్రాబాద్ | టి. పద్మారావు గౌడ్ | కాసాని జ్ఞానేశ్వర్ | సతీష్ గౌడ్ | అనిల్ (బిఎల్ఎఫ్) |
| 71. | కంటోన్మెంట్ (ఎస్‌సి) | జి. సాయన్న | సర్వే సత్యనారాయణ | శ్రీగణేశ్ | యాదగిరి (బిఎల్ఎఫ్) |
| మహబూబ్‌నగర్ | | | | | |
| 72. | కొడంగల్ | పట్నం నరేందర్‌రెడ్డి | ఎ. రేవంత్‌రెడ్డి | నాగురావు నామోజీ | వెంకటేశ్వర్లు (బిఎల్ఎఫ్) |
| 73. | నారాయణపేట | ఎస్. రాజేందరెడ్డి | వామనగిరి కృష్ణ | కెఆర్ పాండురెడ్డి | శివకుమార్‌రెడ్డి (బిఎల్ఎఫ్) |
| 74. | మహబూబ్‌నగర్ | వి. శ్రీనివాస్‌గౌడ్ | ఎర్ర శేఖర్ (టిడిపి) | పద్మజారెడ్డి | సయ్యద్ ఇబ్రహీం (బిఎస్‌పి) |
| 75. | జడ్చర్ల | సి. హెచ్. లక్ష్మారెడ్డి | మల్లు రవి | మధుసూదన్ యాదవ్ | అజయ్ (బిఎల్ఎఫ్) |
| 76. | దేవరకద్ర | ఎ. వెంకటేశ్వర్‌రెడ్డి | పవన్‌కుమార్‌రెడ్డి | ఎ. నరసింహులు సాగర్ | జయరాములు (బిఎల్ఎఫ్) |
| 77. | మక్తల్ | సి.ఎచ్. రామ్మోహన్‌రెడ్డి | కె. దయాకర్‌రెడ్డి (టిడిపి) | బి. కొండయ్య | జలంధర్‌రెడ్డి (స్వతంత్ర) |
| 78. | వనపర్తి | సింగిరెడ్డి నిరంజన్‌రెడ్డి | జి. చిన్నారెడ్డి | కొత్త అమరేందర్‌రెడ్డి | కృష్ణయ్య (బిఎల్ఎఫ్) |

| సం. | నియోజకవర్గం | టిఆర్ఎస్ | ప్రజాకూటమి | బిజెపి | ఇతరులు |
|---|---|---|---|---|---|
| 79. | గద్వాల్ | బండ్ల కృష్ణమోహన్‌రెడ్డి | డి.కె. అరుణ | వెంకటాద్రిరెడ్డి | రంజిత్ (బిఎల్ఎఫ్) |
| 80. | అలంపూర్ (ఎస్‌సి) | వి.ఎం. అబ్రహాం | ఎస్.ఎ.సంపత్‌కుమార్ | ఆర్. మాధవరెడ్డి | వరప్రసాద్ (బిఎల్ఎఫ్) |
| 81. | నాగర్‌కర్నూల్ | మర్రి జనార్ధన్‌రెడ్డి | నాగం జనార్ధనరెడ్డి | నేదనూరి దిలీప్‌చారి | బహద్దూర్ (టిబిఎస్‌పి) |
| 82. | అచ్చంపేట (ఎస్‌సి) | గువ్వల బాలరాజ్ | సి.ఎచ్. వంశీకృష్ణ | మేదిపూర్ మల్లేశ్వర్ | శేఖర్ (బిఎల్ఎఫ్) |
| 83. | కల్వకుర్తి | జి.జైపాల్‌యాదవ్ | వంశీచంద్‌రెడ్డి | టి. ఆచారి | బాలస్వామి (బిఎల్ఎఫ్) |
| 84. | షాద్‌నగర్ | వై. అంజయ్య యాదవ్ | సి. ప్రతాప్‌రెడ్డి | ఎన్. శ్రీవర్ధన్‌రెడ్డి | వి. శంకర్ (బిఎస్‌పి) |
| 85. | కొల్లాపూర్ | జూపల్లి కృష్ణారావు | బి. హర్షవర్ధన్‌రెడ్డి | సుధాకర్ రావు | బ్రహ్మయ్య (బిఎల్ఎఫ్) |
| నల్లగొండ | | | | | |
| 86. | దేవరకొండ (ఎస్‌టి) | రమావత్ రవీంద్రకుమార్ | బాలునాయక్ | కల్యాణ్‌నాయక్ | బిల్యానాయక్ (బిఎస్‌పి) |
| 87. | నాగార్జున సాగర్ | నోముల నరసింహయ్య | కె. జానారెడ్డి | కంకణాల నివేదిత | సౌజన్య (బిఎల్ఎఫ్) |
| 88. | మిర్యాలగూడ | ఎన్. భాస్కర్ రావు | ఆర్. కృష్ణయ్య | కరనాటి ప్రభాకర్ | జూలకంటిరంగారెడ్డి |
| 89. | హుజూర్‌నగర్ | శానంపూడి సైదిరెడ్డి | ఉత్తమ్ కుమార్‌రెడ్డి | బొబ్బా భాగ్యరెడ్డి | శేఖర్‌రావు (సిపిఎం) |
| 90. | కోదాడ | బొల్లం మల్లయ్య యాదవ్ | ఎన్. పద్మావతిరెడ్డి | జల్లేపల్లి వెంకటేశ్వర్‌రావు | శ్రీరాములు (సిపిఎం) |
| 91. | సూర్యాపేట | జి. జగదీశ్‌రెడ్డి | రాంరెడ్డి దామోదర్‌రెడ్డి | ఎస్. వేంకటేశ్వరరావు | శ్రీనివాస్ గౌడ్ (బిఎల్ఎఫ్) |
| 92. | నల్లగొండ | కంచర్ల భూపాల్‌రెడ్డి | కోమటిరెడ్డి వెంకట్‌రెడ్డి | శ్రీరామోజు షణ్ముఖ | మీనయ్య (బిఎల్ఎఫ్) |
| 93. | మునుగోడు | కె. ప్రభాకర్‌రెడ్డి | కోమటిరెడ్డి రాజగోపాల్‌రెడ్డి | జి. మనోహర్‌రెడ్డి | వెంకటేశ్వరరావు (స్వ) |
| 94. | భువనగిరి | పైళ్లశేఖర్‌రెడ్డి | కంభం అనిల్‌కుమార్‌రెడ్డి | జిట్టా బాలకృష్ణారెడ్డి (వైటిపి) | కె. మల్లేశం (సిపిఎం) |
| 95. | నకిరేకల్ (ఎస్‌సి) | వేముల వీరేశం | చిరుమర్తి లింగయ్య | కాసర్ల లింగయ్య | నగేశ్ (సిపిఎం) |
| 96. | తుంగతుర్తి (ఎస్‌సి) | కిశోర్‌కుమార్ | అద్దంకి దయాకర్ | కె. రామచంద్రయ్య | డాక్టర్ రవి (కా.రెబల్) |
| 97. | ఆలేరు | గొంగిడి సునీత | బి. భిక్షమయ్య గౌడ్ | దొంతిరి శ్రీధర్‌రెడ్డి | ఎం. నరసింహులు |
| వరంగల్ | | | | | |
| 98. | జనగామ | ముత్తిరెడ్డి యాదగిరిరెడ్డి | పొన్నాల లక్ష్మయ్య | కెవిఎల్ఎన్‌రెడ్డి (రాజా) | ఉడుత రవి (సిపిఎం) |
| 99. | ఘన్‌పూర్ (ఎస్‌సి) | తాటికొండ రాజయ్య | సింగాపూర్ ఇందిర | పి. వెంకటేశ్వర్లు | రాజారపు ప్రతాప్ (బిఎస్‌పి) |
| 100. | పాలకుర్తి | ఎర్రబెల్లి దయాకర్‌రావు | జంగా రాఘవరెడ్డి | సోమయ్య గౌడ్ | శ్రీనివాస్ (బిఎస్‌పి) |
| 101. | డోర్నకల్ (ఎస్‌టి) | డి.ఎస్. రెడ్యానాయక్ | రామచంద్రునాయక్ | జి. లక్ష్మణ్ నాయక్ | ఎ. వెంకన్న (బిఎల్ఎఫ్) |
| 102. | మహబూబాబాద్ | బానోత్ శంకర్‌నాయక్ | పి. బలరాంనాయక్ | హుస్సేన్‌నాయక్ | మోహన్‌లాల్ (బిఎల్ఎఫ్) |
| 103. | నర్సంపేట | పెద్ది సుదర్శన్‌రెడ్డి | దొంతి మాధవరెడ్డి | ఎడ్ల అశోక్‌రెడ్డి | ఎం. అశోక్ (బిఎల్ఎఫ్) |
| 104. | పరకాల | చల్లా ధర్మారెడ్డి | కొండా సురేఖ | పి. విజయచంద్రారెడ్డి | వేణు (ఏఐఎఫ్‌బి) |
| 105. | వరంగల్‌పశ్చిమ | డి. వినయ్‌భాస్కర్ | రేవూరి ప్రకాష్‌రెడ్డి (టిడిపి) | ఎం. ధర్మారావు | శ్రీకాంత్ (బిఎల్ఎఫ్) |
| 106. | వరంగల్ తూర్పు | నన్నపనేని నరేందర్ | వద్దిరాజు రవిచంద్ర | కుసుమ సతీశ్ | గాదె ఇన్నయ్య (టిజెఎస్) |
| 107. | వర్ధన్నపేట (ఎస్‌సి) | ఆరూరి రమేశ్ | దేవయ్య (టిజెఎస్) | కొత్త సారంగరావు | స్వామి (బిఎల్ఎఫ్) |
| 108. | భూపాలపల్లి | మధుసూదనాచారి | గండ్ర వెంకటరమణారెడ్డి | చందుపట్ల కీర్తిరెడ్డి | గండ్ర సత్యనారాయణ |
| 109. | ములుగు (ఎస్‌టి) | అజ్మీర చందూలాల్ | సీతక్క (డి. అనసూయ) | బానోత్ దేవీలాల్ | నారాయణ (బిఎల్ఎఫ్) |
| ఖమ్మం | | | | | |
| 110. | పినపాక (ఎస్‌టి) | పాయం వెంకటేశ్వర్లు | రేగా కాంతారావు | సంతోష్ కుమార్ | నాగేశ్వర్‌రావు (సిపిఎం) |
| 111. | ఇల్లందు (ఎస్‌టి) | కోరం కనకయ్య | బానోత్ హరిప్రియానాయక్ | ఎం. నాగ స్రవంతి | గుమ్మడి నర్సయ్య (న్యూ.డె) |
| 112. | ఖమ్మం | పువ్వాడ అజయ్‌కుమార్ | నామా నాగేశ్వర్‌రావు | వుప్పాల శారద | పి. రామారావు (బిఎల్ఎఫ్) |
| 113. | పాలేరు | తుమ్మల నాగేశ్వరరావు | కె. ఉపేందర్‌రెడ్డి | కె. శ్రీధర్‌రెడ్డి | బి. హైమవతి (సిపిఎం) |
| 114. | మధిర (ఎస్‌సి) | లింగాల కమల్‌రాజ్ | మల్లు భట్టివిక్రమార్క | శ్యామల్‌రావు | రాంబాబు (బిఎల్ఎఫ్) |
| 115. | వైరా (ఎస్‌టి) | బానోత్ మదన్‌లాల్ | బి. విజయాబాయి (సిపిఐ) | భూక్య రేష్మాబాయి | రాములునాయక్ (కా.రె) |
| 116. | సత్తుపల్లి (ఎస్‌సి) | పిడమర్తి రవి | సండ్ర వెంకటవీరయ్య (టిడిపి) | ఎన్. రామలింగేశ్వరరావు | భారతి (సిపిఎం) |
| 117. | కొత్తగూడెం | జలగం వెంకట్రావు | వనమా వెంకటేశ్వరరావు | బైరెడ్డి ప్రభాకర్‌రెడ్డి | వై.కృష్ణ (బిఎల్ఎఫ్) |
| 118. | అశ్వరావుపేట (ఎస్‌టి) | తాటి వెంకటేశ్వర్లు | ఎం.నాగేశ్వర్‌రావు (టిడిపి) | భూక్యా ప్రసాదరావు | రవీందర్ (సిపిఎం) |
| 119 | భద్రాచలం (ఎస్‌టి) | టి.వెంకట్రావు | పొదెం వీరయ్య (కాంగ్రెస్) | కుంజా సత్యవతి | బాబూరావు (సిపిఎం) |

# తిత్లీ తుపాను బాధితులకు సహాయం నేరమా?

***మానవతా దృక్పథంతో తిత్లీ తుపాను బాధితులను ఆదుకోవడానికి వెళ్లిన ప్రజా సంఘాల వారిని ప్రభుత్వం పబ్లిక్ సెక్యూరిటీ చట్టం కింద అరెస్టుచేసి జైల్లో నిర్బంధించడాన్ని మానవతావాదులంతా ఖండించాలని అంటున్నారు* దుడ్డు ప్రభాకర్**

**2018** అక్టోబర్ 11న సాయంత్రం 5 గంటల నుండి రాత్రంతా తిత్లీ తుపాను గంటకు 140 కి.మీ. వేగంతో శ్రీకాకుళం జిల్లాపై విరుచుకపడింది. పలాస, మందస, వజ్రపుకొత్తూరు, సోంపేట, కంచిలి, కవిటి, ఇచ్ఛాపురం, కొత్తూరు, కోటబొమ్మాళి, సంతబొమ్మాళి, నందిగాం, టెక్కలి మండలాలలోని వందలాది గ్రామాలు తిత్లీ తుపాను బీభత్సానికి గురయ్యాయి. ఉద్దాన ప్రాంత ప్రజల జీవనాధారమైన జీడిమామిడి, కొబ్బరి, అరటి చెట్లు వేళ్లతో సహా విరిగిపడ్డాయి. తీరప్రాంత గిరిజనుల గుడిసెలు పూర్తిగా ధ్వంసమయ్యాయి. మత్స్యకారుల పడవలు విరిగి పోయాయి. వలలు చినిగిపోయాయి. వారి బతుకులు ఆగమయ్యాయి.

1802 గ్రామాలలోని 2 లక్షల 25 వేల కుటుంబాలు తుపాను వల్ల నష్ట పోయాయని, 50 వేల ఇళ్లు ధ్వంసమయ్యాయని, 1 లక్ష 65 వేల హెక్టార్లలో వ్యవసాయపంటలు, 40 వేల హెక్టార్లలో కొబ్బరి, జీడి మామిడి తోటలు దెబ్బతిన్నాయని, 630 కి.మీ రహదారులు ధ్వంసమయ్యాయని, 459 బోట్లు, 1600 వలలు ధ్వంసమయ్యాయని ప్రభుత్వం నిర్ధారించింది. రు. 3,435 కోట్ల నష్టం వాటిల్లిందని అంచనా వేసింది. రు. 1,200 కోట్లు కేంద్రం తక్షణ సహాయం చేయాలని డిమాండ్ చేసింది. వరికి హెక్టారుకు రు. 20 వేలు, జీడి తోటలకు హెక్టారుకు రు. 30 వేలు, కొబ్బరి చెట్టుకు రు. 1500. తాటి చెట్టుకి రు. 800, కూలిన ఇళ్లకు రు. 2.50 లక్షలు, పశువుల కొట్టాలకు లక్షనుండి లక్షా ఎనభైవేల వరకు, గేదె, ఆవు చనిపోతే రు. 30 వేలు, గొర్రె, మేక చనిపోతే రు. 3 వేలు నష్టపరిహారం చెల్లిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. బాధితులందరినీ ఆదుకుంటామని చెబుతున్న చంద్రబాబు ప్రభుత్వం మీడియాలో విస్తృత ప్రచారం చేసుకుంటుంది. చివరకు తిత్లీ తుపాను బాధితుల కన్నీళ్లను, కష్టాలను ఓట్లుగా మార్చుకోవడానికి ఆర్.టి.సి. బస్సులను కూడా వదలకుండా ప్రచారం చేసుకోవడం ఈ శతాబ్దపు దివాలాకోరు సన్నివేశం.

క్షేత్రస్థాయిలో పరిశీలిస్తే బాధితుల స్థితి ప్రభుత్వం చేసుకుంటున్న ప్రచారానికి భిన్నంగా ఉంది. అక్టోబర్ 20 వరకు అనేక గ్రామాల ప్రజలు చీకట్లోనే కాలం వెల్లదీశారు. రోడ్లకు అడ్డంగా పడిపోయిన చెట్లను గ్రామస్తులే తొలగించుకున్నారు. తాగడానికి గుక్కెడు నీళ్లు దొరక్క గ్రామాలకు గ్రామాలే రోడ్లపై బైఠాయిస్తేగానీ తాగునీరు అందలేదు. నష్టపరిహారం అంచనావేయడానికి వచ్చిన అధికారులు కొబ్బరితోటలను జీడి తోటలుగా రికార్డుచేస్తూ అతితక్కువ నష్టపరిహారం అందచేస్తున్నారు. రాజకీయ వత్తిళ్లకు, ప్రలోభాలకు లొంగిన అధికారులు భూస్వాములకు, తెలుగు తమ్ముళ్లకు అధిక మొత్తంలో నష్టపరిహారం అందేలా తప్పుడు రికార్డులు తయారుచేశారు. సోషల్ ఫారెస్ట్ భూముల్లో, అసైన్డ్, బంజరు భూముల్లో ఉన్న మత్స్యకారులు, దళిత, గిరిజనుల జీడి ,తోటలకు నష్టపరిహారం అందించడంలేదు. చనిపోయిన, కనిపించకుండాపోయిన పశువులను లెక్కలోకి తీసుకోలేదు. సర్వం కోల్పోయి కట్టుబట్టలతో, కాలేకడుపులతో ఉన్న ప్రజలు ఎక్కడికక్కడ అధికారులకు మొరపెట్టు కుంటూనే ఉన్నారు. ముఖ్యమంత్రి, మంత్రుల పర్యటన సందర్భంగా ప్రశ్నించే బాధితులను గుర్తించి అరెస్టులు చేశారు. సహాయం అందడం లేదని ప్రాధేయపడుతున్న బాధితులను ముఖ్యమంత్రి బెదిరించడం మీడియా ద్వారా దేశ ప్రజలు చూసి నివ్వెరపోయారు.

ఈ పరిస్థితుల్లో అనేక సమస్యలతో సతమతమవుతూ దిక్కుతోచని స్థితిలో ఉన్న ఉద్దాన ప్రాంత బాధితులు "తిత్లీ తుపాను బాధితుల కమిటీ" గా ఏర్పడి 15 రోజులపాటు 160కి పైగా గ్రామాలు పర్యటించి బాధితుల కష్టాలను రికార్డు చేశారు. కరపత్రం రూపంలో ప్రభుత్వం దృష్టికి తెచ్చారు. సాధారణ పంటలకు ఇచ్చినట్లు జీడి, కొబ్బరి తోటలకు నష్టపరిహారం ఇవ్వడం సరికాదన్నారు. వరి పంట నష్టపోతే తర్వాత 'కారు'కి వరి నాటుకోవచ్చు. కానీ కొన్నితరాలనుండి సంవత్సరానికి ఎకరాకి లక్ష రూపాయల చొప్పున ఆదాయాన్నిచ్చే జీడి, కొబ్బరి చెట్లు కూలిపోతే మళ్లీ అవికాపుకి రావాలంటే 10, 15 సంవత్సరాలు పడుతుంది. కాబట్టి ఉద్దాన ప్రాంత ప్రజలు ప్రత్యేక ప్యాకేజీ కావాలని అడుగుతున్నారు. లక్షల రూపాయల విలువజేసే బోట్లు ధ్వంసమైతే కంటితుడుపుచర్యగా నష్టపరిహారం చెల్లించడం న్యాయమేనా? అంటూ ఏలినవారిని నిలదీస్తున్నారు.

తిత్లీ తుపాను సృష్టించిన బీభత్సాన్ని జాతీయ విపత్తుగా గుర్తించాలని, 1200 కోట్లు తక్షణ సాయం కేంద్రం ప్రకటించాలని, చంద్రబాబు డిమాండ్ చేస్తున్నారు. కేంద్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్‌పట్ల నిర్లక్ష్య, కక్షసాధింపు వైఖరితో ఉందని విమర్శిస్తూ పేదలపాలిటి పెన్నిధిగా, ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి కోరుకునేవారిగా తనకు తానే కీర్తించుకుంటూ భుజాలు చరుసుకుంటారు. కానీ న్యాయమైన నష్టపరిహారం కోరుతూ, రాష్ట్ర ప్రభుత్వ పక్షపాత వైఖరిని ప్రశ్నించే బాధితుల్ని మాత్రం దేశద్రోహులుగా చిత్రీకరిస్తున్నారు. అందులో భాగంగానే న్యాయం కోరుతున్న బాధితుల కమిటీ సభ్యులు ప్రభుత్వం దృష్టిలో నేరస్తులయ్యారు. శ్రీకాకుళం జైల్లో బందీలయ్యారు.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ మానవ సంబంధాలను మార్కెట్ సంబంధాలుగా మారుస్తున్నవేళ సాటి మనుషులు కష్టాలలో ఉన్నపుడు సాయపడాలనే స్పృహ ఉన్న కొందరు మనుషులు తమశక్తి మేరకు తుపాను బాధితులకు సహాయం అందించారు. వాళ్లకు ఏ రాజకీయ ప్రయోజనమూ ఉండదు. ప్రకాశం, గుంటూరు జిల్లాల్లోని అనేక గ్రామాలలోని 'మనుషులు' జోలెపట్టి కేజీ, రెండు కేజీలు వసూలు చేయగా వచ్చిన 38 క్వింటాళ్ల బియ్యం, కొన్ని చీరలు, నిత్యావసర వస్తువులను నవత ట్రాన్స్‌పోర్టులో పలాసకి బుక్‌చేశారు. వాళ్లలో ఇద్దరు రైల్లో పలాసకి

చేరారు. పోలీసులు నవత ట్రాన్స్‌పోర్ట్ వాళ్లను బెదిరించి బియ్యాన్ని స్వాధీనం చేసుకొని కోట బొమ్మాళి స్టేషన్‌కి తరలించారు. బియ్యం కోసం వెళ్లిన ప్రకాశం జిల్లా కుంచెపల్లి గ్రామానికి చెందిన నాగార్జున రెడ్డి, నాగేశ్వర రెడ్డి, జనార్దన రెడ్డిలను అదుపులోకి తీసుకొని "ఈ బియ్యం ఎక్కడి నుండి తెచ్చారు'. ఎవరిచ్చారు? మావోయిస్టులకు మీకు సంబంధమేమిటి?" అని వేధించారు. ఒక్కసారిగా మావోయిస్టులతో సంబంధాలు అంటగట్టే సరికి వారు భయాందోళనకు గురై బియ్యాన్ని వొదిలేసి ఇళ్లకు వెళ్లారు. అప్పటికే ప్రకాశం జిల్లా పోలీసులు వీళ్ల ఇళ్లకు వెళ్లి కుటుంబ సభ్యులను బెదిరించారు. బియ్యం బుక్ చేసిన చంద్రశేఖర్ (టీచర్) అనే వ్యక్తిని ఉద్యోగం ఊడుతుందని హెచ్చరించారు.

దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమం (పి.డి.ఎం.) కార్యకర్తలు 10 రోజులపాటు ఊరూరు తిరిగి వసూలు చేసిన బియ్యం కూడా అందులో ఉన్నాయి. ఆ కారణంగా పిడిఎం నాయకత్వం స్థానిక ఎం.ఆర్.ఓ. ఆర్.డి.ఓ.ల ద్వారా స్టేషన్ నుండి బియ్యాన్ని తీసుకొని స్థానిక తుపాను బాధితుల కమిటీ ఆధ్వర్యంలో వజ్రపు కొత్తూరు మండలంలో బాధితులకు పంచుతున్నారు. డోకులపాడు గ్రామంలో పంచుతున్నపుడు ఒక్కసారిగా పోలీసులు చుట్టుముట్టి "మీరంతా మావోయిస్టుపార్టీ అనుబంధ సంఘాల సభ్యులంటూ అదుపులోకి తీసుకున్నారు. వారిలో పి.డి.ఎం. రాష్ట్ర కార్యదర్శి వై.వెంకటేశ్వర్లు, ప్రజా కళామండలి రాష్ట్ర సహాయ కార్యదర్శి నీలకంఠం, అమరుల బంధుమిత్రుల సంఘం రాష్ట్ర అధ్యక్షురాలు అంజమ్మలతో సహా ఆయా సంఘాల ప్రతినిధులు, తుపాను బాధితుల కమిటీ సభ్యులు మొత్తం 14 మంది ఉన్నారు. వారిపై రాజ్యాన్ని కూల్చడానికి కుట్ర పన్నుతున్నారని, 120(బి) 124, ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సెక్యూరిటీ యాక్ట్ కింద కేసు నమోదుచేసి శ్రీకాకుళం జైలుకు తరలించారు.

ప్రభుత్వం ఆరోపిస్తున్నట్టు వాళ్లు మావోయిస్టు అనుబంధ సంఘాల సభ్యులే అనుకుందాం. అయితే బాధితులకు బియ్యం సహాయం చెయ్యకూడదా! పేదల ఆకలిదప్పులకు కారుకులైన పాలకులే ప్రజల డబ్బుతో అన్నా క్యాంటిన్‌లు తెరవాలా? అడవులను ధ్వంసం చేస్తున్న వాళ్లే మొక్కలు నాటుతూ ఫోటోలకు ఫోజులిస్తున్నారు. నూతన ఆర్థిక విధానాలు ప్రవేశపెట్టి చేతి వృత్తులను మాయం చేసినోడే పనికి ఆహార పథకం పేరుతో పని కల్పిస్తున్నాడు. పర్యావరణ కాలుష్యానికి కారకులైన కార్పొరేట్ కంపెనీలు ఏర్పాటు చేసిన నిధులతో పర్యావరణ పరిరక్షణ అంటూ మొక్కుబడి కార్యక్రమాలు చేయిస్తున్నారు.

రాజ్యమే మాయల మరాఠీగా మారిన వేళ స్వచ్ఛందంగా, నిజాయితీగా స్పందించినవారు రాజ ద్రోహులుగా, అర్బన్ మావోయిస్టులుగా, అభివృద్ధి నిరోధకులుగా చిత్రీకరించబడుతున్నారు. అలాంటి వారిని తూత్తుకుడిలో కాల్చి చంపుతారు. ఉద్దానంలో రాజద్రోహ నేరం కింద అరెస్టు చేస్తారు.

ఉద్యాన వనంలా ఉండే ఉద్దాన ప్రాంతాన్ని తిత్లీ అతలాకుతలం చేసి 40 రోజులయ్యింది. ఇంకా తీరప్రాంత ఆదివాసుల గుడిసెలపై కప్పులు ఏర్పడలేదు. మత్స్యకారులు వేటకరువై కాలేకడుపులతో సముద్రం వైపు దీనంగా చూస్తూ కాలం గడుపుతున్నారు. పడిపోయిన కొబ్బరి, జీడి చెట్లను ఇంకా తొలగించలేదు. ఏ రైతును కదిల్చినా బోరున ఏడుస్తున్నాడు. అసలే ఉద్దాన ప్రాంతంలోని ప్రజలు కిడ్నీవ్యాధుల బారిన పడి ఏటా వందలాది మంది మరణిస్తున్నారు. ఆ ప్రాంతంలో కిడ్నీ వ్యాధులు ప్రబలడానికి గల కారణాలను తెలుసుకోవడానికి ప్రత్యేక డాక్టర్ల బృందంతో పరిశోధన చేయించాలని, అప్పటి దాకా ప్రతి మండల కేంద్రంలో డయాలసిస్ సెంటర్ ఏర్పాటు చేయాలని, కిడ్నీ వ్యాధి గ్రస్తులకు ఉచితంగా మందులు పంపిణీ చేయాలని సంవత్సరాల తరబడి పాలకులను వేడుకొంటున్నారు.

మరోవైపు పాలకులు కోస్టల్ కారిడార్ పేరుతో సముద్ర తీరప్రాంతాన్ని థర్మల్ పవర్ ప్లాంట్‌లు, రకరకాల రసాయన పరిశ్రమల ఏర్పాటుకు సామ్రాజ్యవాదులకు కట్టబెడుతున్నారు. థర్మల్ పవర్ ప్లాంట్‌లకు వ్యతిరేకంగా సోంపేట, కాకరాపల్లి ప్రజల వీరోచిత పోరాటాలను గుర్తుచేసుకంటూ తీరప్రాంత గ్రామాలను సామదాన బేద దండోపాయాలతో ఖాళీ చేయించే ప్రణాళికలు సిద్ధం చేసుకుంటున్నారు. అంతలో తిత్లీ తుపాన్ మిత్తవలా చుట్టుముట్టి తీరప్రాంత గ్రామాలను ధ్వంసం చేసింది. కాగలకార్యం గంధర్వులు తీర్చినట్లు భావిస్తున్న కార్పొరేట్ కంపెనీలకు ఊడిగం చేస్తున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తిత్లీ బాధితులకు నష్టపరిహారం అందించడంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నాయి. చంద్రబాబు ఉద్దానాన్ని ఉద్దరిస్తున్నా మంటూ కాకిలెక్కలతో అసత్య ప్రచారం చేస్తున్నారు. వాస్తవాలను రాష్ట్ర ప్రజలకు తెలియజేయడాన్ని సహించలేని చంద్రబాబు ప్రభుత్వం తుపాను బాధితుల కమిటీపై అసత్య ఆరోపణలు చేస్తూ, జైల్లో నిర్బంధించింది.

భీమాకోరేగావ్ ఆత్మగౌరవ ర్యాలీకి, దేశవ్యాప్తంగా నగరాలలో ఉండే ప్రజాస్వామిక వాదులకు, దండకారణ్యంలో ఉండే మావోయిస్టులకు లింక్‌పెట్టి వందలాది అత్యంత అధునాతన ఆయుధాల రక్షణ వలయంలో ఉండే ప్రధాని నరేంద్రమోడీ హత్యకు కుట్రపన్నారనే బిజెపి కట్టుకథకంటే తెలుగుదేశం పిట్టకథ మరింత విడ్డూరంగా ఉంది. ఇప్పటిదాకా రాజ్యం దృష్టిలో నేరస్థులుగా ఉన్నవారికి సహకరిస్తున్నారని కేసులు పెడుతున్న పోలీసులు ఇకనుండి ఆకలితో, కష్టాలలో ఉన్నవారికి సహాయంచేసే (రాజ్యంలో భాగంకాని, పాలకులకు ఊడిగంచేస్తూ బాకాలూదని) ప్రతి ఒక్కరిని రాజ ద్రోహులుగా చట్టం ముందు నిలబెట్టబోతున్నారని తలచుకుంటేనే వొల్లు జలదరిస్తుంది. కాబట్టి చంద్రబాబు నియంతృత్వ పాలనకు వ్యతిరేకంగా ఉద్యమించాల్సిన బాధ్యత ప్రతి ప్రజాస్వామిక వాదిపై ఉంది. తిత్లీ తుపాను బాధితులకు కేవలం ఒకపూట గంజి నీళ్లు సహాయం చేయడానికి వెళ్లిన వారిని రాజ ద్రోహులుగా చిత్రీకరించడాన్ని మానవత్వంగల వారందరూ ఖండించాల్సివుంది.

*(రచయిత రాష్ట్ర అధ్యక్షులు కులనిర్మూలనా పోరాటసమితి)* వీ

*పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం వీక్షణం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడడంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు. – సం.*

# ప్రజా ఉద్యమ గుండె చప్పుడు ధర్నా చౌక్

***ప్రజా సమస్యలకు వేదికైన ధర్నా చౌక్‌ను మూసేయాలని ప్రభుత్వం చేసిన ప్రయత్నాలను ప్రతిఘటిస్తూ భావ వ్యక్తీకరణ కోసం పోరాడిన ప్రజాస్వామికవాదులు విజయం సాధించారని అంటున్నారు* కె.సజయ**

ఒక పిట్టకథతో ఈ వ్యాసాన్ని మొదలుపెడదాం. అందరికీ తెలిసిన కథే. అనగనగా ఒక దొరవారు. దొర అంటేనే అహంభావం అని మళ్లీ మళ్లీ చెప్పుకోవాలా! అందరికీ తెలిసిందే కదా! అయితే, మన ప్రాంతం గురించి మాట్లాడుతున్నాడు గదా, మనల్నెందుకు మోసం చేస్తాడులే అనుకున్న ప్రజలు ఈయనకి సింహాసనం అప్పజెప్పారు. అప్పటినుంచి ఆయన తనని తాను ఒక దైవాంశ సంభూతుడిగా భావించుకున్నాడు. యజ్ఞ యాగాదులు, దేవుళ్ల గుళ్లకు బహుమతులు ఒకటా రెండా చాలా చాలా ఇచ్చాడు. దొరగారికో గురువుగారు ఉన్నారు. అందరితో తన కాళ్లకు మొక్కించుకునే దొరవారు ఈ గురువుగారి పాదాలకు సాష్టాంగ నమస్కారం చేస్తారు. ఆ గురువుగారి ఆదేశాలతో దొరవారు దేవతా వస్త్రాలను మాత్రమే ధరించడం మొదలుపెట్టారు. అవి కంటికి కనపడవని, అవి వేసుకున్నవాళ్లు బయట ఎవ్వరికీ కనిపించరనీ, కానీ ఆయనకు మాత్రం అన్నీ కనిపిస్తాయనీ, వినిపిస్తాయనీ చెప్పారు. అప్పటి నుంచీ ఆయన దేవతా వస్త్రాల పేరుతో రోజూ బట్టల్లేకుండానే గడుపుతున్నాడు. ఆయన పక్కనున్న వాళ్లకి ఈయన నగ్నంగానే ఉన్నాడని నిజం తెలిసినా గానీ మెప్పుకోసం ఆయన అదృశ్యరూపంలో ఉన్నాడని నటిస్తూ వచ్చారు. తన వాళ్లకు తప్ప బయటివాళ్లకు ఆయన తన దర్శన భాగ్యాన్ని ఇవ్వడు కాబట్టి ఈ విషయం బయట ఎవ్వరికీ తెలియలేదు అని అనుకున్నారు. బయట ప్రజలకు ఈ విషయం తెలిసి పదే పదే ఆ విషయాన్నే మాట్లాడుతూ వస్తున్నారు కానీ, వాటిని ఆయన వరకూ చేరవేయాల్సిన సమాచార వ్యవస్థ కూడా ఆ మాటలకు ఎక్కడా పిసరంత స్థానం ఇవ్వకుండా ఆయనకు నచ్చే విధంగానే పలుకులను వినిపిస్తోంది.

అలా కొద్దికాలం గడిచిందో లేదో ఆయనకి నెమ్మదిగా ఒకవైపు నుంచి తలలో హోరు మొదలయింది. అది నెమ్మదిగా విపరీతమైన తలపోటుగా మారసాగింది. దైవాంశ సంభూతుడనయిన నాకు ఏమిటీ ఈ హోరు, ఎందుకీ తలపోటు అని పరిశోధించడానికి దొరవారు వేగులవారిని నియమించారు. వేగులవారు ఒక సమాచారాన్ని ఆయన చెవిలో వేశారు. అదేమిటంటే మీరు ఈ సింహాసనం ఎక్కడానికి ఏ కేంద్రమయితే ముఖ్యకారణమయిందో, ఎక్కడయితే ప్రజలు ఉపయోగించే ధర్మగంట ఉందో అక్కడి నుంచే ఈ హోరు వస్తోందని, అదే మీ తలపోటుకి కారణమని! అంతే ఉన్నపళాన ఆయన ఆ ప్రదేశాన్ని తన మాయాదర్పణంతో వీక్షించాడు. అది చాలా చిన్న ప్రదేశం. ఆ పక్కనే పిల్లలు ఆడుకునే మైదానాన్ని కూడా తీసేసుకుని తన కీర్తిని గానం చేసేలా ఒక మహాకళానిలయాన్ని నిర్మించాలని ఆయన ఆశ. అయితే అది అడియాశగానే మిగిలిపోయింది.

ఆ చిన్న ప్రాంతంలో గుంపులు గుంపులుగా ఉన్న సామాన్యమైన ప్రజలు మాట్లాడుతున్నదొకటే విషయం. అదే 'దొరవారు బట్టల్లేకుండా తిరుగుతున్నారహో' అంటూ ఆయన నగ్న స్వరూపాన్ని వివరిస్తూ ఉన్నారు. ఒకరూ ఇద్దరూ కాదు, అనేక సమూహాల వారు. ఔరా! దైవాంశ సంభూతుడినయిన నా గురించి ఇలా మాట్లాడుకుంటారా అని దొరవారు ఆగ్రహోదగ్రులయ్యారు. ఈ ప్రాంతాన్ని ఈ గంటను శాశ్వతంగా మూసేయండి అంటూ తన రక్షకభటులకు నోటిమాటతో ఆదేశాలు జారీచేసేశారు. ఇంకేముంది, మీరు ఇక్కడ కూర్చోటానికి వీల్లేదంటూ అప్పటికే ఉన్నవాళ్లను చెదరగొట్టేశారు రక్షకభట అధికారులు. ఎవరన్నా వెళ్లి మాకో సమస్య ఉంది, అక్కడ కూర్చుంటామంటే, 'ధర్మగంట మోగించడానికి ఆ స్థలాన్ని మాత్రం ఒప్పుకోము, ఊరవతలకు వెళ్లి కూర్చోండి' అనడం మొదలు పెట్టారు.

ఇంక సహనం నశించిన ప్రజలు తమ నిరసనను రకరకాల రూపాల్లో చూపించడం మొదలుపెట్టారు. చివరికి న్యాయాధికారులకు కూడా విన్నవించుకున్నారు. అలా సంవత్సరంన్నర నడిచింది. అప్పుడు ఆ న్యాయాధికారులు ఇదెక్కడి అన్యాయమంటూ ఒక నెలన్నర పాటు ఏ ఆంక్షలు పెట్టకూడదంటూ దొరవారికి, వారి రక్షక భటులకు ఆదేశాలు ఇచ్చారు. దానితో ఇక అప్పటి నుండి మళ్లీ ధర్మగంట మోగడం మొదలయింది. ఇదండీ ఆ పిట్టకథ. ఇంతకూ, దొరవారి నగ్నత్వాన్ని ఎండగట్టిన ఆ ధర్మగంట ఉన్న ప్రాంతం పేరే 'ధర్నాచౌక్'.

ఇందిరాపార్క్ ధర్నాచౌక్ అంటేనే పిడికిలెత్తిన నినాదం. ఉద్యమ బావుటా. లక్షలాది అసామాన్యమయిన సామాన్యుల పొలికేక. నిరంతర చైతన్యం. అలాంటి వేదికను మూసేయాలని చూస్తే, ఉద్యమించే గొంతులను నులిమెయ్యాలని చూస్తే, నిర్బంధిస్తే? నిర్బంధానికి వ్యతిరేకంగా ప్రజాసంఘాలు, మేధావులు, రాజకీయ పార్టీలు ఒక ఐక్యకార్యాచరణకు నాంది పలికాయి. ధర్నాచౌక్ ఆలంబనగా పోరుసల్పిన మట్టిపాదాలు, సబ్బండ వర్ణాలు, పీడిత తాడిత గళాలు పోరునందుకున్నాయి. ధర్నాచౌక్‌ను తిరిగి న్యాయబద్ధంగా తెరిపించటంలో విజయం సాధించాయి. అదే ఇప్పుడు మనం చెప్పుకోబోతున్న ప్రస్థానం.

ధర్నాచౌక్ అంటే కేవలం ఒక వర్గానికి మాత్రమే సంబంధించిన విషయం కాదు. సమాజంలోని విభిన్న సమూహాలు తమ ఆకాంక్షలను, విమర్శలను, వ్యతిరేకతలను ప్రభుత్వానికి తెలియజేసే వేదిక. ఒకే సమయంలో భిన్న ఆకాంక్షలకు సంబంధించిన సమూహాలు పక్కపక్కనే టెంట్లు వేసుకుని తమ ఆలోచనలను ప్రజాస్వామ్యయుతంగా వ్యక్తపరుస్తూ ఉండే ప్రదేశం. ఎన్నెన్ని సమూహాలు... ఇక్కడ తమకు చేతనైనంతలో జనసమీకరణ చేసుకుని, తమకు సంఘీభావం తెలియజేసే వ్యక్తులను, మీడియాను పిలుచుకుని తమకు న్యాయబద్ధంగా రావలసిన అంశాలను డిమాండ్ల రూపంలో ప్రభుత్వ యంత్రాంగానికి అందజేస్తూ ఉంటారు.

ఈ ఇరవై సంవత్సరాల కాలంలో బహుశా చాలా కొద్ది సందర్భాలలో తప్పించి అదుపు చేయలేనంత జనం అయితే ఎప్పుడూ రాలేదు. ప్రధాన రాజకీయ పార్టీల సమావేశాలప్పుడే ఒకవైపు రోడ్డుని, అది కూడా పోలీసులే మూసేసేవాళ్లు. తెలంగాణ ఉద్యమ సందర్భంలో కూడా సాగరహారం, మిలియన్ మార్చ్‌లు కూడా టాంక్‌బండ్, నెక్లెస్‌రోడ్‌లలో

జరిగాయి తప్పించి ఇక్కడ రోడ్లను ఎప్పుడూ మూసేయలేదు. ధర్నాచౌక్ ప్రారంభ సమయంలో ప్రత్యేకించి ఈ ప్రాంతంలో జనసమ్మర్దం చాలా తక్కువ ఉండేది. కాలక్రమేణా అన్ని ప్రాంతాల్లో పెరిగినట్టుగానే ఇక్కడ కూడా జనసమర్ధం బాగా పెరగడంతో వాహనాల కదలికలు బాగా పెరిగాయి. అయితే, ఎంత ట్రాఫిక్ పెరిగినప్పటికీ, ధర్నాలకోసం వేసే టెంట్ల వల్ల ఏ విధమైన ఆటంకమూ ఉండేది కాదు. ఎందుకంటే ధర్నాచౌక్ రోడ్డు మీద ఉండదు. రోడ్డుకు ఒక పక్కగా ఉంటుంది. ట్రాఫిక్ పోలీసులు చిన్నపాటి జాగ్రత్తలు, బాధ్యత తీసుకుంటే అసలు ఏ విధమైన సమస్యా కూడా ఎప్పుడూ ఉండదు.

అటువంటి ధర్నాచౌక్ మీద ట్రాఫిక్‌కి అంతరాయం కలుగుతోం దంటూ మార్చి 8, 2017 నుంచి ఎటువంటి ధర్నాలను అనుమతించ బోమని పోలీసు అధికారులు ప్రకటించారు. విద్యార్థుల ఆత్మబలిదానాల నుంచి, ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షల నుంచి, సంఘటితంగా సాగిన ఉద్యమం నుంచి తెలంగాణ రాష్ట్రం సాకారమయిన వేళ ప్రతి ఒక్కరూ ఆశించిన విషయం ప్రజాస్వామ్య విలువల పరిరక్షణ, భావ వ్యక్తీకరణ స్వేచ్ఛ. కానీ, రాష్ట్ర అవతరణ దినోత్సవమైన 2014 జూన్ 2 నుంచి ఒకటొకటిగా ముందుకు వస్తున్న అంశాలను గమనిస్తే ప్రత్యేక రాష్ట్రంలో మొట్టమొదటిసారిగా అధికారంలో కొచ్చిన తెలంగాణ రాష్ట్ర సమితికి గానీ, ఆ పార్టీ అధ్యక్షుడు, ముఖ్యమంత్రి కె. చంద్రశేఖరరావుకి, ఆయన మంత్రివర్గ సహచరులకి, ఆయన అనుచరులకి ప్రజాస్వామ్య విలువల మీద, భావ వ్యక్తీకరణ స్వేచ్ఛ మీద గౌరవం లేదన్న విషయమే కాదు, వాటిపట్ల ఒక తీవ్రమైన వ్యతిరేకత కూడా ఉన్నాయనేది ఒకదాని తర్వాత ఒకటిగా జరిగిన విషయాలతో తేటతెల్లమయిపోయింది. అవి, హాలు మీటింగులను కూడా జరుపుకోనివ్వకుండా పోలీసు నిర్బంధాన్ని ప్రయోగించడం దగ్గర మొదలు పెడితే, వికారుద్దీన్ ఇతర ఖైదీలను, విప్లవ విద్యార్థి సంఘ కార్యకర్తలు శృతి, సాగర్‌లను ఎన్‌కౌంటర్ పేరుతో చంపివేయడం, తామే పెంచి పోషించిన గ్యాంగ్‌స్టర్ నయీమ్‌ను కూడా ఎన్‌కౌంటర్ పేరుతో చంపేయడం, ప్రాజెక్టుల పేరుమీద, పరిశ్రమల పేరిట వేలాది ఎకరాల భూసేకరణ జరపడం, భూసేకరణ చట్టాలను గౌరవించ కుండా, నిబంధనలను పాటించకుండా తమదే ఇష్టారాజ్యంగా ప్రవర్తించడం, భూములు ఇచ్చేదిలేదని నిరశన తెలుపుతున్న ప్రజల మీద విచక్షణా రహితంగా లాఠీఛార్జి చేయడం, నిరుద్యోగ సమస్యను పరిష్కరించమని ఉద్యోగాల రూపకల్పన జరగాలంటూ ఆందోళన పథంలోకి వెళ్లిన వారిమీద తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించం, ఉద్యమకారుల ఇళ్ల మీద దాడులు చేయడం, తలుపులు బద్దలు కొట్టడం, కామన్ స్కూల్ విద్యావిధానం అమలు చేయాలంటూ ప్రజాస్వామ్య యుతంగా ముందుకు వెళ్తున్న మేధావుల మీద నిస్సిగ్గుగా దౌర్జన్యం చేయడం, ఇసుకదందా పేరుతో నేరెళ్ల దళితుల మీద జరిగిన అమానుష హింసాకాండ, రోహిత్ వేముల, మంథని మధుకర్ దగ్గరి నుంచి మొదలు పెడితే నిన్నటి ప్రణయ్ హత్య వరకూ కూడా దళిత యువకులను హతమారుస్తున్న అగ్రకుల భావజాలం, హింసోన్మాదానికి వత్తాసుగా ఉండడం, మద్దతు ధర అడిగినందుకు రైతుల చేతులకు బేడీలు వేసి జైల్లలో పెట్టడం, నాలుగున్నరేళ్లలో 4500 దాటిన రైతు ఆత్మహత్యలు, ప్రజలు తమ సమస్యలను చెప్పుకోవడానికి వీలులేకుండా ధర్నాచౌక్‌ని రద్దుచేయడం, యజ్ఞ యాగాదులు, దేవస్థానాలకు ముడుపుల పేరు మీద లక్షలాది రూపాయల ప్రజాధనాన్ని వెచ్చించడం, స్వతంత్రంగా ఉండాల్సిన మీడియాను తన చెప్పుచేతల్లో పెట్టుకుని శాసించడం... ఇలా చెప్పుకుంటూ వెళితే లెక్కలేనన్ని అంశాలు.

నిరంకుశత్వాన్ని, ప్రజావ్యతిరేక ధోరణిని తమ భాషగా మార్చుకున్నారు కాబట్టే, ప్రజలు తమ సమస్యలను చెప్పుకోడానికి వేదికగా భావించే ధర్నాచౌక్ మీదే ఆంక్షలు విధించడం జరిగింది. నిజానికి, ప్రజాస్వామ్య మంటేనే భావవ్యక్తీకరణ. ప్రజలు తమ హక్కుల సాధన కోసం వివిధ రూపాల్లో ప్రభుత్వం మీద ఒత్తిడి పెడతారు. ఏ ప్రజాస్వామిక అంశాల మీదనయితే ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం జరిగిందో, వాటిని సాకారం చేసుకోటానికి ప్రజలు గ్రామస్థాయి నుంచి రాష్ట్రస్థాయి వరకూ పోరాట రూపాలు తీసుకుంటారు. అందులో ప్రధానమైనది రాష్ట్ర రాజధానిలో ఇందిరాపార్క్ ధర్నాచౌక్. తమకు వ్యతిరేకంగా ప్రజా సమూహాలు సంఘటితమవడం భరించలేని తెలంగాణ ప్రభుత్వం ఈ ముఖ్యమైన వేదికను ఒక మౌఖిక ఆదేశంతో అడ్డుకునే ప్రయత్నం చేసింది. దీనిని సమర్థించుకోడానికి ప్రధానంగా చెప్పిన కారణం, ఇందిరాపార్క్ ధర్నాచౌక్‌లో జరిగే ధర్నాలు, వాటికి వచ్చే జనాలవల్ల ట్రాఫిక్‌కి తీవ్ర అంతరాయం జరుగుతోందని, స్థానికులు ఇబ్బంది పడుతున్నారని! నిజానికి అక్కడ పక్కనే ఉన్న ఎన్‌టిఆర్ స్టేడియంలో పిల్లలు ఆడుకోవ డానికి సౌకర్యాలు కల్పించకుండా, ఆర్థికవనరుల కోసం వివిధ వ్యాపారాత్మక అంశాలకు లీజుకు ఇచ్చేది ప్రభుత్వమే. కోటి దీపోత్సవాలు, శివరాత్రి సమారాధనలు ఇంకా అనేక అంశాలవల్ల అక్కడికి లక్షలాది మంది జనం వచ్చినాగానీ రాని ట్రాఫిక్ సమస్య కేవలం ప్రజలు తమ సమస్యల మీద పదులు, మహా అయితే అతికొద్ది సందర్భా లలో వందల సంఖ్యలో వచ్చి చేసే ధర్నాలే ప్రభుత్వానికి సమస్యగా కనిపిస్తాయి. ట్రాఫిక్ సమస్య, చుట్టుపక్కల వారికి ఇబ్బంది అనే విషయాలను ప్రచారం చేయడం ద్వారా ఇక్కడకు వచ్చే ప్రజల మీద, ఆయా సమస్యల మీద ఒక చులకన భావాన్ని పెంచిపోషించే కుట్రను ప్రభుత్వం, పోలీసు అధికారులు పకడ్బందీగా అల్లారు. ప్రజల మధ్యే వైరుధ్యాలను సృష్టించడం. మరి, ప్రజల సమస్యలను ప్రభుత్వం ఎక్కడ వింటుంది? సచివాలయానికి ముఖ్యమంత్రి రారు. ఆయన తన కోసం కట్టించుకున్న భవనంలోకి ప్రజలకు ప్రవేశం లేదు. మీడియాలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏ అంశాలను ప్రచురించకూడదని అనేక ఆంక్షలు.

నిజానికి, ధర్నాచౌక్ తెలంగాణ ఉద్యమంలో ఎంత కీలకపాత్ర పోషించిందో ప్రతిఒక్కరికీ తెలుసు. ముఖ్యంగా అధికార పార్టీ అయిన తెరాసకు. ఉద్యమం జరుగుతున్నప్పుడు ఎవరెన్నిసార్లు అక్కడకు వెళ్లారో, ఎన్ని సభల్లో ఎవరెవరు ఎలా ప్రసంగించారో ప్రజలకు తెలియని విషయమా? ముఖ్యమంత్రి ఆ ప్రదేశం మీద ఆంక్షలు విధించగానే ఆయన చుట్టూవుండే వందిమాగధులు కూడా అసలు అలాంటి ప్రదేశం ఉనికే లేనట్టుగా, తామెన్నడూ ఆ ప్రాంతాన్ని చూడనట్టుగా, అసలు తమకు పరిచమయే లేనట్టుగా వ్యవహరించమే అత్యంత దుర్మార్గమైన విషయం. ప్రత్యేక రాష్ట్రం కోసం అక్కడ నెలల తరబడి జరిగిన రిలే నిరాహారదీక్షలు, ఆత్మబలిదానం చేసుకున్న విద్యార్థుల శవయాత్రలు అప్పుడే మర్చిపోయారా? తెలంగాణ ఉద్యమం జరుగుతున్నంతకాలం ధర్నాచౌక్ నిత్యనూతనమైన ఉత్తేజాన్ని, ఉద్యమానికి ఊపిరిని అందించింది. ఆ వేదికను శాశ్వతంగా మూసేయాలని చూడడం తమ అధికార దర్పాన్ని చూపించుకునే అహంభావం తప్పించి మరోటి కాదు.

ఏ ధర్నాచౌక్ అయితే ఉద్యమాలకు ఊపిరి పోసిందో ఆ ధర్నాచౌక్‌ను రక్షించుకోవడం కోసం వెంటనే ఒక ప్రత్యక్ష కార్యాచరణ ప్రారంభమయింది. 2017, మార్చి 8న నిషేధాజ్ఞలు వస్తే, వెంటనే ఈ విషయం మీద రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాల ఆధ్వర్యంలో ఒక రౌండ్‌టేబుల్ సమావేశం మార్చి 15న హిమాయత్‌నగర్‌లోని మగ్దూంభవన్‌లో జరిగింది. ఆ మరుసటిరోజే అన్ని ప్రతిపక్ష పార్టీల ఆధ్వర్యంలో రాష్ట్ర గవర్నర్‌ను కలిసి ధర్నాచౌక్‌ను పునరుద్ధరించాలని

ఒక మెమొరాండం ఇచ్చారు. మార్చి 21న ఒక రాష్ట్రస్థాయి సమావేశం సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగింది. ఆ సదస్సులోనే వివిధ వామపక్ష రాజకీయ పార్టీలు, తెలంగాణ జాయింట్ యాక్షన్ కమిటీ ఇంకా అనేక ప్రజాసంఘాలు, సంస్థలు, సామాజికవేత్తలతో 'ధర్నాచౌక్ పరిరక్షణ కమిటీ'గా ఏర్పడి ధర్నాచౌక్ తెరిపించేవరకూ పోరాడాలని నిర్ణయం తీసుకున్నాయి. ఈ కమిటీకి సిపిఐ రాష్ట్ర కార్యదర్శి చాడ వెంకటరెడ్డి కన్వీనర్‌గా, ప్రొఫెసర్ పి.ఎల్.విశ్వేశ్వరరావు సహ కన్వీనర్‌గా, భాగస్వాములుగా సిపిఐ, సిపిఎం, సిపిఐ(ఎం.ఎల్) న్యూ డెమొక్రసీ, తెలంగాణ జెఏసి, తెలంగాణ ప్రజా ఫ్రంట్, ఎంసిపిఐ(యు), సిపిఐ(ఎం.ఎల్) న్యూ డెమొక్రసీ, ఆర్.ఎస్.పి, ఫార్వర్డ్ బ్లాక్, ఎస్.యు.సి.ఐ(సి), మానవహక్కుల వేదిక, ఎన్‌ఏపిఎం, అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య ఇంకా మహిళా, యువజన, కార్మిక, విద్యార్థి సంఘాలు, గృహకార్మికుల యూనియన్లు, ట్రాన్స్‌జండర్ సంఘాలు, మైనారిటీ సంఘాలు మొదలైనవాటితో పాటు విద్యావేత్తలు, సామాజికవేత్తలు, జర్నలిస్టులు, లాయర్లు ఉన్నారు. కోర్ కమిటీగా ఆదిరెడ్డి(సిపిఐ), డి.జి.నరసింహారావు(సిపిఎం), రవిచంద్ర(టిపిఎఫ్), గోవర్ధన్(న్యూ డెమొక్రసీ), సజయ(సామాజిక కార్యకర్త), హన్మేష్(న్యూ డెమొక్రసీ), మధుసత్యం(టి జాక్) ఉన్నారు.

ప్రజల గొంతు నొక్కేయాలని ప్రభుత్వాలు ప్రయత్నించవచ్చు, కానీ మళ్లీ మళ్లీ ఒక అలలా, ఫీనిక్స్ పక్షిలా ప్రజా ఉద్యమాలు తలెత్తుతూనేవుంటాయి. ధర్నాచౌక్ తెరిపించడానికి చేసే ఏ కార్యక్రమాన్ని కూడా ఉపేక్షించడానికి ప్రభుత్వం సిద్ధంగా లేదనేది అడుగడుగునా అర్థం అయింది. ధర్నాచౌక్ పరిరక్షణ వేదిక ఆధ్వర్యంలో ధర్నాచౌక్ ఆవశ్యకతని ప్రజలకి తెలియజేసే ఉద్దేశంతో మార్చి 26 వ తేదీ ఉదయాన్నే సుందరయ్య విజ్ఞాన కేంద్రం దగ్గర నుంచీ ఇందిరాపార్క్ వరకూ ఒక 2కె రన్ చేయాలని నిర్ణయించాం. తెల్లవారకుండానే, సుందరయ్య పార్క్ వద్దకు అనేక పోలీసు వాహనాలు, రెండు వందలకు పైగా పోలీసులు పెద్ద పెద్ద మోకుల్లాంటి తాళ్లు పట్టుకుని సిద్ధమయి పోయారు. రన్‌కి వచ్చిన అందరినీ ఏ హెచ్చరికా లేకుండానే లాగి ఎత్తిపడేసి వాహనాల్లో పడేయడం మొదలుపెట్టారు. అక్కడ తప్పించుకున్న వాళ్లని ఆర్‌టిసి క్రాస్‌రోడ్డు దగ్గర అరెస్ట్ చేసి వివిధ పోలీసు స్టేషన్లకు తీసుకుపోయారు. ఉదయం 7 గంటలు కాకముందే ధర్నాచౌక్ కోసం రన్‌లో పాల్గొనడానికి వచ్చిన అందరూ పోలీసు స్టేషన్లలో బందీలయ్యారు. తల్లితో పాటు వచ్చిన ఐదేళ్ల చిన్నారిని కూడా వదలలేదు. చిన్నపిల్లలను ఎలా అరెస్ట్ చేస్తారని నిలదీసినందుకు, అప్పటికే అక్కడికి మీడియా రిపోర్టర్లు వచ్చివుండటంతో, టీవీ ఛానెళ్లలో వస్తుందేమో అన్న భయంతో వారివరకు వెళ్లిపొమ్మని చెప్పారు. 2కె రన్ చేస్తే ఏంటి సమస్య అని ప్రశ్నిస్తే, వెళ్లి ముఖ్యమంత్రినే అడగండి, మాకు ఆదేశాలు అందాయి అని చెప్పడం తప్పించి, వారి వద్ద సహేతుకమైన వాదన కూడా లేదు.

ఏ ధర్నాలయితే ప్రభుత్వానికి కంటగింపుగా మారాయో, సహించలేని విషయంగా తయారయ్యాయో అవే ధర్నాలను నెల రోజులపాటు చేయాలని నిర్ణయం తీసుకున్నాం, చేసి చూపించాం. అయితే, కేవలం స్థలం మార్పు. నెల రోజుల నిరంతర ధర్నాలకు తెలంగాణ సాయుధ పోరాటకాలం నాటి కవి మగ్దూం మొహియుద్దీన్ పేరుతో ఉన్న స్థలం వేదికయింది. రాజకీయ పార్టీల ప్రతినిధులతో ఏప్రిల్ 15న ప్రారంభమయిన ధర్నాలు మే 14 వరకూ అత్యంత ఉత్సాహభరిత వాతావరణంలో ఉద్యమ స్ఫూర్తితో వివిధ రంగాలలో నిష్ణాతులైన మేధావుల సంఘీభావంతో జరిగాయి. ఈ నెల రోజుల దీక్షలలో సుమారు 5000 మంది పాల్గొన్నారు. ప్రతిరోజు ఆయారంగాలకు చెందిన సమస్యలను కూలంకషంగా చర్చిస్తూ, ప్రభుత్వ నిరంకుశ పోకడలను ఎండగడుతూ అనేకమంది తమ ఉపన్యాసాల ద్వారా, పాటల ద్వారా ఒక ఉత్తేజాన్ని నింపారు. భావవ్యక్తీకరణ స్వేచ్ఛ తమ హక్కు అని ఎలుగెత్తి చాటారు. రైతు సంఘాలు, కార్మికసంఘాలు, వృత్తి సంఘాలు, యువజన సంఘాలు, గృహకార్మికుల యూనియన్లు, విద్యార్థి సంఘాలు, గిరిజన ఆదివాసీ సంఘాలు, సాంస్కృతిక సంఘాలు, ఉపాధ్యాయ సంఘాలు, మహిళా సంఘాలు, అసంఘటితరంగ కార్మిక సంఘాలు, జర్నలిస్టు సంఘాలు, దళిత సంఘాలు, గిట్టుబాటు ధరకోసం రైతులు, విచ్చలవిడి ప్రభుత్వ భూసేకరణకు బలైన భూనిర్వాసితులు, పెద్దల రక్షణ కరువైన యుక్తవయసు బాలబాలికలు, సామాజిక వివక్షకు గురౌతున్న ట్రాన్స్‌జండర్ సమూహాలు, వికలాంగులు, మైనారిటీలు, న్యాయ వాదులు, నిరుద్యోగులు, ఉద్యోగ సంఘాలు, బీడీ కార్మికులు, ట్రాన్స్ పోర్టు కార్మికులు, ఉద్యోగులు, కవులు, కళాకారులు, రచయితలు, వ్యవసాయ కార్మికులు, పోడు రైతులు, రైతు ఆత్మహత్య బాధిత కుటుంబాలు, హక్కుల సంఘాలు, తెలంగాణ సాయుధపోరాట, స్వాతంత్ర్య సమరయోధులు... ఇలా రోజుకొక సమూహం చొప్పున ముప్పయిరోజుల పాటు జరిగిన నిరసనదీక్షలు ప్రభుత్వాన్ని గజగజ వణికించాయి. అందుకే ఆ నెలరోజులపాటు అనేక పోలీసు వ్యానులు, చెక్‌పోస్టు అక్కడే నిలిచివున్నాయి. ఇంక ఇంటలిజెన్స్ వాళ్లయితే నిత్యం అక్కడే మకాం వేశారు. ప్రముఖ విద్యావేత్త చుక్కా రామయ్య, తెలంగాణ సాయుధ పోరాట యోధురాలు మల్లు స్వరాజ్యం, సిపిఎం నాయకులు తమ్మినేని వీరభద్రం, ప్రొఫెసర్ అరిబండి ప్రసాదరావు, ప్రొఫెసర్ హరగోపాల్, ప్రొఫెసర్ కోదండరాం, మాజీ ఎమ్మెల్సీ ప్రొఫెసర్ నాగేశ్వర్, ప్రొఫెసర్ రమామెల్కోటే, ప్రొఫెసర్ పద్మజా షా, ప్రొఫెసర్ సుజాతా సూరేపల్లి, ప్రొఫెసర్ భంగ్యా భూక్యా, ప్రొఫెసర్ లక్ష్మీనారాయణ, ప్రముఖ విప్లవకవి వరవరరావు, సామాజిక ఉద్యమకారుడు ఉ.సాంబశివరావు, జస్టిస్ చంద్రకుమార్, మానవహక్కుల నాయకులు ఎస్. జీవన్‌కుమార్, ప్రముఖ రచయిత జయధీర్ తిరుమలరావు, పత్రికా సంపాదకులు కె. రామచంద్రమూర్తి, కె. శ్రీనివాసరెడ్డి, కె.శ్రీనివాస్, ఎన్. వేణుగోపాల్, ఎంఎల్‌ఏ సున్నం రాజయ్య, ప్రజా కళాకారుడు గద్దర్, ప్రొఫెసర్ చక్రధర్‌రావు, దళిత సేన అధ్యక్షులు జె.బి.రాజు, మాజీ ఎంఎల్‌ఏ గుండా మల్లేష్, సిపిఐ జాతీయ నాయకులు సురవరం సుధాకర్‌రెడ్డి, నారాయణ, జనవిజ్ఞాన వేదిక నాయకులు రమేష్, ఎన్‌ఏపియం సభ్యులు మీరా సంఘమిత్ర, ట్రాన్స్‌జండర్ నాయకురాలు రచనా ముద్రబోయిన, మాజీ ఎంపి అజీజ్ పాషా, న్యాయవాది ప్రభాకర్‌రెడ్డి, మాజీ ఎంఎల్‌ఏ సిపిఎం నాయకులు జూలకంటి రంగారెడ్డి, టిపిఎఫ్ నాయకులు నలమాస కృష్ణ, నివాస హక్కుల నాయకులు బ్రదర్ వర్గీస్, అష్వాక్, విప్లవ సంఘాల నాయకులు రమ, ఎస్.వెంకటేశ్వర్లు, మహిళా సంఘాల నాయకులు సంధ్య, ఝాన్సీ, దేవి, కొండవీటి సత్యవతి, సుమిత్ర, హైమవతి, సృజన, ఆశాలత, రుక్మిణిరావు, తేజస్విని, వసుధ, అనురాధ, అంబిక, ఇందిర, రేణుక, లిసీజోసఫ్ తదితరులు ఇక్కడకు వచ్చి సంఘీభావం తెలిపిన మేధావుల్లో ఉన్నారు.

నెల రోజుల దీక్షల అనంతరం మే 15న ఎట్టిపరిస్థితుల్లోనూ ధర్నాచౌక్‌లో ప్రజా విజయ కేతనాన్ని ఎగరవేస్తామని, ఏ రకమైన సమస్య ఎదురైనా అది ప్రభుత్వ బాధ్యతే అని విస్పష్టంగా ప్రకటించాం. సేవ్ ధర్నాచౌక్ పేరుతో అనేక కరపత్రాలు, పోస్టర్లు, స్టిక్కర్లు విడుదల చేశాం. దీనితో దీక్షలో పాల్గొన్న అందరి ఇళ్లమీద నిఘా పెట్టారు. రాత్రికి రాత్రే ముందస్తు అరెస్టులు కూడా చేయాలని అనుకున్నారు. ఈ ఉద్యమాన్ని కేవలం శాంతి భద్రతల సమస్యగా మార్చాలనుకున్న ప్రభుత్వం, అధికార

పార్టీ ఒక భయంకరమైన కుట్రకు తెరతీసింది. స్థానికుల పేరు మీద ఎదురు ధర్నాలకు తెరతీశారు. రాత్రికి రాత్రే అత్యంత ఆర్భాటంగా పెళ్లిళ్లకు వేసేలాంటి టెంట్లను ధర్నాచౌక్‌లో వేసేశారు. ఫ్లెక్సీలు కట్టేశారు. ఉదయాన్నే మహిళా పోలీసు యంత్రాంగం యూనిఫారంలో కాకుండా మామూలు దుస్తుల్లో స్థానికుల్లాగా కూర్చుని 'మాకు ధర్నాచౌక్ వల్ల సమస్యలున్నాయి, ఈ ప్రదేశాన్ని ధర్నాలకు అనుమతించొద్దు' అనే ప్లకార్డులు పట్టుకుని కూర్చున్నారు. ధర్నాచౌక్ పరిరక్షణ కోసం వెళ్లిన కార్యకర్తలతో గొడవలు పెట్టుకున్నారు. జర్నలిస్టులు వారిని గుర్తించడంతో అక్కడినుంచి పారిపోయారు. అధికార పార్టీ తన అనుచరగణాల్ని రెచ్చగొట్టి , ఇతర ప్రాంతాల నుంచి అడ్డా కూలీలను జమచేసి 'ఒకచోట సభవుంది మేము చెప్పినట్టు చేయాలి, డబ్బులు ఇస్తాం, బిర్యాని ఇస్తాం' అని నమ్మించి అక్కడకు చేర్చడం మొదలుపెట్టారు. అయితే వారు ఇక్కడకు వచ్చిన తర్వాత ప్రజాసంఘాల నాయకులను చూసి 'మాకు దీనికోసం అని చెప్పకుండా తీసుకువచ్చారు, మీకు వ్యతిరేకంగా అని చెప్తే మేం వచ్చేవాళ్లం కాదు' అని చెప్పి కొంతమంది వెనక్కి వెళ్లిపోయారు కూడా. ప్రజల మధ్య తీవ్రమైన ఘర్షణను సృష్టించి, 'ఇదుగో ఇందుకే మేము ఈ ప్రాంతంలో వద్దంటున్నాము' అని తమ వాదనకు బలం చేకూర్చుకోవాలనుకున్నారు. ఇంకోపక్క లాఠీలతో, తుపాకులతో పహారా కాస్తున్న వందలాదిమంది పోలీసు బలగాలు. వేలాదిగా ఊరేగింపుగా వస్తున్న కార్యకర్తలను ధర్నాచౌక్‌లోకి రానీయకుండా ఇనుప బారికేడ్లను పెట్టారు. లోపలికి వెళ్లనీయకుండా అడ్డుకున్నారు. వాటిని కూలగొట్టి లోపలికి వెళ్లినవారి మీద లాఠీఛార్జి చేశారు. చాలామందికి బలమైన గాయాలు తగిలాయి. అయినా ఎక్కడా ప్రజాసంఘాల కార్యకర్తలు భయపడలేదు. లోపలికి దూసుకెళ్లిపోయారు. విజయవంతంగా అక్కడ సభ నిర్వహించడం జరిగింది. స్థానికులే వ్యతిరేకిస్తున్నారు అని చెపుతూ ఇంతకాలం అడ్డుకుంటున్న పోలీసుల వాదనలకు వ్యతిరేకంగా అక్కడి స్థానికులే వచ్చిన ప్రజా ఉద్యమకారులకు దగ్గరుండి మరీ మంచినీళ్లు అందించారు. మళ్లీ ఈ ప్రాంతం జనంతో నిండిపోతుందని, తమ వ్యాపారాలు ఇకనుంచీ మళ్లీ బాగుంటాయనే సంతోషాన్ని చిన్న వ్యాపారస్థులు వ్యక్తం చేశారు. తమ అహంభావపూరిత స్వభావాన్ని సమర్థించుకోవడం కోసం అధికార పార్టీ, పోలీసు యంత్రాంగం నిస్సిగ్గుగా వ్యవహరించిన తీరు ఆ రోజు బట్టబయలయింది. ఇంత జరిగినా కానీ, ప్రభుత్వం తన మొండిపట్టు వదలలేదు.

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ నిరంకుశ విధానాలను వివరిస్తూ దేశరాజధాని ఢిల్లీలో జంతర్‌మంతర్‌లో ఆగస్టు 21న ఒక మహాధర్నా నిర్వహించి కేంద్రమంత్రి రాజ్‌నాథ్‌సింగ్‌కి వినతిపత్రం ఇచ్చాం. అవకాశం ఉన్నప్రతిచోటా ధర్నాచౌక్ రద్దు గురించి, తెరాస ప్రజా వ్యతిరేక విధానాల గురించి మాట్లాడుతూనే వస్తున్నాం. అదే సమయంలో కాంగ్రెస్ నాయకుడు వి. హనుమంతరావు ఈ విషయమై హైకోర్టులో ఒక ప్రజాప్రయోజన వ్యాజ్యం వేశారు. ధర్నాచౌక్ పరిరక్షణ కమిటీ కన్వీనర్ చాడ వెంకటరెడ్డి కూడా ఇదే విషయమై కోర్టుని ఆశ్రయించారు. ఈ రెండింటిని కలిపి ఒక కేసుగానే ఉంచారు కానీ, సంవత్సరంన్నర గడుస్తున్నా ఈ విషయంలో హైకోర్టు విచారణ ప్రారంభించలేదు. ఈ లోపున ముఖ్యమంత్రిని కలవాలని కమిటీ తరఫున ఆయన కార్యాలయానికి ఉత్తరం రాస్తే, ఉద్యమంలో ముందు నిలిచిన వారిని అరెస్ట్ చేయడానికి వచ్చిన ఘనమైన చరిత్ర ఈ ప్రభుత్వానిది. చివరికి అహంభావం అక్కడిదాకా పయనించింది. ధర్నాచౌక్ విషయంలో ఎందుకింత పట్టుదల అని రాష్ట్ర ముఖ్య కార్యదర్శిని కలిసి అడిగితే, 'అసలు ఈ విషయానికి సంబంధించి నాకేమీ తెలియదు, కనుక్కుంటాను' అని అనడం అంటేనే ఈ రాష్ట్రంలో పరిపాలన ఎంత అధ్వాన్నంగా ఉందో అర్థమవుతుంది. పరిపాలనా యంత్రాంగంలోని అత్యున్నత వ్యక్తికి తెలియకుండానే నిర్ణయాలు జరిగిపోతుంటాయి. ధర్నాచౌక్ ప్రాధాన్యతను, చరిత్రను వివరిస్తూ దినపత్రికల్లో వచ్చిన 12 వ్యాసాలతో పాటు మగ్దూంభవన్ వేదికగా జరిగిన నెలరోజుల దీక్షల రిపోర్టులతో 'ప్రజాగొంతుక ధర్నాచౌక్' పేరుతో ఒక పుస్తకాన్ని కూడా తీసుకువచ్చి ప్రజల్లోకి విస్తృతంగా తీసుకెళ్లాం. చిట్టచివరికి, ధర్నాచౌక్ పరిరక్షణ కమిటీ కో కన్వీనర్ ప్రొఫెసర్ పి.యల్. విశ్వేశ్వరరావు ఈ విషయమై ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని, కోర్టులో జరుగుతున్న జాప్యాన్ని ఎత్తిచూపుతూ హైకోర్టు ప్రధాన న్యాయాధికారికి నేరుగా ఒక ఉత్తరం రాయడంతో విషయం మళ్లీ ప్రాధాన్యత సంతరించుకుంది. ఈ ఉత్తరాన్నే సుమోటోగా పరిగణించి దానిమీద వాదనలు తామే వినిపిస్తామన్నారు ముఖ్యన్యాయాధికారి. ఈ కేసు విచారణ సందర్భంగా ప్రభుత్వానికి ఆయన వేసిన ప్రశ్నలు చాలా ముఖ్యమైనవి. 'ప్రజాస్వామ్యంలో ప్రజలకు అనేక అభిప్రాయాలు చెప్పే హక్కువుంది. అవి ప్రభుత్వాలకు వ్యతిరేకంగా వుండొచ్చు. ప్రభుత్వాన్ని, పాలనను విమర్శించే హక్కు ప్రజలకు ఉండి తీరాలి. ప్రభుత్వంలో ఉన్నప్పుడు ప్రజల హక్కుల్ని శాసించేవాళ్లే తాము ప్రభుత్వంలో లేకపోతే అవే హక్కుల కోసం గొంతెత్తుతారు. ప్రజల హక్కులనేవి ప్రభుత్వాలను బట్టి ఉండవు. ధర్నాల వల్ల అక్కడ తాత్కాలికంగా ప్రజాజీవనానికి ఆటంకాలు, అంతరాయాలు కలిగితే, వాటిని సరిదిద్దాల్సిన బాధ్యత ప్రభుత్వానిదే. అంతమాత్రం చేత అసలు ధర్నాలు చేసే హక్కునే హరించివేయడం ప్రజాస్వామ్యంలో తగనిది. ప్రజలకి అనుకూలమైనచోట, ప్రభుత్వ అత్యున్నత వ్యవస్థ అందుబాటులో ఉన్నచోట ధర్నాలు జరగాలి గానీ, ఎక్కడో ఊరవతల జరగటం వల్ల ప్రయోజనం ఏమిటి? సమస్యలు చెప్పుకునే అవకాశం లేకపోవడం అంటేనే అది నిరంకుశత్వం. పిల్లలకు తమ బాధను చెప్పుకుని ఏడ్చే హక్కు లేకపోతే వారి శారీరిక, మానసిక ఆరోగ్యం దెబ్బతినడమే కాకుండా వారి అభివృద్ధే ప్రమాదంలో పడుతుంది. ఇది కూడా అలాంటిదే. పిల్లలకు కనీసం ఏడ్చే అవకాశాన్ని తల్లిదండ్రులు ఇవ్వడం లేదంటే వారి పెంపకం ఎంత నియంతృత్వంతో ఉంటుందో ఇదీ అలాంటిదేనని, మనుషులు ఉండేచోటే సెల్ టవర్స్ పెడతారు గానీ, అడవిలో పెట్టరని, జంతువులకు సెల్‌ఫోన్స్ అవసరం లేదని, అలాగే ప్రభుత్వ అత్యున్నత యంత్రాంగానికి దగ్గరలోనే ప్రజలకు తమ నిరసన తెలియజేసే హక్కు ఉంటుందని, ఊరవతలకి వెళ్లి జనసమర్దం లేనిచోట ధర్నా చేయమని చెప్పడం వారి హక్కులను గుర్తించ నిరాకరించడమే అవుతుందని ప్రకటించి, రెండువారాల్లో సరైన సమాధానాలతో రాకపోతే ఇదే ధర్నాచౌక్ ప్రాంతాన్ని తెరిచే ఆదేశంగా చూడాలని చెప్పడం జరిగింది. నెలరోజులకంటే ఎక్కువే సమయం తీసుకున్న ప్రభుత్వం అప్పటికీ తమ నిర్ణయాన్ని బలపరిచే సహేతుకమైన వాదనని వినిపించలేకపోయింది. ఇప్పటికీ వారి వాదన స్థానికుల పేరుతోనూ, ట్రాఫిక్ చుట్టూనే తిరుగుతోంది. అయితే దానిని న్యాయాధికారులు అంగీకరించలేదు. దానిఫలితమే ధర్నాచౌక్‌కు ఆరువారాల పాటు ఎటువంటి ఆటంకాలు కలిగించకూడదని, ప్రజలు దానిని ఉపయోగించుకోవచ్చనే ఆదేశాన్ని హైకోర్టు ఇచ్చింది. దీని కాలపరిమితి కేవలం ఆరువారాలే అయివుండొచ్చు. కానీ, ఇది నిస్సందేహంగా ప్రజా విజయం. విభిన్న సమూహాల ప్రజలు సంఘటితంగా పోరాడడం వల్ల ప్రభుత్వానికి స్పష్టమైన హెచ్చరికను చేయగలిగాం.

ఈ సంఘటిత స్ఫూర్తి మరిన్ని అంశాలకు విస్తరించాలి. ప్రజావ్యతిరేక విధానాల మీద ప్రజా గళాన్ని నిరంతరం చైతన్య పూరితంగా ఉంచుతూనే ఉండాలి. ప్రజా ఉద్యమాలు వర్ధిల్లాలి.

*(రచయిత సామాజిక కార్యకర్త, ధర్నాచౌక్ పరిరక్షణ కమిటీ సభ్యురాలు)* వీ

# భూస్వాముల కోసమే 'రైతుబంధు'

***తెరాస ప్రభుత్వం ప్రవేశపెట్టిన రైతు బంధు పథకం వల్ల భూస్వాములే అధికంగా లబ్ధిపొందుతున్నారనీ, చిన్న, సన్నకారు, కౌలు రైతులకు ఈ పథకం వల్ల ఎటువంటి ప్రయోజనం లేదనీ అంటున్నారు* భాస్కర్ ఏంపెల్లి**

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా ప్రవేశపెట్టిన 'రైతుబంధు పథకం' వ్యవసాయం చేస్తున్న రైతులకు పెట్టుబడికి సాయంగా ఇవ్వడానికి ఉద్దేశించిన పథకం. కానీ అమలులో ఇది వ్యవసాయం చేసే కౌలురైతులకు దక్కకుండా, భూములు కౌలుకు ఇచ్చి పట్టణాల్లో ఉద్యోగాలు, వ్యాపారాలు చేసుకునే భూస్వాములకు (absentee landlords) లబ్ధి చేకూరుస్తుంది. ఎకరం, రెండెకరాలు ఉండి పట్టాలు కూడా లేని చిన్న, సన్నకారు రైతులకు ఈ పథకం వలన చేకూరే లబ్ధి అంతంత మాత్రమే. భూస్వాములకు కౌలు వస్తుంది, చేయని వ్యవసాయానికి 'సాయం' వస్తుంది. కాని, కౌలు రూపంలో అదనపు ఉత్పత్తి వ్యయం మీదేసుకుని వ్యవసాయం చేస్తున్న కౌలు రైతులకు మాత్రం ఎటువంటి సాయం అందట్లేదు. పైగా వాళ్లను ఇంకా సంక్షోభంలోకి నెట్టేసే విధంగా ప్రభుత్వ విధానాలు ఉన్నాయి అనేది ఇటీవల ఒక ఏజెన్సీ గ్రామంలో రైతులు వెలిబుచ్చిన అభిప్రాయం.

ఇటీవల ప్రభుత్వం మొదలుపెట్టిన పెట్టుబడి సాయం పథకం వలన వస్తున్న ఇబ్బందులు చాలా ఉన్నాయి. ఆదివాసుల భూములు ఆదివాసీయేతరులకు అమ్ముకున్నారు. కానీ గ్రామం షెడ్యూల్ గ్రామం అయినందున ఒసి, బిసిలకు ప్రభుత్వం పట్టాలు ఇవ్వదు. ఇప్పుడు ప్రభుత్వం పట్టాలున్న వాళ్లకే డబ్బులు ఇవ్వడం వలన ఆదివాసులు అమ్ముకున్న భూములకు 'పెట్టుబడి సాయం' వచ్చింది. భూమి కొనుక్కున్నవారికి రాలేదు. ఇప్పుడు ఆ డబ్బులు ఎవరికి చెందాలి అనేది సమస్యగా ఉన్నది. కొన్ని ఆదివాసి భూములకు కూడా పట్టాలు లేవు. ఇప్పుడు ఆ భూములు పట్టాలు చేయడానికి రెవెన్యూ ఆఫీసులో 7 వేల-10వేలు వరకు డబ్బులు అడుగుతున్నారు. రెవెన్యూ ఆఫీసర్లు అడిగిన లంచం ఇవ్వలేక చాలమంది ఊరుకున్నారు. ముప్పై ఏండ్లకిందట పట్టాలు తండ్రుల పేరుమీద ఉన్నాయి. ఇప్పుడు వేరు కుటుంబాలు పెట్టుకున్న పిల్లల పేరు మీద చేయించుకోవాల్సిన పరిస్థితి. కానీ డబ్బులు (లంచం) మాత్రం కట్టాల్సిందే. కొన్నిసార్లు పట్టాదారుడు చనిపోయి, కొడుకులు వారి పేరు మీద పట్టా చేయించుకోని కారణంగా 'పెట్టుబడి సాయం' ఇవ్వలేదు. ఆ సాయం ఎవరికి దక్కకుండా పోయింది. "మొత్తానికి ప్రభుత్వ పథకం లబ్ధి పొందాలంటే పట్టా తప్పనిసరి. పట్టాలు లేని భూములు, మార్చుకోని భూములే అధికం. ఇప్పుడు రెవెన్యూ ఆఫీసర్లకు పండగే అంటాడు కోయ తెగకు చెందిన సమ్మయ్య.

"కెసిఆర్ గారు ఎకరాకు నాలుగువేలు ఇస్తున్నడు. మేము ఎప్పుడో 71లో వచ్చినం. దాదాపు 50 సంవత్సరాలు దగ్గరికస్తుంది. మాకు రిజిస్ట్రేషన్ లేవు. పట్టాలు లేవు. మాకు గుర్తింపే లేదు. అసలు ఉంటే ఉండు, దొబ్బేస్తే, దొబ్బేయ్ అన్న స్థితిల ఉన్నం. కెసిఆర్ 20 ఎకరాలు ఉన్నోడికి 80వేలు ఇస్తాండు. ఎకరపోనికి ఎవ్వనికి లేదు" అని ఆవేదన చెందుతాడు సాంబయ్య. ఈయన ఐదు సంవత్సరాల క్రితం3 ఎకరాల పొలం కొన్నడు. ఎంఆర్ఒ ఆఫీసుకు పోతే 'ఇది ఏజెన్సీ ఏరియా, నీ పేరు మీద ఎక్కదు' అన్నారు. కొంతమంది ఆదివాసీయేతరులకు కూడా ఈ ఊల్లో రైతుబంధు చెక్కులు వచ్చినయి దాని గురించి చెబుతూ "పాల్ సాబ్ భూములు 100-200 ఎకరాల బాపతోల్లు ఉండిరి. వాల్లొకప్పుడు దొరలు. వాల్లు అమ్ముకున్నప్పుడు దొరల భూములు కనుక పట్టాలయినయి. వాల్లకప్పుడు పట్టాలున్నయి. అవి కొన్నోల్లకయినయి. కానీ పేదోదున్నడు, ఎకరం-రెండెకరాలున్నోడు. పెండ్లికో, పేరంటానికో రోగానికో, నొప్పికో అమ్ముకుంటడు. ఎస్‌టి వాళ్లు ఉన్నరు అమ్ముకుంటరు. అది మేము కొన్నమనుకో మాకు భూమి ఉన్నట్టు కూడా గుర్తింపు లేదు" అని ఆదివాసీయేతరులకు ఏజెన్సీ ఏరియాలో ఇబ్బందులున్నయంటాడు. ఏజెన్సీ ఏరియాలో ఆదివాసులు భూములు కొనడం నేరం అని అనుకోడీయన. కొన్నవాటికి పట్టాలు రావట్లేదు అని బాధపడుతడు.

ఇక్కడ ఆదివాసులకు కూడా లబ్ధి చేకూరలేదు. కేవలం డబ్బులు ఉండి, లంచాలు ఇచ్చి పట్టాలు చేయించుకోగలిగిన అగ్రకుల భూస్వాములకే చెక్కులొచ్చినయి అనేది వీళ్ల అభిప్రాయం. సాంబయ్య దృష్టిలో "ఈ నాలుగువేల చెక్కయితే ఉన్నోనికే వచ్చింది. పట్టాలోనికే పట్టాలయినయి. 1బి ఎవ్వనికి లేదిక్కడ. 350 కుటుంబాల్లో 95 ఎకరాలకు చెక్కొచ్చింది. 700 ఎకరాలుంది, 100 ఎకరాలకు చెక్కువచ్చింది".

ఆదివాసులకు కూడా ఈ పథకం వలన లబ్ధి చేకూరలేదు. ఆదివాసులు చాలమంది వారి భూములను అమ్ముకున్నరు. ఏజెన్సీ గ్రామం అయినప్పటికీ అగ్రకులాలు, కొంతమంది బిసి కులాల వాల్లు చట్టవిరుద్ధంగా వాటిని కొన్నరు. అమ్మిన ఆదివాసులు, మేము అమ్మినం కదా అని వారి పేరు మీద రాయించుకోలే. కొన్న ఆదివాసీయేతరులు మనకు వాటి మీద హక్కులేదు కదా అని రాయించుకోలేదు. దాంతో అలా ఆదివాసులు అమ్మిన భూములకు చెక్కులు రాలేదు. ఈ విషయం సాంబయ్య వివరిస్తడు. "ట్రైబలోల్లు అమ్మేసినం కదా అని సర్వేలో రాయించుకోలేదు. నీ దగ్గర పదెకరాలున్నయి. నువ్వు అమ్మేసినవు నువు రాయించుకోలేదు. ఎవరు రాయించుకోలేదు కాబట్టి అవి రాలేదు. తెలివిగ పట్టాలున్నోడు ఏం చేసిండు 1బి ఉన్నోడు. 2 ఎకరాలకు నాలుగు ఎకరాలు రాయించుకున్నడు. పాల్‌సాబ్ భూములోల్లకు గవర్నమెంటు

కొత్త పట్టాలిచ్చింది. పదెకరాల వ్యవసాయం చేసుకున్నోడు 40 వేలు వచ్చినయి. పేదోడికి, రెండెకరాలు మూడెకరాలున్నోనికి ఏంలేదు. వానికి 1బి లేదు, నాలుగు వేలిచ్చిన పరిస్థితి లేదు".

ఇక కౌలు రైతుల పరిస్థితి ఇంకా దారుణం. వాస్తవానికి కష్టనష్టాలకు ఓర్చి భూములు సాగుచేస్తున్నది వారు. అసలు రైతులు వాళ్లు, కాని వారికి ఈ పథకం వలన ఎలాంటి లబ్దీ చేకూరట్లేదు. "కౌలుబట్టి బతికేటోల్లు మస్తుమందున్నరు. కౌలుబట్టి ఆర్థికంగా ఇబ్బంది పడుకుంట, వ్యవసాయం చేసుకుంట బొచ్చెడుమంది ఉన్నరు. 20 ఎకరాలున్నోడు కౌలుకిచ్చె, వానికి కౌలు రాబట్టె, ఈ డబ్బులు రాబట్టె. ప్రభుత్వం 80 వేలు ఇచ్చె, కౌలు 200 బస్తాలు వస్తయి. కౌలు చేసినోనికి రూపాయి రాదు. కష్టపడేది కౌలురైతా, పట్టాదారా? లాభం పట్టదారుకు, నష్టం కౌలురైతుకు" సాంబయ్య కౌలు రైతుల పరిస్థితి వివరిస్తడు. అందుకే "నాలుగు వేలు ఎవనికిస్తాండు. గౌస్‌మియాకు 30-40 ఎకరాలుండె వాళ్లు అమ్మేసి వెల్లిపోయింద్రు. వాని పేరు మీద 30 ఎకరాలు చెక్కులొచ్చినయి. గౌస్‌మియా కొడుకు హైద్రాబాద్ నుంచి వచ్చిండు. చెక్కు తీసుకుని వెళ్లిపోయిండు. ఊళ్లె కొన్నోళ్లకేమో, నిజంగా వ్యవసాయం చేసోటోనికి పేరు మీద ఎక్కదాయే" అంటాడు.

"కెసిఆర్ ఏం ఇస్తాండయ!? మళ్ల ఉన్నోడికే చెందుతాందది. లేనోనికి చెందుతలేవవి. డబ్బులు చానా ఉండి 10-20 ఎకరాలు పట్టా చేసుకున్నరు ఉన్నోళ్లు. మా అట్లాటోడు ఎల్లుబాటు లేదు. కొనుక్కోలే. అన్నో ఇన్నో కొట్టుకుని 'పోడు' చేసుకున్నం. అది ప్రభుత్వం భూమి పట్ట కాకపాయే. ఇగ ఉన్నోడికి, పట్ట చేసుకున్నోడికే వత్తానయి. పేదోనికి వస్తానయా!?" అని ప్రశ్నిస్తడు శ్యాంసుందర్ రెడ్డి. ఇప్పుడు పట్టాల కోసం ప్రభుత్వ ఆఫీసులకు పోతే ప్రభుత్వం డబ్బులు వస్తయి కాబట్టి పట్టాలు చేయడానికి డబ్బులు ఎకరానికి 10 వేలు దాకా అడుగుతున్నరు. మొత్తం ఊళ్ల 60-70 మందికే డబ్బులు వచ్చినయి. మిగతా వాళ్లకు రాలేదు. "అన్ని డబ్బులు పెట్టి డబ్బులు ఉన్నోడే పట్టా చేయించుకుంటరు. కానీ పేదోడు, కూలోడు ఎట్ల చేయించుకుంటడు." ప్రభుత్వం "రైతు పని చేసిన ప్రతి ఒక్కరికి ఇయ్యాలే, వ్యవసాయం చేసిన ప్రతి ఒక్కనికి అని పెడితే అందరికి వర్తిస్తది". పట్టాలు ఉన్నోళ్లకే అనేసరికి అందరికి సున్న అయింది. పట్టతోని లింకు లేదు. రైతుకియ్యాలే అని పెట్టాలే".

కెసిఆర్ ప్రభుత్వ గురించి చెబుతూ " వాడు వెలగపెట్టేది ఏం లేదు. ఎవ్వడచ్చిన గదే కష్టం. కెసిఆర్ ఏం వెలగబెడతాండు. మళ్ల రైతుతిప్పల రైతుకే ఉన్నది. రు. 4000 ఇస్తండు కాని మళ్ల ఉన్నోనికే చెందుతానయి. లేనోని బతుకు గాన్నే ఉంటది. రైతు అన్నోనికి ప్రతి ఒక్కనికి ఇయ్యాలంటే బాగుండు. కాకపోతే ఎంక్వయిరి చెయ్యి, ఈ రైతు వ్యవసాయం చేస్తాండ లేకపోతే నౌకరి చేస్తాండ అని, ఎంక్వయిరి చేసుకుని ఇయ్యనుండే. మధ్య దళారులు తలుక్కొని తింటలేరా!? పట్టాలున్నోడు కూడా వ్యవసాయం చేస్తలేడు. అసలు చేసేటోనికి లేదు మరి, వాడెక్కన్నో ఉండి నా బోటిగాడికి కౌలుకిచ్చె, నౌకరి చేసుకుని హాయిగా బతుకుతుండె. మళ్ల వాన్ని పిలిచే నువ్వు డబ్బులిస్తంటివి. పట్టాలనేసరికి ఉన్నోడే బతుకుతాండు. మీసేవల 1బి ఎల్లితెనె అది పట్టా, లేదంటె లేదు" అంటాడు శ్యాంసుందర్ రెడ్డి.

పట్టాలు ఉన్నవారికే ప్రభుత్వం పెట్టుబడి సాయం ఇస్తుంది కాబట్టి ఇప్పుడు అందరు రెవెన్యూ ఆఫీసుల చుట్టు తిరుగుతున్నరు పట్టాలకోసం. "తిరిగి తిరిగి కాల్లరుగుతానయి. మూడువేలు పెట్టిన కూడ మూన్నెల్లకు ఇంతవరకు కార్డు రాలేదు. ఊల్ల మొత్తం జనమంత ఇట్లనె". మధ్యలో పుష్కక్క భర్త కలగజేసుకుని, "దగ్గర దగ్గర యాబై ఏండ్లాయె కొని మొత్తం ఎల్టిఆర్ కింద పెట్టిండు. మొత్తం 22 ఎకరాలు, ప్రతి ఐదు సంవత్సరాల్లకోసారి పాణి తీస్తాన. పెద్ద పహాణి. ఆడ కరెక్టు పట్టాదారు ఉన్నడు. తుర్కయిన. ఈ సందుల దాన్ని LTR (Land Transfer Regulation Act) కేసుకింద పెట్టిండు, ప్రభుత్వం భూమి అని. లంచం అడిగినోల్లను చెప్పుతోకొట్టు అని కెసిఆర్ అంటాండు. కొట్టితే కొట్టుకాని లంచం ఇయ్యమని ఆఫీసర్లు అంటాంద్రు' ఆవేదన చెందుతాండు అలా తిరిగి తిరిగి అలసిపోయిన లచ్చిరెడ్డి.

ఇంట్లో ఎవరికైనా ఉద్యోగం ఉంటే ఆ ఇంట్లో వృద్ధాప్య పింఛను ప్రభుత్వం ఇవ్వట్లేదు. అలా ఇంతకుముందు ఇచ్చిన వారికి కూడా రద్దు చేసారు. "ఉద్యోగస్తుల తల్లితండ్రులకు పింఛను లేదన్నడు. జాబు ఉన్న కొడుకు బుక్కెడు బువ్వ పెడతలేడు. ఇటేమో ఫింఛను బందు. ఏం జెయ్యాలె. నీ కొడుకుని అడుక్కో. నువ్వు రాసియ్యి, నీ కొడుకు చూసుకుంటలేడు, బువ్వపెడ్తలేడు అని" అంటున్నారని ఆవేదన చెందుతది అలా పింఛను కోల్పోయిన ఒక వృద్ధురాలు. . ఒక దొర్లయిన చీపురు కొయ్యలు కోసుకుని బతుకుతాండు. "నీ కొడుక్కి నౌకరి ఉన్నది నీకు పింఛను ఇయ్యను అంటె. ప్రభుత్వం ఏం చెయ్యాలె, కొడుకుది కట్‌చేసి తల్లిదండ్రులకు పింఛను ఇయ్యాలె. ఎమ్మార్వోని అడిగితె, మీ కొడుకు డబ్బులు ఇయ్యట్లేదని అప్లికేషన్ పెట్టాలె అంటె, తండ్రి కొడుకు మీద అప్లికేషన్ ఇస్తడా!?" అని ప్రశ్నిస్తాడు పింఛను కోల్పోయి చీపురు కొయ్యలు కోసుకుని బతుకుతున్న దొర్లయిన.

ఉచిత కరెంట్ పథకం వలన కూడా కేవలం భూములు ఉన్న భూస్వాములకే లబ్ది చేకూరుతాంది. కౌలు రైతులు, చిన్న సన్నకారు రైతులకు ఎలాంటి లబ్ది చేకూరకపోగా నష్టం కలిగిస్తాంది. "ఉచిత కరెంటని ఇస్తే, అన్యాయంగ పోతన్నయి నీళ్లు. మొత్తుకుంట బోర్లు ఎత్తిపోత్తానయి. ఎవడియ్యమన్నడు. ఎక్కన్నో కొనుక్కొచ్చి ఇస్తాండు. ఎవడన్న కొనుక్క రమ్మన్నడా? 24 గంటలు ఇస్తె నీల్లు ఉన్నోనియి పోస్తాండె, లేనోనియి ఎండి పోతాండె. 50 బోర్లుంటె, 25 బోర్లు ఎత్తిపోత్తానయి. మిగతా మోటార్లు ఎండిపోతానయి. ఉన్నోన్ని మోటరు బందు పెట్టమంటె నువ్వు ఎవ్వనివిరా నా మోటరు బందు చేస్తానికి. టైమ్ ప్రకారం కరెంట్ ఇచ్చినప్పుడు అన్ని బోర్లు పోసేది" అని అంటాడు లచ్చిరెడ్డి.

ఇలా కెసిఆర్ ప్రభుత్వం ప్రవేశ పెట్టిన రైతుబంధు, ఉచిత కరెంట్ పథకాలు చిన్న సన్నకారు, కౌలు రైతులకు లబ్ది చేకూర్చకపోగా నష్టాన్ని కలిగిస్తున్నాయి. ఇంత వరకు తమ భూములు గ్రామాల్లో కాపాడుకోవడానికి కౌలుకు ఇచ్చిన భూస్వాములు ఎంతో కొంత కౌలు వస్తే చాలు అనుకున్నారు. ఒకవేళ పంట పండలేదు అని కౌలు రైతు మొర పెట్టుకుంటే ఆ కౌలు కూడా రద్దు చేసుకున్నరు. కానీ సమగ్ర సర్వే, భూసర్వేతో తమ భూమి హక్కులు బలోపేతం అయినంక వారి భూములు ఎక్కడికి పోవు అనే ధైర్యం వచ్చింది. ఇప్పుడు పెట్టుబడి సాయం సంవత్సరానికి ఎనిమిది వేలు వస్తే, కౌలు అంతకంటే ఎక్కువే ఉండాలనుకుంటాడు. అది కౌలురైతుకు భారంగా మారి ఉత్పత్తి వ్యయం పెరగడం తప్ప మరేమీ లేదు. ఆ పెట్టుబడి నిజంగా వ్యవసాయం చేసేవారికి ఇస్తే

# ఇవి ప్రజాభిమతాన్ని ప్రకటించే ఎన్నికలేనా?

***ఎన్నికలలో ఎప్పటికప్పుడు ఏదో ఒక వైఖరి తీసుకోవడం కాక, అసలు భారత పార్లమెంటరీ ప్రజాస్వామిక ఎన్నికల స్వభావాన్ని మౌలికంగా అర్థం చేసుకోవాలంటున్నారు* ఎన్. వేణుగోపాల్**

ప్రస్తుతం తెలంగాణతో సహా ఐదు రాష్ట్రాలలో శాసనసభలకు జరుగుతున్న ఎన్నికలు, రానున్న నాలుగైదు నెలల్లో దేశవ్యాప్తంగా లోకసభకు జరగనున్న ఎన్నికలు కొత్తవేమీ కావు. దేశంలో సుదీర్ఘకాలంగా కొనసాగుతున్న ఎన్నికల ప్రక్రియలో భాగమైనవే. అయినా ప్రత్యేకించి తెలంగాణ ఎన్నికల గురించి ఎటువంటి వైఖరి తీసుకోవాలనే చర్చ ప్రగతిశీల, విప్లవ శక్తుల మధ్య పెద్ద ఎత్తునే జరుగుతున్నది. ఎవరి గెలుపు లేదా ఎవరి ఓటమి ప్రజలకు ఎక్కువ ప్రయోజనకరం అనే ప్రాతిపదిక మీద కూడ చర్చలు జరుగుతున్నాయి. చాల సులభంగా పరిష్కరించదగిన ప్రశ్నలు కూడ జటిలంగా మారి గందరగోళానికి దారి తీస్తున్నాయి. ఈ గందరగోళాన్ని తొలగించుకోవడానికి ఈ ఎన్నికల గురించి ప్రత్యేకంగా గాని, మొత్తంగా దేశంలో ఎన్నికల విధానం గురించి గాని ఒక అవగాహనకు రావలసి ఉంది. ఆ అవగాహన కోసం అసలు భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్య, ప్రాతినిధ్య ఎన్నికల వ్యవస్థ చారిత్రక నేపథ్యాన్ని అర్థం చేసుకోవడం అవసరం.

బ్రిటిష్ వలస పాలకులు 1920లో ప్రవేశపెట్టిన నాటి నుంచి ఇవాళ్టికి వంద సంవత్సరాలుగా దేశంలో పార్లమెంటరీ ప్రాతినిధ్య ప్రజాస్వామ్య పద్ధతిలో ఎన్నికలు జరుగుతున్నాయి. ఈ వంద సంవత్సరాల్లో ఎన్నికల పద్ధతుల్లో, పోటీ చేస్తున్న రాజకీయ పార్టీల్లో, ప్రజల వోటింగ్ హక్కులో, ప్రజల ప్రతిస్పందనలో, అభ్యర్థుల అర్హతలలో, ప్రచార సరళిలో, డబ్బు పాత్రలో, ఫలితాల ప్రకటనలో, పార్లమెంటరీ రాజకీయ పక్షాల ప్రవర్తనల్లో, గెలిచి అధికారానికి వచ్చిన రాజకీయపక్షాల, ప్రతిపక్షాల వ్యవహార సరళిలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఎన్నికల గురించి జరుగుతున్న చర్చలలో, ఎన్నికల సంస్కరణల కోసం వస్తున్న ప్రతిపాదనల్లో ఈ అంశాలే చోటు చేసుకుంటున్నాయి గాని, భారత పార్లమెంటరీ ఎన్నికల వ్యవస్థ గురించి మౌలిక చర్చ జరగడం లేదు.

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం భారతదేశం పట్ల బ్రిటిష్ వలసవాదుల ఆలోచనల్లో, వైఖరుల్లో చాల మార్పులు తెచ్చింది. దేశ పాలక మండలిలో కొందరు భారతీయులకైనా స్థానం కల్పించడం తమ

---

ఉత్పత్తి వ్యయం తగ్గి, పంట నష్టాలు తట్టుకొని ఆత్మహత్యలు తగ్గేవి. ఇప్పుడు ఈ పెట్టుబడి సాయం ఉత్పత్తి వ్యయం తగ్గించకపోగా, కౌలు అదనంగా పెరిగి రైతును నష్టాల్లో పడేసేదిగా ఉంది.

ఇక ఆదివాసిల పరిస్థితి దారుణంగా ఉంది. ఆదివాసుల భూములు ఇప్పటికే అన్యాక్రాంతం అయినాయి. ఆదివాసియేతరులు, ఆదివాసుల దోపిడీ రహిత జీవనాన్ని ఆసరాగా చేసుకోని వాళ్ల భూములు నామమాత్ర ధరలకు, కొన్నిసార్లు ఏమీ ఇవ్వకుండానే వశం చేసుకున్నారు. ప్రభుత్వాలు అభివృద్ధి పేరుతో, అనేక ప్రాజెక్టుల పేరుతో ఆదివాసుల భూములు లాక్కుని, వారిని నిర్వాసితులని చేశాయి. ఇక వారికి రైతుబంధు, ఉచిత కరెంట్ ఊహకందని విషయాలు. అంతో ఇంతో లబ్ధి కూడా లంబాడీలు తీసుకుంటున్నారు. ఆదివాసుల భూములు ఇతరులు కొనకుండా చేసిన ఏ చట్టం సరిగా పనిచేయక, ఏజెన్సీ ఏరియా భూములు కూడా ఆదివాసియేతరుల చేతుల్లోకి వెళ్లిపోయాయి. ఇక పోడు భూములకు పట్టాలు లేవు. కొన్ని పోడు భూముల్లో ప్రభుత్వం హరితహారం పేరుతో చెట్లు పెట్టింది. కొన్ని భూములు ఎల్‌టిఆర్ (భూ బదిలీ క్రమబద్ధీకరణ) కింద ప్రభుత్వ భూముల్లో కలిపింది. ఇక ఆదివాసులకు ఏమీ మిగలలేదు. ఏజెన్సీ ఏరియా పేరు మీద చిన్న చితక ఉద్యోగం వస్తే ఇక ఆ ఇంట్లో ఉండే వృద్ధులకు పింఛను బందు చేసింద్రు.

కెసిఆర్ ప్రభుత్వం తమ భూస్వామ్య వర్గదృక్పథాన్ని స్పష్టంగా పాటిస్తుంది. ఎవరు ఏమీ అనుకున్న తాను చేసే ప్రతి పని గ్రామాల్లోని భూస్వామ్యవర్గాన్ని బలోపేతం చేయడానికి, నక్సలైట్ ఉద్యమంతో పట్టణాలు పట్టిన వెలమ, రెడ్డి భూస్వాములకు లబ్ధి చేకూర్చడానికే ఉద్దేశించినవి. సమగ్ర సర్వే, భూసర్వే కూడా నక్సలైట్‌లు పంచిన భూములు ఎక్కడ ఉన్నవి, వాటిని ఎవరు సాగు చేస్తున్నారు తెలుసుకోవడం కోసం చేసినవి. కెసిఆర్ ప్రభుత్వం వచ్చిన తర్వాత దొరలు మళ్లీ గ్రామాలకు వచ్చి, వారు కోల్పోయిన భూములను సాధ్యమైన దగ్గర తిరిగి స్వాధీనం చేసుకున్నారు. కాని కాడ సాగుచేసుకుంటున్న వాళ్లకే పట్టాలు చేయిస్తామని ఎంతోకొంత ధరకు అమ్ముకున్నారు. వాటిని దున్నుకున్నవారు కూడా గొడవలెందుకు ఎంతో కొంత ఇచ్చి సెటిల్ చేసుకుందామనే స్థితిని కెసిఆర్ సర్వేల ద్వారా తీసుకువచ్చారు. ఇక ఎవరు చేసుకోకుండా పడావు పడి ఉన్న భూముల్లో టిఆర్‌ఎస్ పార్టీ స్థానిక నాయకులు దందాలు చేసారు. కెసిఆర్ చేసిన సర్వేతో మొదలుకొని యజ్ఞాల దాకా, యాదగిరిగుట్ట నుండి రాచకొండ గుట్టల దాక, కాళేశ్వరం మొదలుకొని మల్లన్నసాగర్ దాకా తమ ఉత్తర తెలంగాణ వెలమ భూస్వామ్య ప్రతిష్ఠాపన లక్ష్యంగా జరిగిందే! అందుకు ఇప్పుడిప్పుడే అర్థికంగా బలపడుతున్న అగ్రకుల బిసి వర్గాలను ఉపయోగించు కుంటున్నారు. ఇదంతా భూస్వాములకు గ్రామాల మీద పోయిన అధికారం తిరిగి కట్టబెట్టి, రాష్ట్రాన్ని ఫ్యూడలిజంలోకి నెట్టే తిరోగామీ ఆర్థిక విధానం తప్ప వేరొకటి కాదు.

*(రచయిత తెలంగాణ విద్యార్థి వేదిక, రాష్ట్ర కమిటీ సభ్యుడు)* వీ

దీర్ఘకాలిక ప్రయోజనాలకు అవసరమనే స్పృహ బ్రిటిష్ పాలకులకు అప్పుడే కలిగింది. వలస పాలకులు 1920 నాటి ప్రత్యక్ష ప్రాతినిధ్య ఎన్నికలకు ఆరు దశాబ్దాల ముందు నుంచే దేశాన్ని పాలించే పాలకమండలిలో భారతీయుల ప్రతినిధులుగా కొందరిని నేరుగా ఎంపిక చేసే, కొందరిని పరోక్ష ఎన్నిక ద్వారా నియమించే పద్ధతిని ప్రారంభించారు. అలా మొదటి భారత స్వాతంత్ర్య సమరం ముగియగానే ప్రవేశపెట్టిన ఇండియన్ కౌన్సిల్స్ ఆక్ట్ 1861 నాటి నుంచే దేశ పాలనలో భారతీయుల ప్రవేశం మొదలయింది. భారత జాతీయ కాంగ్రెస్ విజ్ఞప్తుల ఫలితంగా ఈ చట్టానికి సవరణలు చేసి ఇండియన్ కౌన్సిల్ ఆక్ట్ 1892 తీసుకొచ్చి, భారతీయ ప్రతినిధుల సంఖ్యనూ, విభిన్న వర్గాల ప్రాతినిధ్యాన్నీ విస్తరించారు. తర్వాత మోర్లే-మింటో సంస్కరణల్లో భాగంగా ఇండియన్ కౌన్సిల్స్ ఆక్ట్ 1909 తీసుకొచ్చి, ప్రాతినిధ్య ఎన్నికలను మరింత విస్తరించారు.

అలా, అప్పటికి ముప్పై సంవత్సరాలుగా పరోక్ష పద్ధతిలో జరుగుతున్న ఎన్నికలను మోంటేగ్-చెమ్స్ ఫర్డ్ సంస్కరణలతో, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్ట్ 1919 తో ప్రత్యక్ష ఎన్నికలుగా మార్చారు. ప్రత్యక్ష ఎన్నికలు 1920 లోనే ప్రారంభమయినప్పటికీ అవి కూడ సార్వత్రిక వయోజన వోటు హక్కు ప్రాతిపదికగా ఉన్నవి కావు. భూమి, సంపద, వృత్తి వంటి ప్రాతిపదికలతో అత్యల్ప సంఖ్యాక వర్గానికి మాత్రమే వోటు హక్కును ఇచ్చినవి. వోటు హక్కుకు ఉన్న ఈ పరిమితులను తగ్గిస్తూ, ప్రతినిధుల సంఖ్యను మరికొంత పెంచుతూ, వివిధ రాష్ట్రాల శాసనసభలకు కూడ అధికారాలు పెంచుతూ గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్ట్ 1935 వచ్చి, ఆ తర్వాత ఆ చట్టం కిందనే ఎన్నికలు జరిగాయి. అవి కూడ ఎన్నో పరిమితులతో ఉన్నవే. ఈ నేపథ్యంలో 1947 ఆగస్ట్ 15న అధికార మార్పిడి జరిగిన తర్వాత, అంతకు ముందే 1945 ఎన్నికలలో గెలిచిన ప్రభుత్వమే మధ్యంతర ప్రభుత్వంగా కొనసాగింది. అప్పుడు ఎన్నికైన కేంద్ర శాసన సభే రాజ్యాంగ నిర్ణయ సభగా మారింది. ఆ రాజ్యాంగ నిర్ణయ సభ తయారు చేసిన రాజ్యాంగం 1950 జనవరి 26 నుంచి అమల్లోకొచ్చింది.

ఆ రాజ్యాంగం ప్రకారం తయారయిన ప్రజా ప్రాతినిధ్య చట్టం (ది రిప్రెజెంటేషన్ ఆఫ్ ది పీపుల్ ఆక్ట్) 1951 జూలైలో ఆమోదించబడి, ఎటువంటి వర్గ, కుల, మత, స్త్రీపురుష, ప్రాంత పరిమితులు లేని సార్వత్రిక వయోజన వోటు హక్కు ప్రాతిపదికగా మొట్టమొదటి ఎన్నికలు 1951 అక్టోబర్ నుంచి 1952 ఫిబ్రవరి వరకు జరిగాయి. అప్పుడే కొన్ని రాష్ట్రాల శాసనసభలకు, తర్వాతి కాలంలో మరికొన్ని రాష్ట్రాల శాసనసభలకు అదే పద్ధతిలో ఎన్నికలు మొదలయ్యాయి. అప్పటి నుంచి గడిచిన అరవై ఆరు సంవత్సరాలలో లోకసభకు 16 సార్లు, రాష్ట్రాల శాసనసభలకు వేరువేరుగా ఇరవై ఒక్కసార్లు ఎన్నికలు జరిగాయి.

ఇంత సుదీర్ఘ చరిత్ర ఉన్నప్పటికీ, భారత ఎన్నికలు ఇంకా స్థిరపడలేదని, నిస్సందేహమైన విశ్వసనీయతను సంతరించుకోలేదని, ఎన్నికల పద్ధతిలో, నిర్వహణలో ఎన్నెన్నో అక్రమాలు యథావిధిగా జరుగుతున్నాయని ప్రతి ఒక్కరికీ తెలిసిన సంగతే. ఎన్నికలకు ముందు ఆయా రాజకీయ పక్షాలు గాని, విడిగా అభ్యర్థులు గాని చేసే వాగ్దానాలు, ఇచ్చే హామీలు అమలు కావడం లేదని కూడ అందరికీ తెలుసు. అసలు ఎన్నికల వాగ్దానం అంటేనే నెరవేర్చని, ఎగ్గొట్టే హామీ అనే అర్థం వచ్చిందంటే ఎన్నికలు ఎంత హాస్యాస్పదంగా, అవిశ్వసనీయంగా ఉన్నాయో తేటతెల్లమవుతుంది. అభ్యర్థుల ఖర్చు గురించి, ఎన్నికల్లో పాటించవలసిన పద్ధతుల గురించి, అభ్యర్థుల ప్రవర్తనా సరళి గురించి ప్రజా ప్రాతినిధ్య చట్టం నిర్దేశించిన విధివిధానాలలో ఏ ఒక్కటీ సంపూర్ణంగా అమలు కావడం లేదు. ఖర్చుకు సంబంధించిన గరిష్ట పరిమితి పాటించిన అభ్యర్థుల సంఖ్య ఈ అరవై ఆరు సంవత్సరాలలో పోటీ చేసిన లక్షలాది మందిలో, గెలిచిన వేలాది మందిలో, వేళ్ల మీద లెక్కపెట్టేటంత కూడ ఉండదు. అంటే ఎన్నికలను నిర్దేశించే ప్రజా ప్రాతినిధ్య చట్టపు ప్రధాన నిబంధనే అమలు కాని స్థితిలో ఎన్నికలు జరుగుతున్నాయి. ఇది కేవలం ప్రచార వ్యయం విషయం మాత్రమే కాదు, డబ్బు ఎర చూపి వోట్లు కొనుక్కోవడం, విపరీతంగా తాగబోయించి వోట్లు ఆకర్షించడం, వేరువేరు కానుకలు ముట్టజెప్పి ప్రతిఫలంగా వోట్లు సంపాదించడం వంటి అనేక రూపాల్లో ఎన్నికల్లో డబ్బు ప్రాధాన్యత, అక్రమాలు పెరిగిపోతున్నాయి.

ఎటువంటి తప్పుడు పద్ధతులు పాటించినా ఎన్నికలు చెల్లవని చట్టంలో స్పష్టంగా చెప్పి, ఏయే తప్పుడు పద్ధతులు సాగే అవకాశం ఉందో పొడవాటి జాబితా ఇచ్చినప్పటికీ, ఆ జాబితాలో ఉన్నవీ లేనివీ తప్పుడు పద్ధతులు జరగకుండా ఇప్పటికి ఏ ఒక్క ఎన్నికా జరగలేదనేది చరిత్ర చెపుతున్న సత్యం. కుల, మత, ప్రాంత, భాషా సమీకరణాలు ఉపయోగించి వోట్లు రాబట్టడం, విద్వేషాలు రెచ్చగొట్టి తద్వారా వోట్లు రాబట్టడం వంటి చట్టం చెప్పిన తప్పుడు పద్ధతులను ఈ ఆరు, ఏడు దశాబ్దాలలో అన్ని రాజకీయపార్టీలూ కళగా అభివృద్ధి చేశాయి. ఆధిపత్య కులాలు తమ హింసా దౌర్జన్యాలతో పీడక కులాల ప్రజల వోటు హక్కును నిరాకరించడం, నియంత్రించడం, తమ ఇష్టారాజ్యంగా మలచుకోవడం, కొన్ని కులాల వారిని, మతాల వారిని వోటు వేయనివ్వకపోవడం, బెదిరించడం, రిగ్గింగ్, బూత్ కాప్చరింగ్, బూత్ మేనేజిమెంట్ వంటి ఎన్నో అప్రజాస్వామిక, చట్టవ్యతిరేక చర్యలు జరుగుతున్నాయి. అధికారంలో ఉన్న పార్టీ తన అధికారాన్ని దుర్వినియోగం చేస్తూ, అధికార యంత్రాంగం సహాయంతో, అధికార నిధుల సహాయంతో వోట్లు కొల్లగొట్టడానికి, ప్రత్యర్థులను బెదిరించడానికి, భయపెట్టడానికి, కొనివెయ్యడానికి ప్రయత్నించడం కూడ పెద్ద ఎత్తునే జరుగుతున్నది.

ఒక్క మాటలో చెప్పాలంటే, పార్లమెంటరీ, ప్రాతినిధ్య ప్రజాస్వామిక ఎన్నికలకు మూల ధాతువుగా ఉండవలసిన నిష్పక్షపాత, సమాచారసహిత, ఇష్టపూర్వక, స్వేచ్ఛాపూరిత ఎంపిక హక్కును ఉపయోగించుకునే హక్కు గాని, అధికారం గాని, అవకాశం గాని ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులకు లేకుండానే ఏడు దశాబ్దాలుగా దేశంలో ఎన్నికలు జరిగిపోతున్నాయి. మరోమాటల్లో చెప్పాలంటే ఈ ఎన్నికలు ఎంత మాత్రమూ నిజమైన ప్రజాభిప్రాయ సూచికలుగా ఉండడం లేదు.

నిజానికి పార్లమెంటరీ ప్రాతినిధ్య ఎన్నికలలోనే, అందులోనూ అందరికంటె ఎక్కువ వోట్లు వచ్చిన వారు గెలిచినట్టేననే పద్ధతిలోనే ప్రమాదకరమైన ప్రజాభిమత వ్యతిరేక సూచనలున్నాయి. ఈ పద్ధతిని ఫస్ట్ పాస్ట్ ది పోస్ట్ అంటారు. అంటే ఈ పద్ధతిలో అభ్యర్థిని వోటర్లలో అత్యధిక సంఖ్యాకులో, సగం కన్న ఎక్కువమందో, అంటే సాధారణ

మెజారిటీయో ఎన్నుకోవాలనే నియమమేమీ ఉండదు. పోటీపడిన అభ్యర్థులందరిలోనూ ఎవరు ఎక్కువ వోట్లు సంపాదిస్తే వారు గెలిచినట్టే. అంటే వంద వోట్ల కోసం పది మంది పోటీ పడితే ఎనిమిది మందికి తలా పది, ఒకరికి తొమ్మిది, మరొకరికి పదకొండు వోట్లు వస్తే, పదకొండు వోట్లు వచ్చిన అభ్యర్థిని విజేతగా ప్రకటించే హాస్యాస్పద పరిణామానికి ఈ పద్ధతి దారి తీస్తుంది. ఉదాహరణకు ఇటీవలనే కశ్మీర్ లో జరిగిన స్థానిక స్వపరిపాలనా సంస్థల ఎన్నికలను బహిష్కరించాలని కొన్ని పార్టీలు ఇచ్చిన పిలుపుకు ప్రజలు పెద్ద ఎత్తున స్పందించారు. అత్యధిక ప్రజానీకం వోట్లు వేయలేదు. ఒక నియోజకవర్గంలో మూడు వోట్లు మాత్రమే పోల్ కాగా, అందులో రెండు వోట్లు వచ్చిన అభ్యర్థిని విజేతగా ప్రకటించారు!

ఈ కశ్మీర్ ఉదాహరణ అతిశయోక్తి అనిపించవచ్చు గాని, దేశంలో అమలవుతున్న ఎన్నికల పద్ధతిని స్థూల స్థాయిలో చూసినప్పుడు కూడ దాని హాస్యాస్పద లక్షణం స్పష్టంగా బైటపడుతుంది. ఈ ఎన్నికలను పేరుకు నిప్రాతినిధ్య ఎన్నికలనీ, ఎన్నికైన అభ్యర్థులను నిప్రజా ప్రతినిధులూ అనీ అంటారు గాని వాస్తవంగా వారు ఎందరికి ప్రతినిధులో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. అసలు వయోజన వోటు హక్కు వల్ల ప్రజలందరికీ ప్రాతినిధ్యం అనే మాటే అర్థం కోల్పోయింది. మొత్తం జనాభాలో దాదాపు మూడో వంతుగా ఉండే పద్దెనిమిది సంవత్సరాల లోపు వారికి వోటు హక్కే లేదు. వారికి ఎన్నికలతో సంబంధం లేదు. ఎన్నికల్లో నిలబడి గెలిచి తమను తాము ప్రజా ప్రతినిధులుగా పిలుచుకునే వారు ఈ వోటు హక్కు లేనివారికి ప్రతినిధులు కారు, కాలేరు. అంటే వందశాతం సమాజానికి ప్రతినిధిగా చెప్పబడుతున్నవారి ఎన్నికలో ముప్పై శాతం సమాజానికి భాగస్వామ్యమే లేదు.

పోనీ, మిగిలిన డెబ్బై శాతం ప్రజల్లోనైనా వారు ఎంత మందికి ప్రాతినిధ్యం వహిస్తారన్నది మరొక ప్రశ్న. అసలు వోటు హక్కు ఉన్న ఆ డెబ్బై మంది మొత్తానికి మొత్తం ఎప్పుడూ వోటు వేయడం లేదు. గత ఆరున్నర దశాబ్దాల ఎన్నికల చరిత్రలో పోలింగ్ శాతం సగటున 65 శాతానికి మించలేదు. అంటే వోటు వేస్తున్నవారి సంఖ్య మొత్తం సమాజంలో 49.5 శాతమే అన్నమాట. ఒక్కొక్క స్థానానికీ కనీసం ఐదుగురు అభ్యర్థులు పోటీ పడ్డారనుకుంటే, అందరికీ అటూ ఇటూగా సమానమైన వోట్లు వచ్చాయనుకుంటే, వోటు వేసినవారిలో ఇరవై శాతం మంది కోరుకున్నవారు, అంటే మొత్తం సమాజంలో చూసినప్పుడు పది శాతం వోట్లు వచ్చిన అభ్యర్థి గెలిచి నిప్రజా ప్రతినిధి అయ్యే అవకాశం ఉంది. ఆ 10 మందో, 11 మందో కోరుకున్నవారు 100 మందికీ ప్రతినిధులుగా చెప్పుకుంటూ అధికారాన్ని నిర్వహించే అవకాశం ఉంది.

అక్కడితో కూడ అయిపోలేదు. ఆ పది, పదకొండు వోట్లయినా నిజంగా ఆ పది, పదకొండు మంది ప్రజల అభిమతమా, లేక డబ్బుకు, మద్యానికి, ఇతర ఆకర్షణలకు, కుల మతాలకు, బెదిరింపులకు పడినవా, రిగ్గింగ్ తో పడినవా అని చూడవలసి ఉంటుంది. అలా నిజమైన అభిమతం కానివి, తక్షణ ఆకర్షణల వల్ల పడినవి, దొంగచాటుగా పడినవి సగమైనా ఉన్నాయనుకుంటే, నిప్రజా ప్రతినిధి అని పిలవబడేవారు నిజంగా సమాజంలో ఐదు శాతం కన్న తక్కువ ప్రజల అభిమతం ప్రకారం ఎన్నికయ్యారన్నమాట.

అంటే ఎట్లాగైతే భారత సమాజంలో తరతరాలుగా ఐదు శాతం కన్న తక్కువగా, అత్యల్ప సంఖ్యాకులుగా ఉన్న ఆధిపత్య కులాలకు చెందిన వ్యక్తులు తామే సమాజమన్నట్టుగా, అత్యధిక సంఖ్యాకుల మీద రాజ్యం చేస్తూ వచ్చారో, సరిగ్గా అదే పద్ధతిలో పార్లమెంటరీ ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం కూడ అతి తక్కువ మంది ఆధిపత్యాన్ని అతి ఎక్కువ మంది మీద స్థాపిస్తున్నది. దానికి ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం అని, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అని మేలి ముసుగు కప్పుతున్నది. కుల వ్యవస్థకూ, దేశంలో అమలులో ఉన్న పార్లమెంటరీ వ్యవస్థకూ మధ్య ఈ సాధారణ లక్షణం ఉండడం వల్లనే అవి రెండూ ఒకదాన్ని ఒకటి అంటిపెట్టుకుని ఉన్నాయి, ప్రభావితం చేసుకుంటున్నాయి, ఒకదాన్ని మరొకటి బలోపేతం చేసుకుంటున్నాయి. రక్త పారిశుధ్య, అంతర్వివాహ, అంతర్భోజన ప్రాతిపదిక మీద ఏర్పడిన ఆదిమ, భూస్వామ్య కులవ్యవస్థకూ, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం ప్రాతిపదిక మీద ఏర్పడిన అధునిక, పెట్టుబడిదారీ పార్లమెంటరీ వ్యవస్థకూ మధ్య ఇంత అన్యోన్య మైత్రి కుదరడమే మన సమాజ స్థితికి ఒక సూచన.

అంటే ఎటువంటి అక్రమాలు జరగకపోయినప్పటికీ అసలు ఈ ఎన్నికల పద్ధతే ప్రాతినిధ్యమూ కాదు, ప్రజాస్వామ్యమూ కాదు. కాని ఈ ఎన్నికలే ప్రజాస్వామ్యానికి చిహ్నమనీ, ఎన్నికవుతున్నవారు నిజమైన ప్రజా ప్రతినిధులనీ తప్పుడు భావజాలాన్ని వంద ఏళ్లుగా, మరీ ముఖ్యంగా గత ఆరున్నర దశాబ్దాలుగా మన ప్రజల మెదళ్లలో రుద్దుతున్నారు. మరీ ముఖ్యంగా విద్యావంతులలో, మధ్యతరగతిలో ఈ తప్పుడు భావజాలాన్ని అభేద్యంగా నిర్మిస్తున్నారు. వోటు వేయకపోతే పౌరులే కారన్నట్టుగా, జీవించి ఉన్నామనడానికి వోటు వేయడమే చిహ్నంగా తప్పుడు భావాలు ప్రచారం చేస్తున్నారు. ఈ తప్పుడు పద్ధతి మీద ప్రశ్నలు అడగడమే తప్పు అనే భావజాలం నెలకొల్పుతున్నారు.

ఒక వ్యవస్థ కేవలం నడుస్తున్నందువల్ల, తప్పులతోనో, ఒడిదుడుకులతోనో నడిచిపోతున్నందువల్ల మాత్రమే సక్రమమైనదీ, ప్రజాప్రయోజనాలకు అనుగుణమైనదీ కాజాలదు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కూడ కేవలం నడిచిపోతున్నది గనుక ప్రజాప్రయోజనకరం కాదు. ఆ మేడిపండు పొట్టవిప్పి చూసి, పైన ఎంత నిగనిగలాడుతూ ఉన్నప్పటికీ లోపల లుకలుకలాడుతున్న పురుగులను చూడవలసి ఉంది. అంటే అసలు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అనే వ్యవస్థ మూలం ఏమిటో, స్వభావం ఏమిటో, అది భారత సమాజంలోకి ఎట్లా ఎప్పుడు ఎందుకు వచ్చిందో, లోలోపల కుళ్లిపోయి కూడ ఏ కారణాల వల్ల పైకి సజీవంగా ఉన్నట్టు నిగనిగలాడుతున్న భ్రమ కలిగిస్తున్నదో పరిశీలించాలి.

మొట్టమొదట పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అనేది పారిశ్రామిక విప్లవపు, పెట్టుబడిదారీ విధానపు, బూర్జువా ప్రజాస్వామిక విప్లవపు ఫలితం. కార్మికవర్గం తనను తాను తెలుసుకుని వర్గపోరాటం పదునెక్కిన తర్వాత, సమాజంలో వర్గ విభజన స్పష్టమైన తర్వాత, ఆధిపత్య బూర్జువా వర్గపు అధికారాన్ని స్థిరపరచుకోవడానికి వచ్చిన ఒకానొక పాలనా రూపం అది. సరుకు విలువలో భూమికీ, పెట్టుబడికీ, శ్రమకూ, నిర్వహణకూ ఎవరి వాటా వారికి దక్కుతుందనే కుహనా సూత్రాన్ని తయారు చేసినట్టుగానే, పాలనా వ్యవహారాలలో సమాజంలోని విభిన్న వర్గాలకు ఎవరి వాటా ప్రాతినిధ్యం వారికి దొరుకుతుందనే సూత్రానికి చిహ్నం ఈ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం. ఈ కుహనా ప్రాతినిధ్య సూత్రానికి

కొనసాగింపుగానే, శాసన నిర్మాణ, శాసనాధికార, న్యాయవ్యవస్థల మధ్య అధికార విభజన, స్వతంత్ర న్యాయవ్యవస్థ సాధికారత, స్వతంత్ర పత్రికా రంగం, పత్రికా స్వేచ్ఛకు హామీ, విభిన్న వర్గాల మధ్య సామరస్యాన్ని సాధించే రాజ్యాంగ యంత్రం వంటి అనేక రూపాలు కూడ వచ్చాయి. సర్వాధికారులైన భూస్వామ్య, రాచరిక ప్రభువుల చేతి నుంచి తమ చేతికి రాజ్యాధికారాన్ని లాక్కోవడానికి ప్రజాస్వామిక విప్లవం జరిపిన బూర్జువా వర్గం తాను సమానత్వం స్థాపిస్తానని వాగ్దానం చేసింది. ఆ సమానత్వానికి ఒక అభాస చిహ్నంగా చూపడానికి—ఒక వ్యక్తి ఒక వోట్లు అనే సమానత్వాన్ని ప్రతిపాదించింది.

ప్రధానంగా పశ్చిమ యూరప్ లో బూర్జువా ప్రజాస్వామిక విప్లవాల వెల్లువలో పుట్టుకు వచ్చిన ఈ పార్లమెంటరీ ప్రాతినిధ్య ఎన్నికల వ్యవస్థను, ఆ పశ్చిమ యూరప్ సామ్రాజ్యవాద దేశాల పాలకవర్గాలు తమ వలస దేశాల్లో అంటుకట్టారు. అలా సామ్రాజ్యవాద దేశాలలో ఒక నిర్దిష్ట పరిస్థితిలో పుట్టి పెరిగి మహావృక్షంగా మారిన పార్లమెంటరీ వ్యవస్థనుంచి ఒక్కొక్క కొమ్మను నరికి తమ వలసల్లో నాటడానికి సామ్రాజ్య పాలకవర్గాలు ప్రయత్నించాయి. ప్రత్యక్షంగా తమ పాలన తొలగిపోతున్నప్పుడు, పరోక్షంగా కొనసాగించగల దళారీలకు ఒక వేదికగా ఈ పార్లమెంటరీ వ్యవస్థ పనిచేస్తుందని, ఇది ప్రజాస్వామ్యం అనే భ్రమలను ఆ సమాజాల్లో వ్యాపింపజేయడానికి కూడ ఉపయోగ పడుతుందని అనుకున్నారు. స్థానిక చరిత్ర, సామాజిక రాజకీయార్థిక పరిస్థితులు ఈ అంటుమొక్కను సహజంగా ఎదగనివ్వగలవా, అది అక్కడ వేళ్లూనుకుని ఫలపుష్పాలను ఇవ్వగలదా అని అటు వలసవాదులూ ఆలోచించలేదు, ఇటు వాళ్ల దళారీలూ ఆలోచించలేదు.

భారతదేశంలోకి పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థ వచ్చిన మార్గం కూడ ఇదే. ఇక్కడ ఒక స్వతంత్ర పెట్టుబడిదారీ వర్గం ఏర్పడలేదు. పారిశ్రామిక విప్లవం జరగలేదు. స్థానిక బూర్జువా వర్గం తలెత్తి భూస్వామ్య వ్యతిరేక పోరాటం చేసి, భూస్వామ్యాన్ని ఓడించి, బూర్జువా ప్రజాస్వామిక విప్లవం జరిగి పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని రూపొందించ లేదు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి ఇతర చిహ్నాలైన అధికార విభజన, పత్రికా స్వేచ్ఛ, స్వతంత్ర రాజ్యాంగ యంత్రం వంటివేవీ రూపొందలేదు. బూర్జువా ప్రజాస్వామిక విప్లవం జరిగితే రూపొంది ఉండే వ్యక్తే రూపొందలేదు. ఇంకా మనుషులు ఒక మందలో, సమూహంలో ముక్కలుగానే ఉన్నారు గాని వ్యక్తులుగా ఎదగలేదు. కనుక వ్యక్తి స్వేచ్ఛకూ, ఒక వ్యక్తికి ఒక వోటు విలువకూ ఆస్కారమే రాలేదు. కేవలం ఒక అంటుమొక్క, అది కూడ కుండీలో మహావృక్షం లాంటి బోన్సాయి మొక్కగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఈ దేశంలోకి వచ్చింది. బోన్సాయి మహావృక్షాలన్నిటి లాగే ఇది కూడ ఆ రెండడుగుల ఎత్తును మించి ఎన్నటికీ ఎదగదు. పూలు పూస్తుంది గాని అవి వాసననివ్వవు. కాయలు కాస్తుంది గాని అవి కుక్కమూతి పిందెలు. ఇది చెట్టులాగే ఉంటుంది గాని గాలి వీయదు, ఆహ్లాదాన్నివ్వదు. ఎక్కువలో ఎక్కువ ఇది ప్రజాస్వామిక సమాజమేమోననే భ్రమలు ప్రజల్లో కల్పించడంలో పాలకవర్గాలకు బ్రహ్మాండంగా ఉపయోగపడుతుంది. విభిన్న వర్గాలలో సమాజ పరివర్తన ఆలోచనలు రేకెత్తకుండా జోకొట్టడానికి ఉపయోగపడుతుంది. అణగారిన వర్గాలు, దోపిడీ పీడనకు గురవుతున్న వర్గాలు తమకు కూడ పాలనలో భాగస్వామ్యం దక్కుతున్నదని భ్రమ పడడానికి ఉపయోగపడుతుంది.

ఇది ఇటువంటి వికృత, వక్రీకృత, అపభ్రంశ ప్రజాస్వామ్యం గనుక ఇక్కడ ప్రజాస్వామ్యపు ఎన్నికలు ఇలా వికృతంగానే, వక్రీకరణలతోనే, అష్టావక్రంగానే ఉంటాయి. కనుక ఇవి ప్రజాస్వామిక ఎన్నికలేమో, వీటిలో పాల్గొనకపోతే ప్రజాస్వామ్యానికి దూరమవుతామేమో, వీటిని ఉపయోగించుకుని ప్రజల ప్రయోజనాలను సాధించ గలమేమో అనే భ్రమలతో వీటి పట్ల వ్యవహరించడమే తప్పు.

ఇవి ఈ నేలలో పుట్టిన, సహజమైన, ఈ సమాజానికి అవసరమైన ఎన్నికలు అని ఈ సమాజం అనుకోవడం లేదు గనుకనే సమాజంలో వీటి పట్ల ఇంతగా నిర్లిప్తత కనబడుతున్నది. ఎవరు గెలిచినా మార్పు ఉండబోవడం లేదనే అభిప్రాయం వ్యక్తమవుతున్నది. అందువల్లనే ఎన్నికలను తమ పాలకులను తాము ఎన్నుకునే మహదవకాశంగా చూసి, స్వచ్ఛందంగా ఎన్నికలలో పాల్గొనవలసిన ప్రజలు మౌన సాక్షులుగా ఉండిపోతున్నారు. ఎన్నికలను తమ ప్రతినిధులను ఎన్నుకునే అవకాశంగా కాక, ఒక మద్యం సీసానో, వెయ్యో రెండువేలో, మరేవైనా కానుకలో సంపాదించే మార్గంగా మాత్రమే చూస్తున్నారు. అందువల్ల ఇవి స్వచ్ఛంద ప్రజాభిమత వ్యక్తీకరణలుగా కాక బలవంతపు తద్దినాలుగా, ఐదేళ్లకొకసారి జరిగే మొక్కుబడి తంతుగా, ప్రహసనాలుగా మిగిలిపోతున్నాయి.

ఎన్నికల గురించి ఇలా మౌలికంగా ఆలోచిస్తున్నప్పుడు నక్సల్బరీ విప్లవోద్యమం ఇచ్చిన ఎన్నికల బహిష్కరణ పిలుపును కూడ పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది. వ్యవస్థ పరివర్తనకు బలప్రయోగమే మంత్రసాని అనీ, బూర్జువా పార్లమెంటరీ ఎన్నికల ద్వారా రాజ్యాధికారం రాదనీ, ఎక్కువలో ఎక్కువ వ్యవస్థను మార్చడానికి అవకాశం లేని ప్రభుత్వాధికారం మాత్రమే వస్తుందనీ మార్క్సిజం చెపుతున్నప్పటికీ, భారత కమ్యూనిస్టు పార్టీ మాత్రం తొలి నుంచీ ఎన్నికలలో పాల్గొనే వైఖరినే తీసుకుంది. మొట్టమొదట బ్రిటిష్ పాలనలోనే 1946లో జరిగిన రాష్ట్ర శాసనసభల ఎన్నికలలో పాల్గొంది. ఆతర్వాత కొద్దికాలం తెలంగాణలో సాయుధ పోరాట పంథాను అవలంబించినప్పటికీ, 1951 నాటికి ఆ సాయుధపోరాటాన్ని కూడ విరమించి, ఎన్నికలలో పాల్గొనాలని నిర్ణయించుకుంది. అప్పటి నుంచి ఇప్పటివరకూ అదే విధానాన్ని కొనసాగిస్తున్నది. 1952, 1957 ఎన్నికల్లో లోక సభలో ఎక్కువ స్థానాలు గెలుచుకున్న ప్రతిపక్ష పార్టీగా ఉండడం, 1957 ఎన్నికల్లో కేరళలో రాష్ట్ర ప్రభుత్వాన్ని కూడ స్థాపించడంతో భారత కమ్యూనిస్టు పార్టీ పూర్తిగా పార్లమెంటరీ ఎన్నికలలో కూరుకుపోయింది. దాని నుంచి ఇతర కారణాలతో విడిపోయిన భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) కూడ ఎన్నికల పట్ల భిన్నమైన వైఖరి తీసుకోలేదు. ఆ రకంగా భారత పార్లమెంటరీ ఎన్నికల వ్యవస్థకు ఎంతో కొంత విశ్వసనీయతనూ సాధికారతనూ కల్పించిన బాధ్యత భారత కమ్యూనిస్టు పార్టీ, భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) లదే.

ఈ వైఖరికి భిన్నంగా చారు మజుందార్ 1965-67 మధ్య రాసిన ఏడు డాక్యుమెంట్ల నాటి నుంచే సాయుధ పోరాటం ద్వారా తప్ప ప్రజా విముక్తి సాధ్యం కాదనే అవగాహనను ప్రచారం చేయడానికీ, పార్లమెంటరీ ఎన్నికలను బహిష్కరించాలనే నినాదానికీ ప్రాధాన్యత ఇచ్చారు. ఎన్నికల బహిష్కరణ నినాదానికీ, సాయుధ విప్లవ విస్తరణకూ మధ్య అన్యోన్య

సంబంధాన్ని నొక్కి చెప్పారు. భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) ఏర్పాటుకు సన్నాహకంగా అఖిల భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ సమితిలో జరిగిన చర్చలలో ఎన్నికల బహిష్కరణ ఒక ప్రధాన వివాదాస్పద అంశం అయింది. చివరికి 1969 ఏప్రిల్ 22న ఏర్పడిన పార్టీ ఎన్నికలను బహిష్కరించాలనే విధానానికే కట్టుబడింది. కాని భయంకరమైన నిర్బంధం, ఉద్యమం తాత్కాలిక వెనుకంజ, చారు మజుందార్ మరణం, అగ్రనాయకుల మధ్య విభేదాలతో చీలికలు వంటి పరిణామాలతో 1974 నాటికే మార్క్సిస్టు లెనినిస్టు శిబిరంలోనే ఎన్నికల పట్ల భిన్నాభిప్రాయాలు తలెత్తాయి. ఎన్నికలలో పాల్గొనవచ్చుననీ, ఎన్నికలను కూడ విప్లవ ప్రచారానికి వాడుకోవచ్చుననీ, ప్రజలు ఇంకా ఎన్నికల బహిష్కరణకు సిద్ధం కాలేదనీ, పాలకవర్గ ముఠాలలో పెద్ద ప్రత్యర్థికి వ్యతిరేకంగా చిన్న ప్రత్యర్థితో ఐక్యసంఘటన కట్టవచ్చుననీ, దుర్మార్గమైన ప్రత్యర్థిని ఓడించి, తక్కువ దుర్మార్గమైన ప్రత్యర్థిని గెలిపించవచ్చుననీ కొందరు నాయకులు ఎన్నో వాదనలు ముందుకు తెచ్చారు. ఎమర్జెన్సీ తర్వాత కొన్ని మార్క్సిస్టు లెనినిస్టు పార్టీలు నేరుగా ఎన్నికల్లో పాల్గొనడం కూడ ప్రారంభించాయి. మొత్తంగా నక్సల్బరీ విప్లవోద్యమ శిబిరంలో ఎన్నికల బహిష్కరణవాదులు, ఎన్నికలలో పాల్గొనేవారు అనే స్థూల విభజన ప్రారంభమయింది. పాలకవర్గ పార్లమెంటరీ పార్టీలన్నీ కూడ ప్రతిపక్షంలో ఉన్నప్పుడు విప్లవకారుల సహాయం కోరడం, అధికారానికి రాగానే వారి మీద దారుణమైన నిర్బంధాన్ని ప్రయోగించడం, ప్రతి ఎన్నికల సందర్భంలోనూ ఓడిన ప్రతి అభ్యర్థీ, ప్రతి పార్టీ కూడ అవతలి వారి గెలుపుకు నక్సలైట్ల ప్రత్యక్ష, పరోక్ష మద్దతు ఉన్నదని ఆరోపించడం మామూలు వ్యవహారాలై పోయాయి. ఎన్నికల్లో పాల్గొనాలనేవారు అన్ని రకాల అవకాశవాద పొత్తులకు సిద్ధపడి ఎన్నికల ఊబిలో కూరుకుపోయారు. ఎన్నికలను బహిష్కరించేవారు పైకి బహిష్కరణ నినాదం ఇచ్చినా లోపాయకారీగా ఏదో ఒక పార్టీకో, కనీసం స్థానికంగా కొందరు అభ్యర్థులకో మద్దతు ఇస్తున్నారనే ఆరోపణలను ఎదుర్కొన్నారు.

ఈ యాభై సంవత్సరాల ఎన్నికల బహిష్కరణ చరిత్రను ఒకసారి పునరావలోకనం చేసినప్పుడు, సామాజిక, రాజకీయార్థిక స్థితి దృష్ట్యా, భారత పార్లమెంటరీ వ్యవస్థ చరిత్ర దృష్ట్యా అది సరైన నినాదమే అయినప్పటికీ దాన్ని అర్థం చేసుకోవడంలో, వివరించడంలో, అర్థం చేయించడంలో కొన్ని పొరపాట్లు దొర్లాయనిపిస్తుంది. దాన్ని కేవలం కార్యాచరణ నినాదంగా మాత్రమే అర్థం చేసుకోవడంలో ప్రధాన లోపం ఉంది. ఎందుకంటే ఆ నినాదం ఆచరణలోకి రాకుండా చూడడానికి, పాలకవర్గాల ఒత్తిడి, ఎన్నికల ఆకర్షణలు, ప్రజల భ్రమలు, అమాయకత్వం, విప్లవశక్తుల బలహీనతలు వంటి ఎన్నో బలమైన అవరోధాలున్నాయి. ఆ అవరోధాలను అధిగమిస్తూ ఆ నినాదాన్ని కార్యాచరణలోకి తీసుకురావాలనేది నిజమే గాని అది సంపూర్ణంగా సాధ్యం కాదనేది కూడ నిజమే. ఆ నినాదం ఎంతగా కార్యాచరణ నినాదమో, అంతకన్న ఎక్కువగా చైతన్యీకరణ నినాదం అని అర్థం చేసుకున్నప్పుడు, ఆ నినాదాన్ని ముందుకు తీసుకుపోవడంలో ఎక్కువ విజయం సాధించవచ్చు. ఆ నినాదం ద్వారా సమాజ స్థితి గురించి, రాజకీయార్థిక పరిణామాల గురించి ప్రజా చైతన్యాన్ని పెంచడం మీద ఎక్కువ శ్రద్ధ పెట్టవలసిందే తప్ప అది ఇప్పటికిప్పుడు ఆచరణలో సాధ్యమయ్యే నినాదంగా అర్థం చేసుకుంటే పొరపాటు. అలా కుదించి అర్థం చేసుకున్నప్పుడు, ఆ నినాదం అమలును అంకెల్లో చూపి ఆచరణ సాధ్యం కానిదనో, కాలేదనో, విఫలమయిందనో అనడం జరుగుతుంది. బహిష్కరణ చైతన్యం అందిన ప్రాంతాలలో, ప్రజల్లో కూడ పోలీసు నిర్బంధంతో, బలప్రయోగంతో ఎన్నికలలో ఎక్కువ శాతం పోలింగ్ జరిగితే అది చూపి నినాదం ఓడిపోయిందని అనడానికి అవకాశం దొరికింది. అలా కేవలం ఆచరణాత్మక కొలతల్లో కాకుండా ప్రజా చైతన్య అభివృద్ధి కొలతల్లో, విప్లవావసరాన్ని ప్రజల్లో గుర్తింపజేసే ప్రయత్నాల్లో భాగంగా ఎన్నికల బహిష్కరణ నినాదాన్ని చూడవలసి ఉంది. ఎన్నికల బహిష్కరణ నినాదం ఇప్పుడు కొనసాగుతున్న పార్లమెంటరీ వ్యవస్థ ఎంతమాత్రమూ ఈ సమాజ సమస్యలను పరిష్కరించలేదనే చైతన్యాన్ని అందించడానికి ఉపయోగపడుతుంది. పార్లమెంటరీ ఎన్నికల్లో పోటీ పడుతున్న అభ్యర్థులందరూ దొంగలే, ఎవరు గెలిచినా ఎవరు ఓడినా ప్రజల జీవితాల్లో మార్పేమీ రాదని చూపడానికి ఆ నినాదం ఉపయోగపడుతుంది. మారవలసింది వ్యవస్థే తప్ప శాసనసభ్యులో, ప్రభుత్వాలో కాదని అర్థం చేయించడానికి ఎన్నికల బహిష్కరణ నినాదం ఉపయోగపడుతుంది.

భారత పార్లమెంటరీ ఎన్నికల వ్యవస్థ పట్ల ఇటువంటి విశాల దృక్పథాన్ని అలవరచుకున్నప్పుడు ఒక ప్రత్యేక ఎన్నికలో ఏ పాలకవర్గ ముఠా ఓడిపోయి, ఏ పాలకవర్గ ముఠా గెలుస్తుంది, ఏ దొంగ ఓడిపోయి, ఏ దొంగ గద్దెనెక్కుతాడు అనే చర్చకు అంత ప్రాధాన్యం లేదు. నిజానికి అరవై ఆరు సంవత్సరాల ఎన్నికల చరిత్ర ఈ అవగాహననే బలోపేతం చేస్తున్నది గాని ఎన్నికల వ్యవస్థ పట్ల గౌరవాన్ని, విశ్వసనీయతను పెంచడం లేదు.

*(రచయిత వీక్షణం సంపాదకుడు)* వీ

## వచ్చే సంచికలలో...

- తెలుగు రాష్ట్రంలో బిసి భావన - డా. మేడికుర్తి ఓబులేసు
- సామ్రాజ్యవాదం ఉన్నంతవరకు యుద్ధం అనివార్యం - సత్యం
- లేబర్ అడ్డాలో మా అనుభవాలు - బి. కావేరి, పి. శశికుమార్, ఎం. నాగరాజు
- చైతన్యంతోనే సురక్షితమైన భవిష్యత్తు - ఆర్. లక్ష్మి

# ఎన్నికల సంఘం పని విధానం

***ఎన్నికల నియమాల అమలులో ఎన్నికల సంఘం ఉదాసీనంగా వ్యవహరిస్తోందనీ, రాజకీయ పార్టీల ఎన్నికల మోసాలను నిర్మూలించడానికి ప్రజలు చైతన్యవంతులు కావాలనీ అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

భారత రాజ్యాంగం 324-329 అధికరణం వరకు ఎన్నికల సంఘం విధి విధానాలు - పని విధానం గురించి తెలియజేస్తుంది. ఎన్నికలలో జరిగే లోపాలను సరిదిద్దేందుకు స్వతంత్ర సంస్థ అయిన ఎన్నికల సంఘానికి రాజ్యాంగ రక్షణ కల్పించారు. అయినప్పటికీ ఎన్నికల సంఘం పాత్ర చాలా సార్లు నామమాత్రంగానే కనబడింది. ఎప్పుడో 90లలో టి.ఎన్. శేషన్ ప్రధాన ఎన్నికల కమిషనర్‌గా ఉన్నప్పుడు తప్ప దాదాపు ఎన్నికల సంఘం, అభ్యర్థుల ఖర్చులను నియంత్రించడంలో గాని లేదా అక్రమాలను నివారించడలో అనగా మద్యం, వస్తువులు, ధనం పంచే కార్యక్రమాలను నివారించడం చాలా నామమాత్రంగానే జరుగుతూ వస్తూ ఉన్నది.

బీహార్ రాష్ట్ర ప్రధాన ఎన్నికల కమిషనర్‌గా తెలుగు వారైన కె.జె. రావు పనిచేసినపుడు ఇ.సి. పని విధానం, దాని నిర్వహణ అధికారాలను ఆ రాష్ట్ర ప్రధాన రాజకీయ పార్టీలన్నింటికీ హెచ్చరిక లాగా చేసి, చాలా వరకు అక్రమాలను నియంత్రించారు. ప్రస్తుత పరిస్థితులలో ఇదో పెద్ద సవాలుగా మారింది. రాజకీయ పార్టీలన్నీ కూడా ప్రజలను 'బిచ్చగాళ్లు'గా చేసి, వారిని దానికి అలవాటుపడే విధంగా మార్చివేశారు.

భారత రాజ్యాంగం ప్రకారం 25 సంవత్సరాలు నిండిన ప్రతి ఒక్కరు ఎన్నికలలో పోటీ చేయవచ్చు. అసలు పోటీలో నిలుచోవడానికి ప్రాతిపదికలను రాజకీయ పార్టీలు మార్చివేశాయి. ఇన్ని కోట్లు పార్టీ ఫండ్ ఇచ్చినవారికి ఫలానా నియోజకవర్గానికి 'టికెట్' ఇస్తామనే ధోరణి వచ్చి, రాజకీయ పార్టీలన్నీ ఓటర్లను ఒక అంగడి సరుకుగా మార్చివేశారు. ఎన్నికలు అంటే 'అమ్మడం - కొనడం' ఒక వ్యవహారంగా మార్చివేశారు తప్ప, మనమంతా ప్రజస్వామిక వ్యవస్థలో ఉన్నాం. ఇదొక 'ర్యాజ్యాంగ ప్రక్రియ', రాజ్యాంగబద్ధంగా ఎన్నికలు జరుగుతాయి, శాసన సభ్యులను ఎన్నికల్లో ఎన్నుకోవడం ద్వారా 'ముఖ్యమంత్రి' ఎన్నుకోబడతాడు, (శాసన సభ్యుల చేత) అనే ఒక ప్రజాస్వామిక వాతావరణం ఈ రోజు దేశంలో కనిపించడం లేదు.

ఇప్పుడు పరిస్థితులు 'ఎన్నికల సంఘం' నామమాత్రమే అనే పరిస్థితి వచ్చింది. ఎందుకనగా తెలంగాణ శాసన సభను రద్దు చేసిన సందర్భంలో ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి కల్వకుంట్ల చంద్రశేఖరరావు శాసన సభ రద్దు - గవర్నమెంట్ నివేదిక ఎన్నికల సంఘం, ఎన్నికలు ఎప్పుడు జరిపేది ఒకేసారి తన ప్రెస్‌మీట్‌లో ప్రకటించాడు. ఇక్కడే అర్థమవుతున్నది 'ఎన్నికల సంఘం' 'నామమాత్రపు పని విధానం', దాని ప్రముఖ్యత, విశిష్టత.

భారతదేశంలో ఎన్నికల సంస్కరణలకు సంబంధించిన అనేక కమిటీలు గతంలో ఏర్పడ్డాయి. అయితే వారు చేసిన సూచనలను పాటించడంలో విఫలమవుతూ వస్తున్నారు ఈ పాలకులు. 1972లో సంయుక్త పార్లమెంటరీ కమిటీ నివేదిక, 1974లో జస్టిస్ వి.ఎం. తార్కుండే కమిటీ నివేదిక, 1990లో దినేశ్ గోస్వామి కమిటీ నివేదిక, 1993లో ఒహ్రా కమిటీ నివేదికల ప్రాతిపదికగా అనేక సంస్కరణలు అమలులోకి వచ్చాయి.

1998లో అప్పటి సిపిఐ నాయకుడు, పార్లమెంట్ సభ్యుడైన ఇంద్రజిత్ గుప్తా నాయకత్వంలో ఒక కమిటీ కూడా ఎన్నికల సంస్కరణలపై నివేదిక సమర్పించింది. 2007లో పరిపాలనా సంస్కరణలపై వీరప్ప మొయిలీ నాయకత్వంలో ఒక కమిటీ ఇచ్చిన నివేదికలో కూడా ఎన్నికల సంస్కరణలపై కొన్ని సూచనలు చేసింది. 2013లో పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ (పియుసిఎల్), యూనియన్ ఆఫ్ ఇండియా కేసులోని తీర్పు ఆధారంగా 'ఎన్ఓటిఎ' (నన్ ఆఫ్ ది అబోవ్)ను ప్రవేశ పెట్టారు. అనగా పోటీ చేసిన అభ్యర్థులలో తనకు ఎవరూ నచ్చలేదని చెప్పే హక్కును కూడా ఓటర్లకు ఎన్నికల కమిషన్ కల్పించింది. అనగా బ్యాలెట్‌లోని అభ్యర్థులనందరినీ కూడా తిరస్కరించవచ్చు అని అర్థం. గ్రామ పంచాయితీ ఎన్నికలు మొదలు భారత రాష్ట్రపతి ఎన్నికల వరకూ ఒక నిర్దిష్ట పద్ధతిని, నియమ నిబంధనలను స్పష్టంగా రూపొందించారు. 1950 జనవరి 25న భారత ఎన్నికల సంఘం (ఇసిఐ) ఏర్పాటుకు ముందే దేశంలో ఎన్నికలు జరిగినప్పటికీ, తర్వాత ఏర్పడిన గణతంత్ర వ్యవస్థలో ఎన్నికలకు ఒక స్వరూపాన్నిచ్చారు.

ఎప్పటికప్పుడు సర్వోన్నత న్యాయస్థానం, సుప్రీంకోర్టు ఇస్తున్న ఆదేశాలు, లా కమిషన్ సిఫారసులు, పౌరుల నుండి వస్తున్న సూచనలను దృష్టిలో ఉంచుకొని ఎన్నికల కమిషన్ అనేక సంస్కరణలకు శ్రీకారం చుట్టింది. ఎన్నికలలో పోటీ చేసే అభ్యర్థులకు ప్రజా ప్రాతినిధ్య చట్టాన్ని రూపొందించారు. 1950లో అమలులోకి వచ్చిన చట్టాన్ని 1951లో సవరించారు. 1966లో, 2013లో, 2016లో కూడా కీలకమైన సవరణలు చేశారు.

ఎన్ని నిబంధనలు ఉన్నా అక్రమాలకు అడ్డూ, అదుపూ లేకుండా పోయింది. అన్నీ నిరాటంకంగా సాగిపోతున్నాయి. ఎన్ని కఠిన చట్టాలున్నా ఎన్నికలలో పోటీ చేసే అభ్యర్థులు తమ ఇష్టారాజ్యంగా డబ్బు వెదజల్లి, ఓటర్లను ఆకర్షించే ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. ప్రజలను ప్రలోభాలకు గురికాకుండా చేయడం కష్టం కాబట్టి, అందుకు బాధ్యులైన వారిని భవిష్యత్తులో ఎన్నికలకు అర్హత లేకుండా చేయగలిగే నిబంధన ఉండాలి. కొన్ని స్పష్టమైన నిబంధనలున్నప్పటికీ, స్థానిక కోర్టులలో కేసులు

వీగిపోవడం ద్వారా మళ్లీ, మళ్లీ ఎన్నికల్లో అదే అభ్యర్థులు పోటీ చేస్తున్నారు. గతంలో తెలంగాణలో 47 మందిని, ఆంధ్రప్రదేశ్‌లో 40 మందిని ఎన్నికల కమిషన్ పోటీ నుండి బహిష్కరించింది.

ఈ విధంగా ప్రతి రాష్ట్రంలోనూ ఎన్నికల కమిషన్ కొంతమంది అభ్యర్థులపై బహిష్కరణ విధించింది. పార్టీల ప్రచార ఖర్చు, అభ్యర్థుల ఖర్చులో భాగంగానే చూసే విధానం రావాలి. పార్టీల ఎన్నికల మేనిఫెస్టోలలో ప్రజలకు ఇచ్చే హామీలు, ఆయా రాష్ట్రాలకు ఉన్న ఆర్థిక వనరుల ఆధారంగా ఉన్నదా లేదా, ఆదాయ వనరులను మించి, ఆర్థిక వెసులుబాటును మించి హామీలు ఇస్తున్నారా అనే విషయం కూడా ఆలోచించాలి, అది కూడా ఎన్నికల నియమ నిబంధనావళిలో భాగంగానే చూడాలి. 'ఎన్నికల కమిషన్'కు స్వతంత్రత ఉన్నప్పటికీ, వాటికి అనుబంధంగా పనిచేసే వ్యక్తులంతా రాష్ట్ర – కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులే. వీరు తమ తమ ఉద్యోగాల రీత్యా ఎన్నికల విధులలో పనిచేస్తూ ఉంటారు. ఎన్నికల కమిషన్‌కు ఒక ప్రధానాధికారి, ఇద్దరు లేదా ముగ్గురు కమిషన్ సభ్యులు ఉంటారు కాని, 'ఎన్నికల ప్రక్రియ' మొత్తం పూర్తి అయిన తర్వాత ఎన్నికల కమిషన్ పనితీరును ఎవ్వరూ పట్టించుకోరు.

ఎన్నికల కమిషన్ చేత నమోదు కాబడిన కేసులన్నీ రాష్ట్ర ప్రభుత్వ పోలీసుల చేత నమోదు కాబడి, రాష్ట్ర ప్రాసిక్యూషన్ వ్యవస్థ, కోర్టుల ద్వారా విచారణ జరుగుతుంది కాబట్టి విచారణ – నేర నిరూపణ – శిక్షా కాలపరిమితి అన్నీ కూడా 'ఎన్నికల కమిషన్'కు సంబంధం లేకుండా జరుగుతుంది. కాబట్టి నేర చరిత్ర ఉన్న అభ్యర్థులంతా ఎన్నికల కమిషన్ నియమ నిబంధనావళికి ఏమాత్రం భయపడడం లేదు. ఎన్నికల కమిషన్ ద్వారా నమోదు చేయబడిన కేసులు 'ప్రత్యేక న్యాయమూర్తి' చేత విచారణ జరిపించబడినప్పుడే కొద్దో గొప్పో ఫిర్యాదు దారులకు న్యాయం జరుగుతుంది. ఎన్నికల కేసులను విచారించడానికి ప్రత్యేక కోర్టులను ఏర్పాటు చేయాలి. ప్రత్యేక, స్వతంత్ర దర్యాప్తు సంస్థ చేత విచారణ జరపబడాలి. (నేర శిక్షా స్మృతి).

ఐపిసి సెక్షన్ 171ఎ నుంచి ఐ వరకు ఎన్నికలలో పోటీ చేసిన అభ్యర్థులు లేదా వారి అనుచరులు ఏమైనా అక్రమాలకు పాల్పడినా, డబ్బు, మద్యం, వస్తువులు, బట్టలు, చీరెలు పంచినా నమోదు చేయబడుతుంది. ఎన్నికల ప్రవర్తనా నియమావళి ఉల్లంఘించిన వారికి నేర నిరూపణ జరిగితే శిక్ష – జరిమానా లేదా రెండూ విధించబడే ప్రమాదం ఉంది. ఒకవేళ గెలిచినప్పటికీ లభించిన పదవి పోగొట్టుకొనే ప్రమాదం కూడా ఉంది.

మత, కుల, జాతి, భాష ఆధారంగా విబేధాలను సృష్టించి, వైషమ్యాలను రెచ్చగొట్టి ప్రజలలో అరాచకాలను సృష్టించాలనుకునే వారికి ఐపిసి సెక్షన్ 153 ఎ ప్రకారం కేసులు నమోదు చేయాలి. అందుకు విరుద్ధంగా దాదాపు అభ్యర్థులందరూ ఏదో ఒక మత విశ్వాసాలతో, కుల పిచ్చితో, సమూహాలతో సమావేశాలను ఏర్పాటు చేసుకొని ఓట్లను అభ్యర్థిస్తున్నారు. వాస్తవానికి గుడులలో, మసీదులలో, చర్చిలలో, మిగతా మత ప్రార్థనా మందిరాలలో ఓట్లను అభ్యర్థించడం కూడా నిషేధించాలి. వాస్తవానికి రాజకీయ పార్టీలు కూడా ఏ నియోజకవర్గంలో ఏ కులం వారి ఓట్లు అధికంగా ఉన్నాయి అనే ఆధారంగానే టికెట్లు ఇస్తున్నాయి. ఇది కూడా రద్దు కాబడాలి. ఇటీవల భారత అత్యున్నత న్యాయస్థానం – సుప్రీంకోర్టు కొన్ని ఉత్తర్వులను జారీ చేసింది. ఇప్పుడు జరుగబోతున్న 5 రాష్ట్రాల ఎన్నికలలో ఆ ఆదేశాలను అమలు చేస్తున్నారు. ప్రస్తుతం రాజస్తాన్, మధ్యప్రదేశ్, ఛత్తీస్‌గఢ్, మిజోరాం, తెలంగాణ రాష్ట్రాలకు శాసన సభ ఎన్నికలు జరుగుతున్నాయి.

సుప్రీంకోర్టు ఆదేశాల ప్రకారం ఎన్నికల బరిలో నిల్చునే అభ్యర్థులందరూ విధిగా తమ నేర చరిత్ర వివరాలను అనగా నమోదు కాబడిన కేసుల వివరాలను తప్పనిసరిగా ఎన్నికల అఫిడవిట్లలో కనబరచాలి. దానితో పాటు నేర చరిత్ర వివరాలను ప్రచారంలో ముద్రణ, ఎలక్ట్రానిక్ పరికరాల ప్రసార మాధ్యమాల ద్వారా మూడు సార్లు నియోజకవర్గ ప్రజలకు తెలిసే విధంగా ప్రకటనలు ఇవ్వాలి. అభ్యర్థులను నిలబెట్టే పార్టీలు కూడా తమ అభ్యర్థుల నేర చరిత్ర వివరాలను ప్రజలకు తెలిసేలా మూడు సార్లు తెలియజెప్పాలి. ఎన్నికల సంఘం వీటి విషయంలో జాగ్రత్తగా పరిశీలించాలని సుప్రీంకోర్టు ఉత్తర్వులు జారీ చేసింది. నిర్దేశించిన పద్ధతిలో నేర చరిత్ర వివరాలు వెల్లడించని పార్టీలను ఉపేక్షించకుండా కేసులు నమోదు చేయడానికి రాష్ట్ర ఎన్నికల ప్రధాన అధికారులకు పూర్తిగా స్వేచ్ఛ ఇచ్చింది. ఏ అభ్యర్థి అయినా తప్పుడు సమాచారం ఇచ్చినట్లు ఫిర్యాదు అందితే భారత శిక్షా స్మృతి (ఐపిసి) కింద కేసులు నమోదు చేయడం, భారీగా జరిమానాలు విధించడం ఎన్నికల అధికారులు చేయాలి. నేర చరిత్ర కలిగిన అభ్యర్థుల వివరాలను ఎన్నికల కమిషన్ ఓటర్ల ముందుకు వారికున్న డిజిటల్ సౌకర్యాల ద్వారా, వివిధ రకాల మాధ్యమాలలో ప్రచారం నిర్వహించడం ద్వారా పౌరులను చైతన్యం చేయాలి.

'మంచి అభ్యర్థిని ఎన్నుకోవడం ప్రజల ప్రజాస్వామిక హక్కు' అంటూ అభ్యర్థులకు సంబంధించిన కీలక సమాచారం అంతా వారికి వెల్లడి కావాలని 2002 లోనే భారత సుప్రీంకోర్టు చారిత్రాత్మక తీర్పునిచ్చింది. అప్పుడు అన్ని రాజకీయ పార్టీలు తమను తాము సరిదిద్దుకోవడానికి కొంత ప్రయత్నించాయి. ప్రస్తుత పార్లమెంట్‌లో 34 శాతం నేర చరిత్ర కలిగినవారు సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. పార్లమెంట్‌లో 'ప్రత్యేక చట్టం' చేయడానికి ఈ నేర చరిత్రులు ఎన్నికల సంస్కరణలకు, ఎన్నికల విధుల కేసుల విచారణకు ప్రత్యేక న్యాయస్థానాలు తేవడానికి ఎలాగూ ఒప్పుకోరు కాబట్టి నేర చరిత్రులకు చట్ట సభలలో ప్రవేశం కల్పించడం పట్ల ప్రజలను చైతన్యం చేయగలగాలి.

నిర్ణీత కాల వ్యవధిలో ఎన్నికల నిర్వహణే తప్ప మిగతా విషయాలు తమకు సంబంధం లేనట్లు ఎన్నికల కమిషన్ భావించడం కూడా తప్పే. రాష్ట్ర డిజిపి, జిల్లాల కలెక్టర్లు – జిల్లా ఎన్నికల అధికారులంతా ప్రస్తుతం అధికారంలో ఉన్న రాజకీయ పార్టీకి ఎంతో కొంత మేరకు సహకరిస్తూ ఉంటారు. దానిపట్ల ఎన్నికల కమిషన్ ఉదాసీనంగా ఉండరాదు. అధికారులు తప్పుచేస్తే దానికి శిక్ష రెండింతలు ఉండాలి. ప్రస్తుత వ్యవస్థలో రెవెన్యూ, పోలీస్, పంచాయితీరాజ్, విద్యా శాఖల అధికారులు ఎన్నికల నిర్వహణ బాధ్యతల్లో ఉంటారు. వారు రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు కాబట్టి వారు నిష్పక్షపాతంగా ఉంటారనుకోవడం పొరపాటవుతుంది. ఏది ఏమైనప్పటికీ ప్రజలలో చైతన్యం, భావజాల మార్పు, భావ దారిద్ర్యం పోనంతవరకూ ఈ పరిస్థితి కొనసాగుతుంది.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యుడు)* వీ

# విషపు కోరల మధ్య మహిళ

*భారత్, పాకిస్తాన్ దేశాలలో ఆచార సంప్రదాయాల పేర పాలకులు తమ రాజకీయ ప్రయోజనాల కోసం మహిళల ప్రాథమిక హక్కులను హరిస్తున్నారని అంటున్నారు* **అర్విణి రాజేంద్రబాబు**

భారత్, పాకిస్తాన్ దేశాలు రెండూ కవల పిల్లలు. ఈ రెండింటిలో ఇటీవల చోటుచేసుకున్న కొన్ని సామాజిక పరిణామాలలో పోలికలు ఉండడం, ఆ పరిణామాలు 'మహిళ'ల చుట్టే పరిభ్రమించడం విడ్డూరం. మొదట పాకిస్తాన్ విషయం ప్రస్తావిస్తాను. ఆసియా బీబీ అన్న 53 ఏళ్ల మహిళ లాహోర్ పట్టణ సమీపంలోని ఓ పల్లెటూరులో పొలాల్లో పండే నేరేడు పళ్లను ఏరుకొని జీవించే ఓ వ్యవసాయ కూలి. ఆమె క్రిస్టియన్ మతస్థురాలు. అయిదుగురు సంతానానికి జన్మనిచ్చిన తల్లి. ఓ క్రైస్తవ మత సంబంధమైన పండగ సందర్భంలో నేరేడు పళ్ల రసాన్ని తోటి కూలీలకు ఇవ్వబోయింది. తమ మతానికి చెందని ఓ మహిళ, ఏసుక్రీస్తుకు నైవేద్యంగా పెట్టిన పదార్థాన్ని తమకు ప్రసాదంగా ఇస్తుందని కోపగించుకున్న తోటి మహిళలు 'నువ్వు మహమ్మద్ ప్రాఫెట్‌ను, ఖురాన్‌ను అవమానిస్తున్నావని' ఆమెతో వాదులాటకు దిగారు. కొన్ని మత శక్తులు ఆమెను మతం మార్చుకొని ముస్లింగా మారమని బలవంత పెట్టాయి. ఆమె మొండిగా నిరాకరించింది. దాంతో ఆమె మీద దైవ దూషణ నేరం మోపి ఆమెను జైలుపాలు చేశారు. ఏకంగా కింది కోర్టు ఉరిశిక్షనే ఖరారు చేసింది. ఆమెకు అనుకూలంగా వాదించిన వకీళ్లను, సానుకూలంగా వ్యవహరిద్దామని భావించిన జడ్జీలను మూకుమ్మడి దాడులలో చంపడమో, బెదిరించడమో జరిగింది. చివరికి ఈ అక్టోబర్ (2018) మాసంలో సుప్రీంకోర్టు ఆమెను నిర్దోషిగా తేల్చింది. 'తహరీక్ – ఎ – లబ్బాయిక్ పాకిస్తాన్' అన్న అతివాద సంస్థ అధ్యక్షుడు ఖాదిమ్ హుస్సేన్ రిజ్వి ఆసిమా బీబీని విడుదల చేయమని తీర్పునిచ్చిన న్యాయమూర్తులను ఖతం చేయండని పిలుపునిచ్చాడు. ఆ పిలుపునందుకొని సుప్రీంకోర్టుకు వ్యతిరేకంగా తీవ్రమైన అల్లర్లు చెలరేగాయి. కొద్ది రోజులు పాకిస్తాన్‌లో ప్రజా జీవనం స్థంభించి పోయింది. కొత్తగా ఎన్నికైన ప్రధాని ఇమ్రాన్ ఖాన్ ప్రజలకు టివిల ద్వారా శాంతిని నెలకొల్పమని చేతులు జోడించి వేడుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. ప్రపంచంలో చాలా దేశాలు ఆసియా బీబీకి, ఆమె కుటుంబానికి ఆశ్రయమిచ్చేందుకు సిద్ధపడ్డాయి. కాని, పాకిస్తాన్ ప్రభుత్వం అల్లరి మూకలకు ప్రాతినిథ్యం వహిస్తున్న సంస్థలతో ఒప్పందం కారణంగా ఆసియా బీబీ దేశం వదలడానికి వీసా ఇచ్చేందుకు నిరాకరిస్తున్నది. సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును పునఃసమీక్షించమని కోరుతూ ఓ వ్యాజ్యం పాకిస్తాన్‌లో దాఖలయ్యింది. ఎలాంటి తీర్పు వస్తుందోనని ఎదురుచూస్తూ ఆసియా బీబీ జైళ్లోనే మగ్గుతున్నది. ఆమె భర్త, పిల్లలు దేశం వదిలిపెట్టి, ఇంగ్లాండ్ దేశం ఆశ్రయమిస్తే అక్కడ కాలం గడుపుతున్నారు. ఆమె తరఫున సుప్రీంకోర్టులో వాదించిన వకీలు సైఫ్ ఉల్ – మాటాక్ మూకలకు భయపడి నెదర్లాండ్ పారిపోయాడు.

ఒక అంచనా ప్రకారం 1990 నుండి దైవ దూషణ నేరం కింద అల్లరి మూకలు చేసిన మూకుమ్మడి హత్యలలో దాదాపు 60 మంది ప్రాణాలు పోగొట్టుకున్నారు. 1997లో దైవ దూషణ నేరారోపణ చేయబడ్డ నిందితునిపై కేసు కొట్టివేసినందుకు ఒక జడ్జి ప్రాణాలు కోల్పోయాడు. అలాగే, ఆసియా బీబీకి అనుకూలంగా మాట్లాడినందుకు పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్ర గవర్నర్ సల్మాన్ తాసీర్‌ను ఆయన అంగరక్షకుడే కాల్చి చంపాడు. మంత్రి వర్గంలో ఉన్న ఏకైక క్రైస్తవుడు, మైనారిటీల సంక్షేమ శాఖ మంత్రి షాబాజ్ భట్టి 2011 మార్చి నెలలో మూకల దాడిలో ప్రాణాలు కోల్పోయాడు. వీరిద్దరూ దైవ దూషణ చట్టానికి వ్యతిరేకంగా, ఆసిమా బీబీకి అనుకూలంగా మాట్లాడినవాళ్లు.

అయితే, పాకిస్తాన్‌లో ఈ విపరీత పరిస్థితికి కారణం వేల సంఖ్యలో ఉన్న అల్లరి మూకలే కాని, కోట్లాది మంది పాకిస్తానీయులు ఆసిమా బీబీకి అన్యాయం జరిగిందని, దైవ దూషణ చట్టం అప్రజాస్వామికమని న్యాయం, సమానత్వం, కరుణలను బోధించే ఇస్లాం సిద్ధాంతాలకు వ్యతిరేకమని భావిస్తున్నారు. ఇందుకు నిదర్శనం ఈ అల్లర్లకు నాయకత్వం వహించిన తహరీన్ – ఎ – లబ్బాయిక్ పాకిస్తాన్ పార్టీ మొన్న జరిగిన సాధారణ ఎన్నికలలో జాతీయ అసెంబ్లీకి 170 మంది అభ్యర్థులను నిలబెడితే, వారిలో ఒక్కరు కూడా గెలవలేదు సరికదా వారిలో ఎవరికీ డిపాజిట్ కూడా దక్కలేదు.

ఇక, భారతదేశం విషయానికొస్తే, మహిళల శరీరాలే భూమికగా రెండు పరిణామాలు సంభవించాయి. పాకిస్తాన్‌లో సుప్రీంకోర్టు తీర్పుకు వ్యతిరేకంగా అల్లర్లు చెలరేగినట్లే, ఇక్కడ శబరిమల ఆలయంలోకి వయోభేదం లేకుండా మహిళలందరూ ప్రవేశించవచ్చని సుప్రీంకోర్టు ఆజ్ఞలు జారీ చేస్తే, పది నుండి యాభై సంవత్సరాల మధ్య వయస్సున్న స్త్రీలను మేం ససేమిరా ఆలయంలోకి అడుగుబెట్టనివ్వబోమని బిజెపి, కాంగ్రెస్ ప్రేరేపిత అయ్యప్ప భక్తులు భీష్మించుకొని కూర్చొని నానా హంగామా చేశారు. ఆలయ ప్రవేశం చేద్దామనుకున్న స్త్రీలను అడ్డుకున్నారు. మహిళా ఉద్యమ నాయకురాలు తృప్తి దేశాయి విమానాశ్రయం నుండి ఆలయ ప్రాంగణం వరకు వెళ్లడానికి టాక్సీ డ్రైవర్లు కూడా ఆమెను తీసుకెళ్లడానికి (అల్లరి మూకలకు భయపడి) నిరాకరించడంతో మరోదారి లేక తిరిగి వెళ్లిపోయిన పరిస్థితి. శబరిమల అయ్యప్ప దేవాలయంలోకి ప్రవేశించే మహిళ శరీరాన్ని రెండు ముక్కలు చేసి ఒక ముక్క సుప్రీంకోర్టులో, మరో ముక్క కేరళ ముఖ్యమంత్రి నివాసంలో గిరవాటు కెయ్యాలని ఒక మంత్రి పుంగవుడే సెలవిచ్చాడంటే ఏ స్థాయిలో మత భావనలను రెచ్చగొట్ట ప్రయత్నిస్తున్నారో అర్థమవుతున్నది.

రుతుస్రావం మహిళలకు ప్రకృతి సహజం. ఆ సమయంలో దేవాలయాలకు వెళ్లే హిందూ స్త్రీలు ఎవరూ దైవ దర్శనాలకు వెళ్లరు. అయినా, రుతుస్రావం జరగడానికి అవకాశమున్న ఆ వయస్సు వారెవ్వరూ అయ్యప్ప ఆలయంలోకి ప్రవేశించరాదు అన్న నిబంధన

# ఆర్‌బిఐపై మోడీ వ్యూహాత్మక దాడి

***కేంద్ర ప్రభుత్వం ఆర్‌బిఐ స్వయం ప్రతిపత్తిని ధ్వసం చేస్తూ, ప్రభుత్వ బ్యాంకుల్లోని డబ్బును కార్పొరేట్ సంస్థలకు చేరవేసి బ్యాంకులను దివాళా స్థితికి చేర్చి మిగిలిన డబ్బును కూడా ఎన్నికల ముందు పథకాలకు వాడుకునే ప్రయత్నం చేస్తోందని అంటున్నారు* సంతోష్**

ద్రవ్య సంబంధమైన విధానాన్ని నియంత్రించే భారత రిజర్వు బ్యాంక్ (ఆర్‌బిఐ), తమ అసమర్ధతను బ్యాంక్‌పై రుద్దడానికి ప్రయత్నించే భారతప్రభుత్వం మధ్య భిన్నాభిప్రాయాలు, వివాదాలు కొత్తకాదు. కేంద్రానికి, ఆర్‌బిఐకి మధ్య గతంలోనూ విభేదాలు తలెత్తిన సందర్భాలున్నాయి. 1937లో అప్పటి ఇంపీరియల్ బ్యాంకు గవర్నర్‌కు ప్రభుత్వానికి మధ్య తలెత్తిన విభేదాల కారణంగా గవర్నర్ స్మిత్ రాజీనామా చేశాడు. 1957లో అప్పటి ఆర్థిక మంత్రి కృష్ణమాచారితో విభేదాల కారణంగా ఆర్‌బిఐ గవర్నర్ సర్ బెనగల్ రామారావు రాజీనామా చేశారు. యుపిఎ హయాంలో ఆర్థిక మంత్రి చిదంబరానికి ఆర్‌బిఐ గవర్నర్లు వై.వి. రెడ్డి, డి.సుబ్బారావులతో ఏకీభావం కుదరని ఘట్టాలున్నాయి. మోడీ హయాంలో ఆర్‌బిఐకి, కేంద్ర ప్రభుత్వానికి మధ్య వడ్డీరేట్ల నుండి లిక్విడిటీ, బ్యాంకింగ్ నిర్వహణ వంటి పలు కీలకాంశాలపై భేదాభిప్రాయాలు ఉన్నాయి. రఘురామ్ రాజన్‌తో మొండి బాకీల నిర్వహణ, పెద్దనోట్ల రద్దు వంటి విషయాల్లో కేంద్రం తగువు పడింది. ఇప్పుడు ఏకంగా మోడీ సర్కారు గతంలో ఎప్పుడూ లేనివిధంగా ఆర్‌బిఐని తన చెప్పుచేతల్లో ఉంచుకోవడం ద్వారా దాని స్వయం ప్రతిపత్తిని హరించే యత్నాలకు ప్రయత్నించడం రాజ్యాంగ విరుద్ధమేనని చెప్పక తప్పదు.

1926లో రాయల్ కమిషన్ ఆన్ ఇండియన్ కరెన్సీ అండ్ ఫైనాన్స్ సిఫార్సుల మేరకు ఆర్‌బిఐ ఏర్పడింది. దీనికోసం 1934లో చట్టం చేశారు. ఈ బ్యాంకు 1935 ఏప్రిల్ 1 నుంచి పని చేస్తోంది. దీని కార్యాలయం మొదట్లో కోల్‌కతాలో ఉండేది. తర్వాత దీనిని బొంబాయికి మార్చారు. 1949లో జాతీయం చేయబడి ప్రభుత్వం ఆధీనంలోకి వచ్చింది. 1990వ దశకం ఆరంభంలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలు అమలులోకి వచ్చాక ప్రతి దేశంలోను కేంద్ర బ్యాంకులకు 'స్వేచ్ఛ' ఉండాలని ప్రపంచ బ్యాంకు (డబ్ల్యుబి), అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (ఐఎంఎఫ్)లు డిమాండ్ చేస్తున్నాయి. అంటే దానిని అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ప్రయోజనాలను కాపాడేదిగా మార్చాలి. అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి అవసరాలకు అనుగుణంగా దేశ సార్వభౌమత్వం కుదింపునకు గురవుతుందన్న కారణంచేతనే ఈ డిమాండ్‌ను ప్రజాతంత్ర శక్తులు బలంగా వ్యతిరేకిస్తున్నాయి. రిజర్వ్‌బ్యాంక్ పై జాతీయ అధికార పరిధి ఉండాలని అంటున్నామంటే కార్పొరేట్–ఫైనాన్షియల్ వర్గంతో కుమ్మక్కయిన భారత ప్రభుత్వ అధికారమన్న భావనమాత్రం కాదు. ప్రజా ప్రయోజనాల కోసం రిజర్వ్ బ్యాంకుపై సామాజిక నియంత్రణ ఉండాలి. సామాజిక నియంత్రణలో పార్లమెంటరీ పర్యవేక్షణ అంతర్భాగం కావాలి. అందుకు కావలసిన సంస్థాగత నిర్మాణం ద్వారా అది ప్రజలకు జవాబుదారీగా ఉండాలి.

మోడీ ప్రభుత్వం రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియాను బలహీనపర్చడానికి పూనుకుంది. ఆర్‌బిఐ అధికారాలు కత్తిరించడానికి ద్రవ్య విధాన చట్రం (ఇసిఎఫ్) ఏర్పాటు, డైరెక్టర్ల బోర్డులోకి ఆర్‌ఎస్‌ఎస్ అభిమానుల నియామకం వంటి చర్యలు అందుకు నిదర్శనం. దాన్ని పూర్తిగా జేబుసంస్థగా మార్చడానికి చేస్తున్న ప్రభుత్వ ప్రయత్నాలపై కొంతకాలంగా దేశవ్యాప్తంగా దుమారం చెలరేగుతోంది. ప్రజాస్వామిక, రాజ్యాంగ సంస్థలను బలహీనంచేసి, చివరికి ధ్వంసంచేసి మితవాద ఫాసిస్టు పద్ధతుల్లో నిర్మించడం ఆర్‌ఎస్‌ఎస్ లక్ష్యం. భారత రాజ్యాంగం సమగ్రమైనది కాకపోయినా ప్రజలకు కొన్ని హక్కులు కల్పించింది. ఆ హక్కుల వినియోగం కోసం కొన్ని రాజ్యాంగ సంస్థలు ఏర్పాటయ్యాయి. అవి ఆర్‌ఎస్‌ఎస్ ఏజెండాకు, కార్పొరేట్ ప్రయోజనాలకు, అవినీతి అక్రమాలకు పాల్పడేవారికి అడ్డుగా ఉన్నాయి. అందువల్ల అంతిమంగా రాజ్యాంగాన్ని మితవాద, ఫాసిస్టు పద్ధతుల్లో పునర్నిర్మించడం కోసం ముందుగా ఈ రాజ్యాంగ సంస్థలను నాశనం చేయడానికి పూనుకుంటు న్నారు. మోడీ ప్రభుత్వం చేస్తున్న ఈ చర్యల వెనుకనున్న సారాంశం ఇదే.

**ఆర్‌బిఐ – మోడీ ప్రభుత్వం మధ్య వివాదాంశాలు**

మోడీ ప్రభుత్వం వడ్డీరేటు తగ్గించాలని కోరుకుంటుంది. ద్రవ్యోల్బణం నియంత్రణ ప్రధానమని రిజర్వుబ్యాంక్ భావిస్తుంది. దేశంలో ప్రభుత్వ

---

మహిళల పట్ల మతం చూపే వివక్షకు అద్దం పడుతుంది. పితృస్వామిక వ్యవస్థ స్త్రీల పట్ల చూపే భేదభావం మత కట్టడిల ద్వారా, ఆచారాల ద్వారా సమర్ధించుకుంటుంది. దీనికి రక్షకునిగా నిలిచే మతవాద రాజకీయం జడలువిప్పి కేరళలో నాట్యం చేసింది.

మహిళల శరీరాలకు సంబంధించి మరొక ఘటన అమెరికాలో ప్రారంభమై పలు దేశాలకు పాకిన 'మీటూ' ఉద్యమంలో భారతీయ మహిళలు కూడా భాగస్వామ్యం కావడం. ఈ ఉద్యమం ఒకప్పటి ప్రముఖ జర్నలిస్టు అయిన కేంద్ర మంత్రి ఎం.జె. అక్బర్ రాజీనామాకే దారితీసింది. చాలా వ్యాపార సంస్థలలో ఉన్నత స్థాయిలో ఉన్న వారు కూడా దీర్ఘకాల సెలవులలో వెళ్లిపోయే పరిస్థితికి కారణం అయింది ఈ ఉద్యమం. మహిళల శరీరాలు తమ సొత్తుగా భావించే పురుష సమాజానికి ఒక సవాలుగా ఈ ఉద్యమం వ్యాప్తి చెందుతున్నది. ఇది పురుష సమాజంలో వ్యవస్థీకృతంగా నిబిడీకృతమై ఉన్న ఆలోచనలలో మార్పు తెచ్చే దిశగా పయనిస్తే దీనికి అర్థం పరమార్థం ఉంటుంది. మహిళా స్వాతంత్ర్యం సాధించడానికి సమకాలీనంగా నడుస్తున్న రాజకీయ ఉద్యమం ఇంకా ప్రారంభ దశలోనే ఉంది. ఆ రాజకీయ ఉద్యమానికి 'మీటూ' ఉద్యమం మద్దతుగా ఉంటుందనడంలో సందేహం లేదు.

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్)* వీ

బ్యాంకుల నుండి రుణాలు తీసుకున్న బడా సంస్థలు, పారిశ్రామికవేత్తలు వాటిని తిరిగి చెల్లించడంలో నిర్లక్ష్యంగా వ్యవహరించడం, తీసుకున్న రుణాలు ఎగవేయడం వంటి కారణాలతో ప్రభుత్వరంగ బ్యాంకులు భారీస్థాయిలో నిరర్థక ఆస్తుల సమస్యతో (10.5 లక్షల మొండి బకాయిలతో) ఎదురీదుతున్నాయి. ఈ సమస్యకు రిజర్వ్ బ్యాంక్ అలసత్వమే కారణమని ప్రభుత్వం ఆరోపిస్తుంటే ప్రభుత్వ రంగ బ్యాంకులపై తమకు అధికారాలు లేవని రిజర్వ్ బ్యాంక్ చెబుతోంది. 1949 నాటి బ్యాంకింగ్ నియంత్రణ చట్టం మొదలు 1980 నాటి బ్యాంకుల జాతీయకరణ శాసనం వరకు కేంద్రం ఆదేశాలు లేనిదే బ్యాంక్ బోర్డులు అడుగు ముందుకు వేసే అవకాశం లేదన్నది సుస్పష్టం.

ఇప్పటి వరకు రిజర్వ్ బ్యాంక్ తన విధుల్లో భాగంగా ద్రవ్య పరపతి విధానాన్ని కేంద్ర ప్రభుత్వ జోక్యం లేకుండా ప్రకటిస్తోంది. కానీ 2016లో ద్రవ్య పరపతి విధానాన్ని ప్రకటించేందుకు ప్రభుత్వం ముగ్గురు సభ్యులతో కూడిన ద్రవ్య పరపతి విధాన సమీక్ష కమిటీ (ఐసిఎఫ్)ని ఏర్పాటు చేసింది. దీంతో అప్పటి వరకు ద్రవ్య విధానాన్ని స్వతంత్రంగా ప్రకటించే ఆర్‌బిఐ స్వతంత్రతపై ప్రభుత్వం జోక్యం కలుగజేసుకున్నట్లయింది. ఆర్‌బిఐ దగ్గర ఉన్న నిధులన్నింటిని బడ్జెట్, ద్రవ్యలోటు భర్తీ చేసుకోవడానికి బదిలీ చేయాలని ఆర్థికమంత్రి జైట్లీ కొంతకాలంగా డిమాండ్ చేస్తున్నారు. ఇటీవల ప్రభుత్వానికి అనుగుణంగా రిజర్వ్ బ్యాంక్ వ్యవహరించకపోవడం వలన రిజర్వ్ బ్యాంక్‌పై తన పట్టును పెంచుకోవడానికి కేంద్ర ఆర్థిక శాఖ రిజర్వ్ బ్యాంక్ చట్టం-1934లోని సెక్షన్-7ను ఉపయోగించుకోవడానికి అడుగులు వేయడంతో రిజర్వ్ బ్యాంక్ స్వతంత్ర అంశం ఇప్పుడు వివాదంగా మారింది.

2016 సెప్టెంబర్ 3న రఘురామ్ రాజన్‌ను తన పదవికి రాజీనామా చేసేలా చేసిన తరువాత ఆయన స్థానంలో నియమించబడిన ఉర్జిత్ పటేల్ మోడీకి అనుకూలుడైన వ్యక్తి అయినప్పటికీ ఆయనకు ఎటువంటి ప్రాధాన్యతా లేకుండా పోయింది. సందేహాస్పద రుణాలను ఇప్పించి జాతీయ బ్యాంకులను నిస్సహాయ స్థితిలోకి నెట్టింది మోడీ ప్రభుత్వం. గత కొంతకాలంగా రిజర్వ్‌బ్యాంక్ పాత్రను కుదించే ప్రయత్నం చేస్తున్నది. నోట్ల రద్దు నిర్ణయంలో తన విధిలో భాగంగా కనీసం ఆ విషయాన్ని ప్రకటించే అవకాశం కూడా ఆయనకు ఇవ్వలేదు. అందుకు బదులుగా హడావిడిగా మోడీయే స్వయంగా నోట్ల రద్దుకు సంబంధించిన ప్రకటన చేశారు. యావత్తు నగదు బ్యాంకింగ్ వ్యవస్థకు చేరిందని ఆలస్యంగానైనా రిజర్వ్ బ్యాంకు చేసిన ప్రకటనతో నల్ల ఆర్థిక వ్యవస్థ నడ్డివిరిచారని చెబుతున్న ప్రభుత్వ ప్రగల్భాల డొల్లతనం బయటపడింది.

ఆర్‌బిఐ స్వయం ప్రతిపత్తిని దెబ్బతీసి దేశ, విదేశీ కార్పొరేట్ సంస్థలకు ఊడిగం చేయాలని మోడీ ప్రభుత్వం ప్రయత్నం చేస్తోంది. లక్షల కోట్ల రూపాయలు బ్యాంకులకు ఎగనామం పెట్టిన కార్పొరేట్ సంస్థలకు తిరిగి రుణాలు ఇవ్వాల్సిందేనని హుకూం జారీ చేసింది. ఆర్‌బిఐ చేపట్టిన 'సత్వర దిద్దుబాటు ప్రక్రియను' అమలు చెయ్యొద్దని ఆదేశాలు ఇచ్చింది. లక్షల కోట్ల రూపాయల సొమ్ము డివిడెండ్ రూపంలో ప్రభుత్వ ఖజానాకు బదిలీ చేయాలని ఒత్తిడి పెంచింది. ఇది చట్ట విరుద్ధమని వేలెత్తి చూపినందుకు ఆర్‌బిఐ బోర్డు డైరెక్టర్‌గా ఉన్న సబిత్ కేత్‌మోర్‌పై వేటు వేసింది. ఆయన స్థానంలో పరివార్ మనిషి గురుమూర్తిని పార్ట్‌టైమ్ డైరెక్టర్‌గా నియమించింది. ఈ నియంతృత్వ చర్యలను వ్యతిరేకిస్తున్నందుకు ఆర్‌బిఐ గవర్నర్‌ను తప్పించేందుకు కుట్రలు చేస్తోంది. ఆర్‌ఎస్‌ఎస్, సంఘ పరివార్ శక్తులు ప్రభుత్వ అరాచక చర్యలకు వత్తాసు పలుకుతూ ఆర్‌బిఐపై నానాయాగి చేస్తున్నాయి.

ఆర్‌బిఐ డివిడెంట్స్ కింద సుమారు రెండున్నర లక్షల కోట్ల రూపాయలు గత నాలుగేళ్లలో కేంద్రానికి ఇచ్చింది. ఇప్పుడు ఉన్న నిల్వలు కేంద్రానికి ఇవ్వటానికి ఇక సాధ్యం కాదని ఆర్‌బిఐ తేల్చి చెప్పింది. ఆర్‌బిఐ తనకు వచ్చిన లాభాల్లో సగం మాత్రమే ప్రభుత్వ ఖజానాకు డివిడెండ్ రూపంలో జమ చేయడంపై ప్రభుత్వం ఆగ్రహించింది. సంక్షోభాలు తలెత్తితే ఎదుర్కోడానికి వీలుగా లాభాల్లో సగభాగం తనవద్ద ఉంచుకోవడం సబబేనని ఆర్‌బిఐ వాదిస్తున్నది. ఈ నేపథ్యంలో బ్యాంకింగ్ వ్యవస్థను ప్రక్షాళించేందుకు, ప్రభుత్వ రంగ బ్యాంకులను నియంత్రించేందుకు, ఆర్థిక స్థిరత్వం సాధించేందుకు ఆర్‌బిఐకి మరిన్ని అధికారాలు కావాలని ఆర్‌బిఐ డిప్యూటీ గవర్నర్ విరాళ్ ఆచార్య గొంతు విప్పారు. రఘురామ్ రాజన్ నుంచి విరాళ్ ఆచార్య వరకూ అందరూ కోరుతున్నదీ ఇదే. ఆర్‌బిఐ స్వేచ్ఛగా పనిచేసేందుకు, మరింత బలోపేతమయ్యేందుకు సహకరించకపోగా, దాన్ని మరింత బలహీనపరుస్తూ, ప్రభుత్వ తప్పిదాలకు ఆర్‌బిఐని దోషిని చేయాలని చూస్తున్నది మోడీ సర్కారు.

ఇటీవల ఐఎల్ అండ్ ఎఫ్ఎస్ దివాళ అనంతరం బ్యాంకుల రుణాలపై ఆర్‌బిఐ పలు ఆంక్షలు విధించింది. చిన్న-మధ్యతరహా పరిశ్రమలు, సూక్ష్మరుణ కంపెనీలకు నిధుల కొరత ఏర్పడటంతో నిధుల లభ్యత పెంచడానికి చర్యలు తీసుకోవాలన్న ప్రభుత్వ సూచనను రిజర్వు బ్యాంక్ పాటించకపోవడంతో స్పర్ధలు పెరిగాయి. ఆర్‌బిఐ డిప్యూటీ గవర్నర్ విరాల్ ఆచార్య నవంబర్ 2 నాడు ముంబైలో ఎ.డి.ష్రాఫ్ స్మారకోపన్యాసం చేస్తూ స్వతంత్ర సెంట్రల్ బ్యాంక్ ప్రాముఖ్యతను వక్కాణించారు. సెంట్రల్ బ్యాంక్ స్వతంత్రత అనే పవిత్ర సూత్రాన్ని ఉల్లంఘించడానికి సాహసించిన దేశాల దయనీయ స్థితిని, ముఖ్యంగా అర్జెంటీనాలో 2010 పరిణామాలను ప్రస్తావించారు. రెగ్యులేటర్ స్వతంత్రతను దెబ్బతీస్తే కాపిటల్ మార్కెట్లలో విశ్వాస సంక్షోభం తలెత్తుతుందన్నారు. ఆర్‌బిఐ గవర్నర్ ఉర్జిత్ పటేల్ సూచనపైనే ప్రసంగానికి తాను ఈ అంశాన్ని ఎంచుకున్నట్లు ఆచార్య ఆదిలోనే చెప్పడం విశేషం. అంటే అది తన వ్యక్తిగత అభిప్రాయం కాదని చెప్పకనే చెప్పారు.

బ్యాంకుల్లో నిధుల కొరత సమస్యతోపాటు నిరర్థక ఆస్తుల కేసులను దివాలా ట్రిబ్యునల్‌కు నివేదించడానికి ఆర్‌బిఐ విధించిన గడువుకూడా అనేక కంపెనీలకు ఇబ్బందికరంగా తయారైంది. రుణాల రీషెడ్యూల్‌ను ఆర్‌బిఐ ఒప్పుకోలేదు. ముఖ్యంగా విద్యుచ్ఛక్తిరంగంలో నిరర్థక ఆస్తుల విషయంలో రూల్స్‌ను సడలించాలని ప్రభుత్వం కోరుతోంది. దేశంలో 21 ప్రభుత్వరంగ బ్యాంకులుండగా, 11 బ్యాంకుల్లో పిసిఏ నిబంధనల ప్రకారం ఆర్‌బిఐ ఆంక్షలు విధించింది. మూలధన నిష్పత్తి (సిఏఆర్), నిరర్థక ఆస్తులు (ఎన్‌పిఏలు), ఆస్తులపై ఆదాయ వ్యయాలు (ఆర్ఓఏ), ఈ మూడింట్లో దేనిలో విఫలమైనా ఆ బ్యాంకుపై ఆర్‌బిఐ ఆంక్షలు విధిస్తుంది. అయితే అంతర్జాతీయ ప్రమాణాల ప్రకారం కేవలం మూలధన నిష్పత్తి (సిఏఆర్) నిర్వహణలో విఫలమైనప్పుడు మాత్రమే సత్వర దిద్దుబాటు చర్యల (పిసిఏ)ను వర్తింపజేయాలని ప్రభుత్వం కోరుతోంది. అంటే, ఒక విధంగా ఇది ఆర్‌బిఐ స్వతంత్ర నిర్ణయంలో జోక్యంగానే భావించవలసి ఉంటుంది.

అంతర్జాతీయంగా క్రూడ్ ధర పెరిగిపోవడం, డాలరుతో రూపాయి మారకపు విలువ తీవ్రంగా పతనం చెందడం, నిరర్థక ఆస్తుల వల్ల

బ్యాంకులు ఖాళీ అయిపోవడం వంటి కారణాలతో కేంద్రం తీవ్ర ఆర్థిక సమస్యల్లో చిక్కుకున్నది. ఈ సమయంలో రిజర్వ్ బ్యాంక్ వద్ద గల అపారమైన నిధులను ధారాళంగా విడుదల చేయించి బ్యాంకులను, నాన్ బ్యాంకింగ్ ఫైనాన్స్ కార్పొరేషన్లను గట్టెక్కించాలని ప్రభుత్వం ఆశిస్తుంది. ఆర్‌బిఐ పెద్దలు మాత్రం ఇందుకు విరుద్ధంగా ఆలోచిస్తున్నారు. ఇప్పటికే బ్యాంకులకు భారీ ఎత్తున నగదు సౌలభ్యం కల్పించామని మరింత ధన ప్రవాహాన్ని అనుమతిస్తే వాటిని కట్టడి చేసి క్రమశిక్షణలో పెట్టాలనే లక్ష్యం నీరుగారుతుందని వారు భావిస్తున్నారు. నాన్ బ్యాంకింగ్ సంస్థల వద్ద తగినంత నగదు లేకపోవడం వల్ల వాటి రుణ వితరణ ఈ మధ్య దారుణంగా పడిపోయిందని సూక్ష్మ, చిన్న, మధ్యతరహా పరిశ్రమలకు గడ్డు పరిస్థితి ఎదురవుతున్నదని ప్రభుత్వం అంటుంది. ఎప్పటికీ వసూలు కాని బకాయిల భారం కింద కుంగిపోయిన బ్యాంకులకు గడువులోగా చక్కదిద్దుకోవాలని రిజర్వు బ్యాంక్ అల్టిమేటమ్ ఇచ్చింది. ఆర్‌బిఐ ఇలా బ్యాంకులను ఆదేశించడం కేంద్ర ప్రభుత్వానికి బొత్తిగా నచ్చడం లేదు.

ఆర్‌బిఐ వద్ద గల నగదు నిల్వలు (దాని వద్ద గల పలు రకాల ఇతర నిధులు కలిసి) 9 లక్షల 59 వేల కోట్ల రూపాయలని అంచనా. ఇది దాని మొత్తం ఆస్తుల విలువలో 28 శాతం. 1990 తర్వాత ఎప్పటికప్పుడు పెరుగుతూ వచ్చిన బంగారం ధరలను అనుసరించి ఈ నిల్వల విలువ ఈ స్థాయికి చేరింది. రిజర్వు బ్యాంకు బ్రిటిష్ వారి హయాంలో కేవలం 5 కోట్ల రూపాయల మూలధనంతో ఆర్‌బిఐ ప్రారంభమయింది. 1990 దశకంలో బంగారం నిల్వలను కూడా తెగ నమ్ముకుంటేగాని దిగుమతి బిల్లులు చెల్లించలేని అత్యంత దురవస్థకు దేశం చేరుకున్నది. అప్పుడు సైతం సెక్షన్ 7 కింద ఆర్‌బిఐ మెడలు వంచి దాని వద్ద గల నిల్వలను కేంద్రం తీసుకోవడం జరగలేదు. దీనికంతటికీ మూలం అదుపు తప్పిపోయిన దేశ ఆర్థిక క్రమశిక్షణలో ఉందన్నది సుస్పష్టం. రాజకీయంగా, ఇతరత్రా పలుకుబడి కలిగిన విజయ్‌మాల్యాలు, నీరవ్ మోడీల వంటి బడా బాబులకు ఒకవైపు అపరిమితంగా పన్ను రాయితీలు కల్పించడం మరొకవైపు బ్యాంకుల ద్వారా కోరినంత డబ్బు ఉదారంగా అప్పులివ్వడం వల్ల ఈ దుస్థితి సంభవించింది.

రిజర్వ్ బ్యాంకు వెలుపల క్రెడిట్, డెబిట్ కార్డులు, ఇతర డిజిటల్ సాధనాల కారణంగా అభివృద్ధి అయిన పేమెంట్ వ్యవస్థను నియంత్రించడానికి ఉద్దేశింపబడిన ఒక స్వతంత్ర పేమెంట్స్ రెగ్యులేటరీ బోర్డు (పిఆర్‌బి)ను నెలకొల్పాలనే ప్రతిపాదనను ఆర్థిక మంత్రిత్వ శాఖలోని ఆర్థిక వ్యవహారాల విభాగం కార్యదర్శి అధ్యక్షతన నియమింపబడిన ఇంటర్ మినిస్టీరియల్ కమిటీ సిఫార్సు చేసింది. ఈ కమిటీ నివేదికను పబ్లిక్ డొమైన్‌లో ఉంచారు. రిజర్వ్ బ్యాంకు ఈ నివేదికలోని అంశాలను పత్రికాముఖంగా ఖండించింది. దేశంలో నగదు సరఫరాతోసహా ద్రవ్య విధానాన్ని (మానిటరీ పాలసీ) రూపొందించవలసిన బాధ్యత రిజర్వ్ బ్యాంకుపై ఉంటుంది. చెల్లింపుల వ్యవస్థ నియంత్రణను దాని పరిధి నుంచి వేరుచేయట మంటే రిజర్వ్ బ్యాంక్ అధికారాలను కుదించడమే అవుతుంది. దీనితో అనేక సంస్థల ఆవిర్భావానికి దారితీసి గందరగోళ పరిస్థితులు ఏర్పడతాయి.

కేంద్ర ప్రభుత్వం అనాలోచితంగా ఆర్థిక నిర్ణయాలు, పథకాలను ప్రకటిస్తూ వాటికి తగ్గ నిధులు లేకపోవడంతో ఆర్‌బిఐ నిధులకు ఎసరు పెడుతూ వస్తున్నట్టుగా తెలుస్తోంది. వ్యయాలను అదుపు చేసుకోవడంలో విఫలమవుతున్న కేంద్రం ఖర్చులకు అవసరమైన నిధుల కోసం అందుబాటులో ఉన్న అన్ని ఆర్థిక వనరులను అడుగంటిస్తూ వస్తోంది. ద్రవ్య, కరెంట్ అకౌంట్ లోటు పెరగడానికి ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలే కారణం. ప్రభుత్వం దేశ, విదేశీ బడా సంస్థలకు ప్రతి సంవత్సరం బడ్జెట్‌లో ఆరు లక్షల కోట్ల రూపాయలకు పైగా రాయితీలు ఇస్తున్నది. సెజ్‌లు, పారిశ్రామిక కారిడార్లు తదితర పేర్లతో పారిశ్రామికవేత్తలకు లెక్కలేనన్ని రాయితీలను కట్టబెడుతున్నది. పెట్టుబడిదారులు, బడా వ్యాపారుల నుండి తక్కువ పన్నులు వసూలు చేస్తున్నది. ఫలితంగా ద్రవ్యలోటు ఏర్పడుతున్నది. ఎగుమతులు, దిగుమతుల మధ్య అసమానతల వలన కరెంట్ ఎకౌంట్ లోటు పెరుగుతున్నది. వివిధ దేశాలతో స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందాలు చేసుకోవడం, దిగుమతులపై తక్కువ సుంకాలు విధించడం వలన దిగుమతులు పెరుగుతున్నాయి. మన ఉత్పత్తులకు ప్రభుత్వం తక్కువ సబ్సిడీలివ్వడం, తదితరాల వలన ఎగుమతులు తగ్గుతున్నాయి. ఫలితంగా కరెంట్ అకౌంట్ లోటు పెరుగుతున్నది.

**ఆర్‌బిఐపై సెక్షన్ 7 బూచి**

ఆర్‌బిఐ చట్టం–1934లోని సెక్షన్–7 ప్రకారం ప్రజా ప్రయోజనార్థం ఆర్‌బిఐకి ఆదేశాలు జారీచేసే అధికారం కేంద్ర ప్రభుత్వానికి దఖలు పడింది. సెక్షన్ 7 (1) ప్రకారం కేంద్ర ప్రభుత్వం ప్రజా ప్రయోజనాల కోసం అవసరమైతే ఆర్‌బిఐ గవర్నర్‌తో చర్చలు జరిపిన అనంతరం, ఎప్పటికప్పుడు ఆర్‌బిఐకి ఆదేశాలు జారీ చేయవచ్చు. సెక్షన్ 7 (2) ప్రకారం ఆర్‌బిఐని తన కేంద్ర బోర్డు డైరెక్టర్ల ద్వారా నడిపించేందుకు సైతం ప్రభుత్వానికి అధికారం దఖలు పరుస్తుంది. ఆర్‌బిఐ చట్టం 1934 ద్వారా ప్రభుత్వం అటు గవర్నర్‌ను కానీ, డిప్యూటీ గవర్నర్‌ను కానీ తొలగించడానికి అధికారం ఉంది. ఆర్‌బిఐ గవర్నర్, నలుగురు డిప్యూటీ గవర్నర్‌లను ప్రధానమంత్రి ఆధ్వర్యంలోని నియామకాల మంత్రివర్గ సంఘం (ఎసిసి) నియమిస్తుంది.

గతానికి భిన్నంగా ప్రజా ప్రయోజనార్థం అంటూ రిజర్వు బ్యాంకు 1934 చట్టం 7వ సెక్షన్ కింద తనకు గల విశేషాధికారాలను కేంద్ర ప్రభుత్వం ప్రయోగించడమంటే రాష్ట్రాల్లో ప్రభుత్వాలను కూల్చి రాష్ట్రపతి పాలన విధించడం కంటే తీవ్రమైనది. ఆర్‌బిఐ స్వయం నిర్ణయాధికారాన్ని కబళించడమే అవుతుంది. 1947 నుంచి ఇప్పటివరకు దీనిని ప్రయోగించలేదు. రిజర్వు బ్యాంకు చేత తన ఇష్టప్రకారం పని చేయించుకోవడం కోసం ఈ సెక్షన్ కింద దానికి తాఖీదులిచ్చే అధికారం కేంద్ర ప్రభుత్వానికి ఉంటుంది. కేంద్రానికి, ఆర్‌బిఐకి వైరుధ్యం పెరిగి విభేదాలు వీధినపడిన తర్వాత మోడీ ప్రభుత్వం తప్పనిసరిగా ఈ అధికారాలను ఉపయోగంలోకి తెస్తుందని ఊహాగానాలు ముమ్మరంగా బయలుదేరాయి. సెక్షన్ 7 అమలైతే ఆర్‌బిఐ కేంద్ర ప్రభుత్వ మార్గదర్శకాల మేరకు విధులు నిర్వర్తించాల్సి వస్తుంది. ఇది ఆర్‌బిఐ స్వతంత్ర ప్రతిపత్తిని ప్రమాదంలో పడవేస్తుంది.

**ప్రజల సొమ్మును కాజేసే కుట్ర**

భారత ఆర్థిక వ్యవస్థ మందకొడితనానికి, బ్యాంకుల్లో నిరర్థక ఆస్తులు (తిరిగిరాని రుణాలు) పెరిగిపోవడానికి, విరివిగా రుణాలు ఇవ్వడానికి, బ్యాంకులవద్ద డబ్బుకొరతకు బాధ్యులెవరంటే ప్రభుత్వమేనని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. ఆశ్రిత కార్పొరేట్ అనుకూల ప్రభుత్వ విధానాలే కారణమని చెప్పవచ్చు. ప్రజలు పొదుపు చేసుకున్న నిధులను కాజేయడానికి కేంద్ర

ప్రభుత్వం చేస్తున్న కుట్ర కూడా దీనిలో దాగి ఉన్నది. గతంలో ఎఫ్ఆర్‌డిఐ చట్టం తీసుకురావడం ద్వారా ప్రజలు బ్యాంకులలో దాచుకున్న డబ్బును కాజేయడం కోసం ప్రభుత్వం తీవ్రంగా ప్రయత్నం చేసింది. ప్రజల నుండి పెద్ద ఎత్తున వ్యతిరేకత వ్యక్తం కావడంతో తాత్కాలికంగా వెనక్కు తగ్గింది.

ఇప్పుడు ఆర్‌బిఐ వద్దనున్న అదనపు నిధులను కేంద్రం స్వాధీనం చేసుకుంటే తిరిగి ఎఫ్ఆర్‌డిఐ బిల్లు పరిణామాలు పునరావృత మౌతాయి. మిగులు నిధులను ప్రభుత్వం తీసుకుంటే ఆర్థిక సంక్షోభం లేదా అనుకోని విపరిణామాలు ఎదురైనప్పుడు దానిని అధిగమించడం ఆర్‌బిఐకి అసాధ్యంగా మారుతుంది. బ్యాంకింగ్ వ్యవస్థ గాడి తప్పుతుంది. ప్రజలు దాచుకున్న డబ్బుకు గ్యారంటీ ఉండదు. ప్రభుత్వ బ్యాంకులపై ప్రజలు విశ్వాసం కోల్పోతారు. గత్యంతరం లేని పరిస్థితులలో ప్రజలు ప్రైవేటు బ్యాంకులు, ఆర్థిక సంస్థల వైపు మళ్లుతారు. ప్రైవేటు వారికి ప్రజా సంక్షేమం కన్నా తమ లాభాలు ముఖ్యం కాబట్టి రకరకాల మోసాలకు పాల్పడతారు. ప్రైవేటు సంస్థల చేతిలో ప్రజలు మోసపోవడం, తమ కష్టార్జితాన్ని పోగొట్టుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది.

**ఆర్‌బిఐలో ఇక బోర్డు పెత్తనం**

బోర్డులోని మెజారిటీ డైరెక్టర్లను తనవైపు తిప్పుకొని తన పని సాధించుకోవాలని కేంద్రం వ్యూహ రచన చేసుకున్నట్లు తెలుస్తున్నది. 84 ఏళ్ల ఆర్‌బిఐ చరిత్రలో ఎన్నడూ ఏ ప్రభుత్వమూ దీనిని ఉపయోగించలేదు. ప్రభుత్వానికి అనుకూలంగా బోర్డులో నిర్ణయాలు తీసుకొని తద్వారా ఆర్‌బిఐ గవర్నర్‌తో పాటు ఆయన బృందంతోనే సదరు నిర్ణయాలు అమలయ్యేలా కేంద్రం పావులు కదుపుతుంది. 1991లో దేశంలో విదేశీ చెల్లింపు సమస్య వచ్చినప్పుడు గాని, 2008లో ప్రపంచ ఆర్థిక సంక్షోభం ఏర్పడ్డ సమయంలో కూడా ఈ సెక్షన్‌ని వినియోగించలేదు. ప్రజా ప్రయోజనాల పేరుతో ఈ దుశ్చర్యకు ప్రభుత్వం నేడు పాల్పడుతున్నది. ఈ సెక్షన్‌ను ఉపయోగించుకొని ప్రభుత్వ బ్యాంకుల సొమ్మును ఇప్పటికే లక్షల కోట్లు రూపాయలు ఎగ్గొట్టిన బడా కార్పొరేట్ వర్గానికి దోచి పెట్టాలని బిజెపి ప్రయత్నం చేస్తున్నది. ఎన్నికలు సమీపిస్తున్న వేళ వ్యవస్థలో ద్రవ్య లభ్యత తగ్గి ఆర్థికం స్థంభించే సంకేతాలు వస్తుండడంతో ఆర్‌బిఐ వద్ద ఉన్న మిగితా అదనపు నిధులపై మోడీ సర్కార్ కన్ను పడింది. రిజర్వు బ్యాంక్ వద్ద ఉన్న రు. 9.59 లక్షల కోట్లలో అగంతుక నిధి రు. 3.6 లక్షల కోట్లు తమకు ఇవ్వాలని మోడీ సర్కార్ ఒత్తిడి చేస్తోంది. దీన్ని ఆర్‌బిఐ తిరస్కరించింది.

రిజర్వ్ బ్యాంకు డైరెక్టర్ల బోర్డు సమావేశం నవంబర్ 19న తొమ్మిది గంటల పాటు వాడి వేడిగా జరిగింది. బోర్డులోని 18 మంది సభ్యులు సమావేశానికి హాజరుకావడం విశేషం. గత కొంతకాలంగా ఆర్‌బిఐతో కేంద్రానికి విభేదాలు కొనసాగుతున్న నేపథ్యంలో ఈ సమావేశం ప్రాధాన్యత సంతరించుకుంది. కేంద్ర ప్రభుత్వం బడ్జెట్‌లోటు పూడ్చుకోవ డానికి, ఈ ఎన్నికల సంవత్సరంలో అదనంగా ఖర్చు చేయడానికీ ఆర్‌బిఐ నుంచి అదనపు నిధులు (రెగ్యులర్ డివిడెండ్ కాక) కోరుతుందన్న అభిప్రాయం బలపడుతుండడంతో మొత్తం 12 వివాదస్పద అంశాల్లో కీలకమైన నాలుగింటిపై అంగీకారం కుదిరింది. అతిపెద్ద నాన్ బ్యాంకింగ్ కంపెనీ అయిన ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ లీజింగ్ అండ్ ఫైనాన్షియల్ సర్వీసెస్ బ్యాంకు రుణాల చెల్లింపులో డీఫాల్ట్ అయిన దరిమిలా ఎన్‌బిఎఫ్‌సిలు ఎదుర్కొంటున్న డబ్బు కొరత సమస్యను బ్యాంక్ పరిశీలిస్తుంది.

బోర్డు సమావేశంలో కుదిరిన అంగీకారాలు ఇలా ఉన్నాయి. ఒకటి, ఆర్‌బిఐ రిజర్వు నిధులను అదనంగా ప్రభుత్వానికి బదిలీ చేసే అంశంపై ఒక కమిటీని నియమిస్తారు. దాని సిఫారసులు భవిష్యత్‌లో ఒనగూరే రిజర్వుకే వర్తిస్తాయి. రెండు, బ్యాంకుల పెట్టుబడి నియమాలను బాసెల్‌తో సమానంగా ఉంచే అంశంపై ప్రస్తుత విధానంలో మార్పు ఉండదు. కాని చివరి కిస్తీ చెల్లింపును ఒక సంవత్సరం పొడిగించారు. మూడు, నిరర్థక ఆస్తులు భారీగా ఉన్న బ్యాంకులు విచక్షణారహితంగా రుణాలు ఇవ్వకుండా ఆర్‌బిఐ విధించిన 'సకాలంలో దిద్దుబాటు చర్య'ను సడలించి 11 బ్యాంకులకు వెసులుబాటు కల్పించే విషయాన్ని ఆర్‌బిఐ ఫైనాన్షియల్ సూపర్‌వైజర్ బోర్డు పరిశీలిస్తుంది. నాలుగు, సూక్ష్మ చిన్న మధ్య తరహా పరిశ్రమలకు (ఎంఎస్ఎంఇలు) రుణాల మంజూరును సులభతరం చేయడం, బ్యాంకింగేతర ఫైనాన్స్ కంపెనీలకు (ఎన్‌బిఎఫ్‌సిలు) ద్రవ్య లభ్యతకు ప్రత్యేక అవకాశం కల్పించడం అనే అంశంపై ఎంఎస్ఎంఇ రుణ గ్రహీతల అప్పును రు. 25 కోట్ల వరకు పునర్వ్యవస్థీకరించడం పరిశీలించబడుతుంది.

రాజ్యాంగ వ్యవస్థలను వేధించడం, వీలైతే ధ్వంసం చేయడం మోడీ ప్రభుత్వానికి అలవాటే. ఎన్నికల కమిషన్, జుడీషియరీ, సిబిఐ, ఈడి, సివిసి, కేంద్ర విశ్వవిద్యాలయాలు వగైరా సంస్థల విషయంలో ప్రభుత్వ జోక్యం పెరిగింది. ఆర్‌బిఐ వద్ద ఉన్న నిల్వలను కుదింప చేసి ద్రవ్య లభ్యతను పెంచుకోవాలని మోడీ ప్రభుత్వం సంకల్పించింది. అందువల్లనే రిజర్వ్ బ్యాంక్‌పై కూడా పెత్తనం చేయాలనుకోవడం చూస్తున్నాం. అన్ని విషయాల్లో ప్రభుత్వానిదే తుది మాట అనే వైఖరి అనర్థదాయకం, అటువంటి ప్రమాదాలకు విరుగుడుగానే అదుపాజ్ఞలు చట్టరీత్యా విధించబడినాయి. పాలకులు తమ వైఫల్యాలను కప్పిపుచ్చుకోడానికి రాజ్యాంగ వ్యవస్థల పునాదులను కదిలించడం, నిరంకుశాధికారాల ప్రయోగానికి తొందరపడడం దేశానికి ఎంత మాత్రం క్షేమకరం కాదు. నిజానికి ఆర్‌బిఐలో మోడీ ప్రభుత్వానికి గల వివాదానికి మూలాలు సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాల అమలులో ఉన్నాయి. ఆర్థిక వ్యవస్థలో జోక్యం చేసుకునే సాధనంగా ఉండే ఆర్‌బిఐ ద్రవ్య విధానాన్ని అంతమొందించడమే ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య నిధి లక్ష్యం. అటువంటి పాలనలోనే అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడుల ప్రవాహాలు రావడానికి పోవడానికి స్వేచ్ఛ ఉంటుంది.

ఇంతవరకు ఆర్‌బిఐ గవర్నర్ విజ్ఞతతో పని చేసిన స్వతంత్ర స్థితి నుండి ఇకమీదట బోర్డు, పలు కమిటీలు చేసే సిఫార్సుల మేరకు నిర్ణయం తీసుకోవాల్సిన స్థితికి మారడంతో ప్రభుత్వం ఆర్‌బిఐ పైన పైచేయి సాధించినట్లు చెప్పవచ్చు. పాశ్చాత్య దేశాల్లో కేంద్ర బ్యాంకులకు ఉన్నట్టు రాజ్యాంగపరమైన స్వయం ప్రతిపత్తి ఆర్‌బిఐకి లేదు. ద్రవ్య విధాన కమిటీలో ముగ్గురు సభ్యులను కేంద్ర ప్రభుత్వమే నియమిస్తుంది. అదే సమయంలో రిజర్వ్ బ్యాంక్ గవర్నర్‌ను తొలగించే అధికారం కూడా అది కలిగి ఉంది. సార్వత్రిక ఎన్నికలు సమీపిస్తున్నందున సంక్షేమ పథకాల అమలు కోసం అవసరమైన నిధులను ప్రభుత్వ ఖాతాలోకి తరలించాలని కేంద్రం ప్రయత్నిస్తోంది. ఫలితంగా దేశంలో ఆర్థిక సమస్యలు తలెత్తే ప్రమాదం ఉంది. ఇలా రాజ్యాంగ వ్యవస్థలు, సంస్థల్ని మోడీ ప్రభుత్వం ధ్వంసం చేస్తుండడాన్ని నిలువరించేందుకు ప్రజలు, ప్రజాస్వామికవాదులు చొరవ చేయాల్సిన తరుణమిది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# రాజకీయ కీలుబొమ్మగా సిబిఐ

***నిర్భయంగా, నిష్పక్షపాతంగా నిజాలను వెలుగులోకి తేచ్చే విధంగా ఉండాల్సిన కేంద్ర దర్యాప్తు సంస్థను అధికార పార్టీలు తమ స్వార్థ ప్రయోజనాల కోసం వాడుకుంటున్నాయని అంటున్నారు* డా. ఎ. పున్నయ్య**

నిజాయితీతో, నిష్పక్షికంగా, పారదర్శకంగా పనిచేస్తూ దేశసమగ్రతను కాపాడడానికి బ్రిటిష్ ఇండియాలో శ్రద్ధ, నిష్పక్షపాతం, న్యాయవర్తన అనే విశాలమైన నినాదంతో 1941లో ఢిల్లీ క్షేత్ర కేంద్రంగా స్పెషల్ పోలీస్ ఎస్టాబ్లిష్మెంట్ (ఎస్పిఇ) ఆవిర్భవించింది. ఈ సంస్థ స్వతంత్ర భారతంలో 1963లో సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ (సిబిఐ) పేరుతో దేశ అత్యున్నత అగ్రగామి నేర విచారణ సంస్థగా వెలుగులోకి వచ్చింది. ఇది ప్రజా జీవితంలో గొప్ప శక్తివంతమైన పాత్రను పోషిస్తున్నది. జాతీయ ఆర్థికవ్యవస్థ కుశలతకు భారీ భరోసానిస్తుంది. ఐదున్నర దశాబ్దాల చరిత్ర గల సిబిఐ అత్యున్నత రాజ్యాంగ వ్యవస్థగా కొనసాగుతోంది.

కేంద్ర దర్యాప్తు సంస్థలో అత్యంత కీలకం డైరెక్టర్ నియామకం, అతని విధులు. ఇతను ఐపిఎస్ అధికారిగా పనిచేస్తూ, డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు క్యాడర్‌లో ఉండాలి. ఈ అర్హతగల వారి సామర్థ్యం ఆధారంగా కేంద్ర విజిలెన్స్ కమిషన్ (సిబిసి) స్క్రూటినీ చేసి జాబితాను తయారు చేస్తుంది. ఆ జాబితా ఆధారంగా ప్రధానమంత్రితో పాటు ప్రతిపక్ష నాయకుడు, సుప్రంకోర్టు ప్రధాన న్యాయమూర్తితో కూడిన కొలిజియం డైరెక్టరును నియమిస్తుంది.

కొలిజియం అంగీకారం ప్రకారం డైరెక్టరును నియమించడం మాత్రమే కాని తొలగించడం కుదరదని పొందుపరుచుకున్న నిబంధనలు తెలియజేస్తున్నాయి. అనివార్యంగా తొలగించాల్సి వస్తే దుష్ప్రవర్తన కారణంగానే తొలగిస్తామని పేర్కొంది. అది కూడా విచారణ కోసం ముగ్గురు పదవీ విరమణ చెందిన సుప్రీంకోర్టు న్యాయమూర్తులు లేదా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులతో కమిటిని ఏర్పాటు చేసి ఆ కమిటీ ఇచ్చిన నివేదిక మేరకు రాష్ట్రపతి తుది నిర్ణయం. అనంతరం రాష్ట్రపతి మాత్రమే ఆదేశాలు జారీ చేస్తారు. దీన్ని బట్టి సిబిఐ డైరెక్టర్ పదవి స్వతంత్రతను కాపాడే నేపథ్యంలో ఆ అధికారిపై ఎలాంటి ఒత్తిడి లేకుండా చేయడానికి డైరెక్టర్‌ను తొలగించడానికి పై పరిస్థితిల్లో తప్ప ఎవరికి అధికారం లేదని స్పష్టమవుతోంది.

**సిబిఐకి అంటుకున్న అవినీతి మకిలి**

సాధారణంగా సిబిఐ కేసు అంటేనే దోషులు వణికిపోతారు. తొలినాళ్ల లో ఈ సంస్థ లక్ష్యాలకు అనుగుణంగా స్వతంత్రంగా, పారదర్శకంగా పనిచేసి అద్భుత ఫలితాలను అందించింది. తీవ్ర నేరాలతో ముడిపడిన కేసుల దర్యాప్తును సిబిఐకి అప్పగిస్తే దోషులు ఎంతటి వారైనా నిజాన్ని నిర్భయంగా, నిష్పక్షపాతంగా నిగ్గు తేలుస్తుందని విశ్వాసం ఉండేది. రాజకీయాల్లో స్వార్థం, అవినీతి ప్రవేశించిన తర్వాత సిబిఐకి కూడా అవినీతి మకిలి అంటుకుంది. ఒకప్పుడు అవినీతిపరులు సింహస్వప్నమైన సిబిఐ తన స్థాయిని క్రమంగా దిగజార్చుకుంది. దరిమిలా అది నేడు రాజకీయ ప్రతికార అస్త్రంగా మారింది.

సిబిఐ అంతర్గత కలహాలతో సతమతమవుతూ పతనావస్థకు చేరుకోవడం విచారకరం. పాలక వర్గాల సంకుచిత ప్రయోజనాల కారణంగా అత్యున్నతాధికారులే పరస్పరం అవినీతి ఆరోపణలు చేసుకొని దర్యాప్తు సంస్థనే సంక్షోభంలోకి నెట్టినారు. దేశానికి అవమానకరమైన రీతిలో చరిత్రలో ఎన్నడే లేని విధంగా సిబిఐ తన సొంత ఉన్నతాధికారిపై కేసు నమోదు చేసింది. స్థూలంగా ఈ పరిణామం మొత్తం పరిపాలనా వ్యవస్థపై తీవ్ర ప్రతికూల ప్రభావం చూపుతుంది. అన్నింటికి మించి ఈ వ్యవస్థలో విశ్వసించదగిన, గౌరవించదగిన సంస్థ ప్రతిష్ట దెబ్బతింటే ఆ ప్రభావం జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో విచారణ జరుగుతున్న పలు కేసులపై పడుతుందనేది చారిత్రక సత్యం.

**రాజకీయ అవినీతే ఈ వివాదానికి మూల కారణమా!**

అధికారంలోకి వచ్చిన రాజకీయ పార్టీలు తమ ప్రత్యర్థులను వేటాడం కోసం రాజ్యాంగబద్ధ సంస్థలను సైతం కలుషితం చేస్తున్నాయి. ఇందుకోసం అవినీతి వ్యవస్థీకృతమైన రాజకీయ పార్టీలు తమ సార్థ ప్రయోజనాల కోసం స్వతంత్ర ప్రతిపత్తి గల సంస్థలతో పాటు నిఘా, దర్యాప్తు, బ్యాంకింగ్, న్యాయవ్యవస్థలను సహితం వినియోగిస్తున్నారన్న బహిరంగ విమర్శలున్నాయి. ఈ నేపథ్యంలో ఇటీవల ప్రతిపక్షాలను బెదిరించేందుకు సిబిఐని పావుగా వాడుకునేందుకు అధికార పార్టీ నాయకత్వం చేస్తున్న కుటిల ప్రయత్నాలకు సిబిఐ డైరెక్టర్ అలోక్‌వర్మ అత్యంత తీవ్రంగా వ్యతిరేకిస్తూ వచ్చారు. ఒక ప్రతిపక్ష నేతపై విధాన పరంగా చార్జీషీట్ అనంతరం విచారణ మాత్రమే జరగాలి కాని దాడీ జరగరాదన్న డైరెక్టరు వర్మ ప్రభుత్వ ఆదేశాలను పక్కన బెట్టిండు. సిబిఐ పనితీరులో రాజ్యాంగేతర శక్తుల జోక్యాన్ని వర్మ వ్యతిరేకించాడు. దీంతో ప్రభుత్వ పెద్దలు వర్మపై కక్ష పెంచుకున్నారు. అదే విధంగా దేశంలోని ముగ్గురు ప్రతిపక్ష పార్టీ సిఎంలపై దాడులు నిర్వహించి అరెస్టు చేయాలని కేంద్రం జారీచేసిన ఆదేశాలు దర్యాప్తు సంస్థకు విధానపరంగా సమ్మతించలేదు. ఆ కారణంగానే దాడీ చేయడం దర్యాప్తు సంస్థను తేలిక చేసినట్లేనన్న అలోక్‌వర్మ అభిప్రాయాల పట్ల కేంద్రానికి మరింత కోపం తెప్పించినాయి.

ఈ క్రమంలో అలోక్‌వర్మను పక్కకు పెట్టే ఆలోచనతో అనూహ్యంగా రెండవ స్థానంలో ఉన్న ప్రత్యేక డైరెక్టర్ రాకేశ్ అస్తానాకు ప్రధాన్యత పెరిగింది. ప్రభుత్వ ఆదేశాల మేరకు అస్తానా ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిని అరెస్టు చేసిన కేసులో ముఖ్యమంత్రిపై దాడిచేశారు. అక్రమాస్తుల కేసు

పేరుతో మరో ముఖ్యమంత్రి బంధువుపై దర్యాప్తు జరిగింది. ప్రతిపక్షానికి చెందిన మహిళానేత ప్రభుత్వ వ్యతిరేక కూటమిలో చేరుతానని ప్రకటించిన కొద్ది సమయంలోనే ఆమె సోదరుడిపై దాడి చేసి రెండు రోజుల పాటు కస్టడీలోకి తీసుకున్నారు. కుమారుడి అవినీతి కేసులో 70 సంవత్సరాలకు పైబడిన ప్రతిపక్ష నేతను అరెస్టు చేశారు. ఈ క్రమంలో ప్రత్యేక డైరెక్టరు రాకేశ్ అస్తానా ప్రభుత్వానికి అత్యంత నమ్మదగిన వ్యక్తిగా దగ్గరైనాడు. ఈ మొత్తం ఎపిసోడ్‌లో ప్రభుత్వం మాట ఎవరు వినక పోయినా వారిని నిర్దాక్షిణ్యంగా తొలగిస్తామని వర్మ తొలగింపు ద్వారా ప్రజలకు ప్రధాని సందేశం ఇచ్చారు.

**అలోక్‌వర్మ - రాకేశ్ అస్తానా వైరానికి ప్రధాన కారణం**

సిబిఐ డైరెక్టర్ అలోక్‌వర్మకు ప్రత్యేక డైరెక్టర్ రాకేశ్ అస్తానాల మధ్య వివాదానికి గత ఏడాది అక్టోబర్‌లో బీజం పడింది. కేంద్ర విజిలెన్స్ కమిషన్ సమావేశమైనపుడు ప్రత్యేక డైరెక్టర్‌గా రాకేశ్ అస్తానాను నియమించడంపై అలోక్‌వర్మ తీవ్రమైన అభ్యంతరం వ్యక్తం చేశారు. స్టెర్లింగ్ బయోటెక్ కేసుతో పాటు అరడజన్ అవినీతి కేసుల్లో అస్తానా పాత్రను సిబిఐ గుర్తించిందని, అస్తానాకు అనుకూలమైన అధికారులను సిబిఐలో అర్హత లేకున్నా పదోన్నతుల పేరుతో ప్రవేశపెట్టే అవకాశ ముందన్నారు. లక్ష్యాలకు భిన్నంగా సిబిఐ ముందుకు పోతుందని వారించే ప్రయత్నం చేసినాడు. రాజకీయ నాయకుల ప్రమేయంతో ఎదిగొచ్చిన అస్తానాను డైరెక్టర్ వర్మ అభ్యంతరాలు కట్టడి చేయలేక పోయాయి.

రాకేశ్ అస్తానా 1984 గుజరాత్ క్యాడర్ ఐపిఎస్ అధికారి, మోదీకి అత్యంత సన్నిహితుడు. గోద్రా కేసు నుంచి మోదీని గట్టెక్కించిన ఘనుడు ఆయనే. ఫలితంగా గత ఏడాది అక్టోబర్‌లో అనేక అభ్యంతరాల మధ్య సిబిఐలో రెండవ స్థానంలో ప్రత్యేక డైరెక్టర్‌గా నియమితులయ్యారు. తన వర్గీయులను కాపాడుటకు రాజకీయ ప్రత్యర్థులను దెబ్బకొట్టడానికి మోదీ ప్రభుత్వం ఎంచుకున్న పదునైన ఆయుధం రాకేశ్ అస్తానా. ఆయన ఆగస్టా వెస్ట్‌లాండ్ హెలికాప్టర్ కుంభకోణం, విజయ మాల్యా రుణ ఎగవేత, ఐఎన్ఎక్స్ మీడియా, ఎయిర్‌సెల్ మాక్సిస్ తదితర ముఖ్యమైన కేసుల్లో ప్రత్యేక దర్యాప్తు బృందాలకు నాయకత్వం వహిస్తున్నాడు. తన ప్రతిభతో అన్నింటిని సమానంగా కాకుండా ప్రభుత్వ భాగస్వామ్య పెద్దలంటే అనుకూలంగా, ప్రతిపక్షాలైతే ప్రతికూలంగా దర్యాప్తు జరుపు తున్నట్లు బహిరంగ చర్చ జరుగుతోంది. ముందే ప్రధాని తనతో ఉన్న సాన్నిహిత్యంవల్ల అస్తానాకు పదోన్నతి కల్పించాలనుకుంటే ప్రతిపక్షాల ఘాటైన విమర్శల వల్ల విరమించుకున్నాడు. అలోక్‌వర్మ త్వరలో రిటైర్ కానున్న సమయంలో ఆయన తర్వాత స్థానంలో ఉన్న అస్తానానే ఈ పదవిలో కొనసాగాలి. ఆయనపైనే అవినీతి కేసు కావడం గమనించాలి.

**లంచం కేసులో ఇరుక్కున్న సిబిఐ ప్రత్యేక డైరెక్టర్ రాకేశ్ అస్తానా**

ప్రభుత్వ కనుసన్నలలో కేంద్ర దర్యాప్తు సంస్థ అవినీతికి పాల్పడినట్లు ఆరోపణలు చెలరేగుతున్న ఈ తరుణంలో సిబిఐ తన సొంత సంస్థలో రెండవ స్థానంలో ఉన్న రాకేశ్ అస్తానాతో పాటు (రీసర్చ్ అండ్ ఎనాలిసిస్ వింగ్) 'రా'లో రెండవ స్థానంలో ఉన్న సమంత్ కుమార్ గోయల్‌పై లంచం తీసుకున్న కేసులో ఎఫ్ఐఆర్ నమోదు సంచలనంగా మారింది. రాకేశ్ అస్తానా ప్రభుత్వ పెద్దల కోసం పనిచేసుకుంటూ మరోవైపు కోట్లాది రూపాయలు లంచం స్వీకరించడం మూలానా అంటువ్యాధిలా వ్యాపిస్తున్న అవినీతి సిబిఐతో పాటు క్యాబినెట్ సెక్రటేరియట్‌లో భాగమైన 'రా'ను కూడా కబలించిందనీ, అస్తానా సిబిఐ విధి నిర్వాహణకు అనర్హుడనీ, ఇతన్ని సస్పెన్స్‌లో ఉంచాలనీ ప్రధాని కార్యాలయానికి వర్మ సిఫార్సు చేశారు. ఒకటికి రెండుమార్లు ప్రధాని దృష్టికి తీసుకెళ్లారు. ఈ క్రమంలో ప్రధాని నేరుగా బాధ్యత వహించాల్సి ఉండడంతో ఈ అంశానికి మరింత ప్రాధాన్యత సంతరించింది. అయితే కేంద్ర ప్రభుత్వంలోని సిబ్బంది, శిక్షణ వ్యవహారాల శాఖ నేరుగా ప్రధాని కార్యాలయ పర్యవేక్షణలో ఉండడంతో ఈ సిఫార్సు ప్రధాని స్థాయిలో నిలిచిపోవడం గమనార్హం.

**హైదరాబాద్ వ్యాపారి ఫిర్యాదుతో బయటపడిన అవినీతి భాగోతం**

భారత ఉపఖండంతో పాటు దుబాయ్, లండన్, యూరప్‌లోని పలు దేశాల్లో హవాలా నెట్‌వర్క్‌ను నిర్వహిస్తున్న మొయిన్ ఖరేషి అనే అంతర్జాతీయ మాంసం ఎగుమతిదారుపై అనేక కేసులు నమోదు అయినాయి. మనీలాండరింగ్ కేసులో ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టర్ (ఇడి) గతేడాది ఖురేషిని అరెస్టు చేసింది. ఈ కేసును రాకేశ్ అస్తానా బృందం విచారిస్తుంది. ఈ కేసు నిందితుల్లో హైదరాబాద్ వ్యాపారీ సతీష్ సానా ముఖ్యుడు. ఇతన్ని అక్టోబర్ 4, 16 తేదీల్లో మెజిస్ట్రేట్ ముందు హాజరుపరిచి వాంగ్మూలాన్ని రికార్డు చేసినారు. ఈ వాంగ్మూలం సారంశం రు. 5 కోట్లు లంచంగా ఇస్తే సిబిఐ సమాన్ల నుండి ఊరట కలిగిస్తానని మనోజ్ ప్రసాద్ అనే ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంకర్ సతీష్ సానాకు హామీ ఇచ్చాడని పేర్కొన్నారు. 2017 డిసెంబర్ నుంచి పదినెలల పాటు పలు వాయిదాల్లో రు. 2 కోట్లు అందించినాడు. మనోజ్ ప్రసాద్ వివిధ దర్యాప్తు సంస్థల అధికారులతో ఉన్న దగ్గరి సంబంధాలతో కేసును నీరుగార్చిస్తానన్నాడు. సతీష్ సానా సమక్షంలో ఒకరితో ఫోన్ ద్వారా విషయాన్ని చేరవేశాడు. అవతలి వ్యక్తి ఎవరని సతీష్ పదే పదే అడగ్గా వాట్సాప్ కాంటాక్ట్ జాబితాలో రాకేశ్ అస్తానా ఫోటో చూపించినాడన్నాడు. గుగుల్‌లో రాకేశ్ అస్తానా ఫోటో చూసి మనోజ్ ప్రసాద్ చూపించినది నిజమని నిర్ధారించుకున్నాడు. లండన్‌లో రాకేశ్ అస్తానా పెట్టుబడులను తన సోదరుడు సోమేశ్ ప్రసాద్ పర్యవేక్షిస్తుంటాడని సోమేశ్ ప్రసాద్ ద్వారా రాకేశ్ అస్తానా తనకు దగ్గరైనట్లు మనోజ్ ప్రసాద్ వెల్లడించినట్లు తెలిపారు. ఇదంతా నేరశిక్షాస్మృతిలోని 164 సెక్షన్ కింద పై వాంగ్మూలాన్ని నమోదు చేశారు. ఈ వాంగ్మూలం ఆధారంగా కుట్రపూరిత, అవినీతి దుష్ప్రవర్తన తదితర నేరాలను విచారించవచ్చు. ఈ సెక్షన్ కింద జరిగే విచారణకు ప్రభుత్వ అనుమతి అవసరం లేదు.

**డబ్బులు తీసుకున్నది అలోక్‌వర్మనే - అస్తానా ఆరోపణ**

అస్తానా ఆగస్టు 24న కేంద్ర క్యాబినెట్ కార్యదర్శికి రేఖ రాశారు. ఆ లేఖలో అలోక్‌వర్మ అవినీతికి సంబంధించి 10 అంశాలను పేర్కొన్నారు. హైదరాబాద్ వ్యాపారి సతీష్ సనాను మొయిన్ ఖురేషి కేసు నుంచి బయట పడేసేందుకు అలోక్‌వర్మ రు. 2 కోట్లు లంచం తీసుకున్నారని ఆరోపించారు. అలోక్‌వర్మకు పరిచయస్థుడైన ఓ తెలుగుదేశం పార్టీ నేత కేసు నుంచి తన పేరును తొలగిస్తానని హామీ ఇచ్చినట్లు సతీష్ సనా దర్యాప్తులో తెలిపారని అస్తానా పేర్కొన్నారు. కాని అస్తానా పేర్కొన్న అంశాలన్నియు కట్టు కథలని, నిరాధారలని, అవాస్తవాలని, ద్వేషపూరిత ఆరోపణలని సిబిఐ ఖండించడం గమనార్హం.

**సివిసి చర్యలతో స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుకోలేని సిబిఐ**

కేంద్ర విజిలెన్స్ కమిషన్‌కు చట్టంలోని సెక్షన్ 4 (1) ప్రకారం సిబిఐని పర్యవేక్షించే అధికారాలున్నాయి. సిబిఐతో పాటు ఆరోపణలు ఎదుర్కొంటున్న అలోక్‌వర్మ, రాకేశ్ అస్తానాలు కూడా కేంద్ర విజిలెన్స్ కమిషన్ దర్యాప్తు తీరుపై అభ్యంతరాలు వ్యక్తం చేసినారు. అయినప్పటికీ కేంద్ర విజిలెన్స్ కమిషన్ సూచన ప్రకారం ఆరోపణలు ఎదుర్కొంటున్న వారు విచారణ సమయంలో సంస్థకు సారధ్యం వహిస్తే తుది ఫలితం తారుమారయ్యే అవకాశముంటుందని. వారు ఉద్దేశ పూర్వకంగానే విచారణకు సహకరించకపోవచ్చునని వర్మ, అస్తానాలను బలవంతంగా సెలవుపై పంపాలని సూచించింది. వారిద్దరిపై వచ్చియన ఆరోపణలపై ప్రత్యేక దర్యాప్తు బృందాన్ని (సిట్) ఏర్పాటు చేయాలని కేంద్ర ప్రభుత్వానికి కేంద్ర విజిలెన్స్ కమిషన్ నివేదించింది. ఈ సూచనల ఆధారంగా వారి అధికారాలను ఉపసంహరించి ప్రధాని నేతృత్వంలోని నియామకాల క్యాబినెట్ కమిటీ వీరిని సెలవుపై పంపాలని నిర్ణయించింది. ఈ క్యాబినెట్ కమిటీ మార్గదర్శాల ప్రకారం జాతీయ భద్రతా సలహాదారు (ఎన్‌ఎస్‌ఎ) అజిత్ దోవల్ అలోక్‌వర్మ, అస్తానాను సెలవుపై పంపుతూ అర్ధరాత్రి రెండు గంటలకు నాగేశ్వరరావును సిబిఐ తాత్కాలిక డైరెక్టరుగా నియామకం చేశారు. ఇలా అర్ధరాత్రి హైడ్రామా సిబిఐ చరిత్రలో ఇదే మొదటిసారి. రాత్రికి రాత్రి కేంద్ర ప్రభుత్వం తీసుకున్న ఈ నిర్ణయం అత్యున్నత స్థాయి వ్యక్తులపై సహితం జరిపే సిబిఐ స్వతంత్ర ప్రతిపత్తికి విఘాతం కలిగించిందని, రాజ్యాంగం ప్రమాదంలో పడుతుందని రాజనీతజ్ఞులు ఆందోళనలు వ్యక్తం చేసినారు. ఇలాంటి జోక్యం వల్ల దేశంలోని అత్యున్నత రాజ్యాంగబద్ద దర్యాప్తు సంస్థ స్వతంత్ర ప్రతిపత్తికి గండిపడుతుందన్నారు. నిజానికి ఈ సంస్థ స్వయం ప్రతిపత్తితో స్వతంత్రంగా పనిచేయాల్సి ఉంది. అత్యంత కీలకమైన వ్యక్తుల, నేరాలతో ముడిపడిన దర్యాప్తుల్లో ప్రభుత్వానికి తగిన మార్గ నిర్దేశం లభించాలన్న ఈ వ్యవస్థ పారదర్శకంగా ముందుకు పోవాలన్నా ఈ సంస్థ నిజాయితీని నిరూపించుకోవాల్సిన అవసరముంది. కాని రాజకీయ నాయకుల కబంధ హస్తాల్లో సిబిఐ బందీకావడం అత్యంత విషాదం.

**సిబిఐ సోదాలను, దర్యాప్తులను నిరాకరిస్తున్న రాష్ట్రాలు**

అంతర్గత విభేదాలతో నిర్వాహణ పరమైన సమస్యలతో సిబిఐ ప్రతిష్ట మసకభారి, పనితీరు మందగించింది. అనేక అనుమానాల మధ్య తన పాత్రను సమర్ధవంతంగా నిర్వహించలేకపోయింది. ఈ క్రమంలో ఈ సంస్థను అడ్డం పెట్టుకొని కేంద్ర ప్రభుత్వం రాజకీయ కక్ష సాధింపు చర్యలకు తెరలేపింది. ఈ దుర్మార్గాన్ని దూరం చేయడానికి కేంద్ర దర్యాప్తు సంస్థకి రాష్ట్రాల్లో సోదాలు, దర్యాప్తు చేసే అధికారాన్ని నిరాకరిస్తూ, విశ్వాసం కోల్పోయిన ఈ సంస్థ ప్రమేయం అవసరం లేదని మొదటగా ఆంధ్రప్రదేశ్‌లో ప్రారంభమై పశ్చిమ బెంగాల్, హరియాణా, చత్తీస్‌గడ్, మహారాష్ట్ర, హిమచల్ ప్రదేశ్ రాష్ట్రాలు సంచలన నిర్ణయాలు తీసుకున్నాయి. ఢిల్లీ స్పెషల్ పోలీసు ఎస్టాబ్లిష్‌మెంట్ చట్టం 1941 ప్రకారం కేంద్రం సిబిఐని ఏర్పాటు చేసింది. ఈ మేరకు ధాఖలు పడిన అధికారాలను సిబిఐ ఢిల్లీ భూ భాగంలోనే అమలు చేయడానికి అవకముంది. ఢిల్లీ బయట ఏ రాష్ట్రంలోనైనా తన అధికారాలను అమలు చేసి సోదాలు, దాడులు, దర్యాప్తులు చేపట్టాలంటే ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు అనుమతి తెలపాల్సి ఉంది. అవినీతి నిరోధక చట్టం 1988 ఐపిసిలోని కొన్ని సెక్షన్ల ప్రకారం రాష్ట్రాలలో సిబిఐ తన అధికారాలను వినియోగించుకోవాంటే ఆయా రాష్ట్రాల సాధారణ సమ్మతి (జనరల్ కన్సెంట్) తెలపాల్సి ఉంది. పైన పేర్కొన్న రాష్ట్రాలు గతంలో ఇచ్చిన సమ్మతి నోటిఫికేషన్‌ను ఉపసంహరించుకున్నట్లు కేంద్రానికి తెలియజేశాయి. ఫలితంగా రాష్ట్రాలలోని కేంద్ర ప్రభుత్వ శాఖలు, కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థలో పనిచేసే సిబ్బందిపై దర్యాప్తు చేయడానికి సిబిఐకి అవకాశముండదు.

కేంద్ర ప్రభుత్వ ఆధీనంలోని సిబిఐ రాష్ట్ర ప్రభుత్వ పరిధిలోని అవినీతి నిరోధక శాఖ (అనిశా) అవినీతి నిరోధక చట్టం (పిసి యాక్ట్) ప్రకారం కేసులు నమోదు చేసి దర్యాప్తు చేపడుతుంటాయి. ఈ సాధారణ సమ్మతి ఉపసంహరణతో సిబిఐ రాష్ట్ర భూ భాగంలో తన అధికారాలను అమలు చేసేందుకు వీలు లేకుండా పోయింది. ఈ నేపథ్యంలో ఈ పాత్రను అవినీతి నిరోధక శాఖయే పోషించే అవకాశముంది. రాష్ట్రంలో పనిచేస్తూ అవినీతికి పాల్పడే కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థల్లో పనిచేసే ఉద్యోగులపై ఆదాయపు పన్నుశాఖ, పోర్టులు, తపాలా కార్యాలయాలు, సెంట్రల్ ఎక్సైజ్, టెలిఫోన్ కార్యాలయ ఉద్యోగులపై దర్యాప్తు చేయడానికి యాక్టు ప్రకారం అవినీతి నిరోధక శాఖకు మాత్రమే అవకాశముంది. కొన్ని సంఘటనలు, సందర్భాలలో సిబిఐతో పోలిస్తే రాష్ట్ర దర్యాప్తు సంస్థలే వృత్తిపరంగా మెరుగ్గా వ్యవహరిస్తున్నాయి, ఆధునికంగా కూడా ఉన్నాయి. దర్యాప్తు అధికారాలతో పాటు సరిపడా సిబ్బంది, పబ్లిక్ ప్రాసిక్యూటర్లు అవసరమైన సాధనా సంపత్తి మెరుగ్గా ఉన్నట్లు రాష్ట్రాలు ధృవీకరించాయి.

**సిబిఐ బాధ్యతలు చేపట్టిన మన్నెం నాగేశ్వరరావు**

అవినీతిపై కొరడా ఝుళిపిస్తామంటూనే అనేక అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటున్న హిందుత్వవాది మన్నెం నాగేశ్వరరావును దేశ అత్యున్నత దర్యాప్తు సంస్థ సిబిఐకి తాత్కాలిక డైరెక్టర్‌గా నియమించారు. ఇతనికి హిందూ సంస్కృతి వారసత్వాన్ని పునరుద్ధరించే సిద్ధాంతాల పట్ల అత్యంత ఆసక్తి ఉన్న వ్యక్తిగా గుర్తింపు ఉంది. ప్రత్యేకించి హిందుత్వ సంస్థలకు వెన్నెముకగా భావించే రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (ఆర్‌ఎస్‌ఎస్) లోని కీలక సభ్యులతో ఆయనకు సాన్నిహిత్యం ఉంది. హిందుత్వ సంస్థలు నిర్వహించే పలు వేదికల్లో పాల్గొని తన అభిప్రాయాలను వెల్లడించినారు. ప్రభుత్వ నియంత్రణ నుంచి హిందూ ఆలయాలకు స్వేచ్ఛ కల్పించాలని డిమాండ్ చేస్తున్న పలు సంస్థలతో కలిసి పనిచేస్తున్నాడు. మైనారిటీలకు అనుకూలంగా ఉన్న పలు చట్టాలను రద్దు చేయాలని ప్రయత్నిస్తున్నాడు. ప్రధానంగా బీఫ్ ఎగుమతులపై నిషేధం విధించాలని ఆ విధంగా చేస్తేనే దేశ సంస్కృతి వారసత్వం పునరుద్ధరణ జరుగుతుందన్న సంస్థలతో మమేకమై పనిచేస్తున్నారు. వీటితో పాటుగా ఈ లక్ష్యాలను ప్రచారం చేస్తున్న హిందుత్వ మేథోమధన సంస్థలుగా భావించే ఇండియా పౌండేషన్, వివేకానంద ఇంటర్‌నేషనల్ పౌండేషన్ నిర్వహించే కార్యక్రమాలకు ఆయన హాజరవుతూ వారిలో ఈ విన్యాసాల పట్ల మరింత స్ఫూర్తిని నంపే ప్రయత్నం చేస్తున్నారు. వీటితో పాటు గతంలో ఆర్‌ఎస్‌ఎస్ ప్రచారక్‌గా పనిచేసి ప్రస్తుత బిజెపి జాతీయ నేతగా మారిన రామ్‌మాదవ్‌కు అత్యంత సన్నిహితులు. హిందువులకు సంబంధించిన ముఖ్యమైన డిమాండ్స్‌తో కూడిన చార్టర్‌ను రూపొందించిన ఏడుగురు కీలక వ్యక్తుల్లో నాగేశ్వరరావు ముఖ్యుడు.

సిబిఐ ప్రస్తుత తాత్కాలిక బాధ్యతలు చేపట్టిన మన్నెం నాగేశ్వరరావుపై

# పటేల్ విగ్రహ రాజకీయాలు

***సర్దార్ పటేల్ విగ్రహం పేరుతో వేల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని దుర్వినియోగం చేస్తూ, ప్రజలను నిరాశ్రయులను చేస్తూ బిజెపి విగ్రహ రాజకీయాలను నెరపుతోందని అంటున్నారు బి. రామకృష్ణ***

ప్రపంచంలో ఎత్తైన 182 మీటర్ల పటేల్ విగ్రహాన్ని నిర్మించి ప్రపంచ రికార్డు సాధించి ఈ విగ్రహాన్ని చూసి తరించమంటున్నారు. మూడు వేల కోట్ల రూపాయలను లెక్క చేయకుండా దేశ ప్రతిష్ఠను నలు చెరుగులా ప్రతిబింబింప చేస్తున్నందుకు గర్వపడమంటున్నారు. ఉక్కుమనిషిగా పేరుగాంచిన పటేల్‌కు ప్రపంచంలోనే అతిపెద్ద ఇనుప విగ్రహాన్ని నిర్మించి ఆయనకు గౌరవాన్ని తెచ్చినందుకు ఆనందపడమంటున్నారు. ఆయన కోల్పోయినాడని మోడీ అతని పరివారం భావిస్తున్న గౌరవాన్ని తిరిగి ఇవ్వాలని పటేల్‌ను కాంగ్రెస్ నుండి విడదీసి తమ ఖాతాలో వేసుకోవాలనుకుంటున్నారు. చరిత్రను, పునాదులను అరువు తెచ్చుకోవాలనుకుంటున్నారు. స్వాతంత్ర పోరాటంలోగాని, సామాజిక ఉద్యమాల్లోగాని, వివక్షతలకు వ్యతిరేకంగా, సమానత్వ విలువల కోసం ఎటువంటి పోరాటం చేసిన చరిత్రలేనివారు ఏదో చేసినట్లుగా భ్రమింపచేయడం కోసం, శివాజీ, రామ, పటేల్ వంటి విగ్రహాలలో వెతుక్కుంటున్నారు. పటేల్‌ను కౌగిలించుకుంటున్నారు. సంఘ్ పరివార్‌కు జాతీయస్థాయిలో స్వాతంత్ర పోరాటంలో పాల్గొన్న చరిత్ర కలిగిన నాయకుడొక్కరు లేరు. సావర్కర్ వంటివారికి బ్రిటిష్ వారి నుండి క్షమాభిక్ష వేడుకున్న చరిత్ర ఉన్నది. హిందూ మతోన్మాదాన్ని రెచ్చగొడుతూ దానినే జాతీయ వాదంగా ముందుకు తెస్తున్నారు. ఉత్తరప్రదేశ్‌లో ముఖ్యమంత్రి యోగి ఆదిత్యనాథ్ రాముడి విగ్రహాన్ని నిర్మిస్తున్నాడు. మహారాష్ట్రలో పటేల్ విగ్రహం కంటే ఎత్తైన 212 మీటర్ల శివాజీ విగ్రహాన్ని నిర్మించడానికి సన్నద్ధం అవుతున్నారు.

గుజరాత్ ప్రభుత్వం విగ్రహ ఏర్పాటు సందర్భంగా పటేల్ చేసిన పనులను వివరిస్తూ 2013లో ఒక పుస్తకాన్ని ముద్రించింది. అందులో 565 సంస్థానాలను ఒంటి చేతితో భారత యూనియన్‌లో కలిపినట్లుగా గొప్పగా కీర్తించారు. అలా చేయబడకుంటే ప్రతి దేశానికి వెళ్లడానికి వీసాలు అవసరమయ్యేవని వివరించారు. బ్రిటిష్ వాళ్లు తమ అధికారాన్ని వదులుకునే సమయంలో చాలావరకు సంస్థానాలు చిన్న చిన్నవిగా ఉన్నాయి. అవి స్వతంత్రంగా ఉండడం కంటే కలవడానికే సిద్ధపడ్డాయనే విషయాన్ని మరుగున వేసే ప్రయత్నం చేస్తున్నారు మోడీ, అతని సంఘ్ పరివారం. సంస్థానాలను కేవలం పటేల్ మాత్రమే విలీనం చేశాడనే తప్పుడు ప్రచారం చేస్తున్నారు.

నెహ్రూ ప్రధానిగా ఉన్న కాంగ్రెస్ పార్టీ మంత్రివర్గంలో హోంమంత్రిగా ఉంటూ కేబినెట్ నిర్ణయాలను అమలు చేసే ప్రయత్నంలోనే ఇదంతా జరిగిందని తెలియనివ్వకుండా జాగ్రత్త పడుతుంటారు. నెహ్రూ, పటేల్, ఇతర మంత్రివర్గ సభ్యుల సమిష్టి అవగాహనలో భాగంగానే మొత్తం మీద అప్పటి కాంగ్రెస్ పార్టీ ఆలోచనలకు అనుగుణంగానే విధాన నిర్ణయాలు జరుగుతాయనే దాన్ని కప్పిపుచ్చే ప్రయత్నం చేస్తూ ఒక్క పటేల్‌ను మాత్రమే గొప్పగా చూపాలనుకుంటున్నారు.

పటేల్ ఏనాడు కూడా రాష్ట్రీయ స్వయం సేవక్‌సంఘ్‌లో భాగస్వామిగా లేడు. కాని ప్రస్తుతం ఆయన్ని తమ మూలాలుగా చూపాలనుకుంటున్నారు. హైదరాబాద్, జునాఘడ్ సంస్థానాలను పరిపాలిస్తున్న ముస్లిం రాజులను మెడలు వంచి భారత్‌లో కలిపేలా చేశాడని అందుకే అతన్ని ఉక్కుమనిషని అంటున్నారు. 565 సంస్థానాలను కలిపి బలమైన రాజ్యంగా మలిచాడని కీర్తిస్తున్నారు. అప్పట్లో హైదరాబాద్ సంస్థానం అతిపెద్దది, ధనవంతమైనట్టిది, పైగా ముస్లిం అయిన నిజాం పాలనలో ఉన్నది. దానిపై పైచేయి సాధించడం ఆర్ఎస్ఎస్‌కు సంతోషదాయకమే కదా. అలాగే ముస్లిం రాజుల పాలనలో ఉన్న గుజరాత్‌లోని జునాఘడ్ సంస్థానాన్ని స్వాధీనం చేసుకోవడం, అందుకోసం వాటిపై సైనిక దాడులు చేసి బలవంతంగా కలిపేసుకోవడాన్ని సహజంగానే ఆర్ఎస్ఎస్ శక్తులు హర్షిస్తాయి.

నిజానికి హైదరాబాద్ రాజ్యంపై సైనిక దాడి చేయడం వెనుక నిజాంను లొంగదీసుకోవడం కంటే కూడా అక్కడ జరుగుతున్న కమ్యూనిస్టు ఉద్యమ వెల్లువను అణచివేయడం ప్రధాన అంతస్సూత్రంగా

---

అవినీతికి సంబంధించిన ఎన్నో పిర్యాదులున్నాయి. గతంలో సిబిఐ నుంచి నాగేశ్వరరావును తొలగించి అతనిపై విచారణ జరిపించాలన్న డైరెక్టర్ వర్మ ఆదేశాలను పక్కకు పెట్టి కేంద్ర విజిలెన్స్ కమిషనే కాపాడిందని సుప్రీంకోర్టు న్యాయవాది గతంలోనే ఆరోపించారు.

సిబిఐలో చోటు చేసుకున్న ఈ వివాదం కేంద్రంలో పోటెత్తిన అవినీతి మోదీ సర్కారు ప్రచారం చేసుకుంటున్న సుపరిపాలనలోని డొల్లతనాన్ని బయటపెడుతుంది. సర్కారు అనుసరిస్తున్న దివాలకోరు చర్యలతో దేశం, రాజ్యాంగం ప్రమాదంలో పడనుంది. తటస్థ వైఖరిని అనుసరించాల్సిన ప్రధాన కార్యాలయం ఏకపక్షంగా అస్తానాను సమర్థించడంపై పలు అనుమానాలొస్తున్నాయి. రాజకీయ ప్రత్యర్థులపై ప్రతీకారం తీర్చుకునేందుకు సిబిఐ, ఆర్‌బిఐ లాంటి కీలక సంస్థలను గంపగుత్తగా వాడుకునే రాజకీయ దుర్వ్యవస్థ ఉన్నంత కాలం ప్రజాస్వామ్య ప్రభుత్వాలు నేతి బీరకాయలే అవుతాయి. స్వతంత్ర భారత ప్రజాస్వామ్య వ్యవస్థ విశ్వసనీతకు భంగపాటు తప్పదు. సిబిఐ లాంటి అత్యున్నత నేర పరిశోధక సంస్థ ఉన్నతీకరణ లక్ష్యాలు తిరుగులేని బలోపేతంపై పునర్నిర్వహించుకోవాల్సిన తరుణం ఆసన్నమైంది. కీలుబొమ్మ అవతారానికి ఇక స్వస్తి పలకాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్ తెలంగాణ యూనివర్సిటీ)* వీ

ఉందనేది దాచేయబడుతున్న సత్యంగా గుర్తించాలి. 'ఆపరేషన్ పోలో' వివరాలను శోధిస్తే ఈ విషయం బయటపడుతుంది.

పటేల్ విగ్రహ నిర్మాణ సందర్భంలో 2013లో గుజరాత్ ప్రభుత్వం విడుదల చేసిన పుస్తకంలో హైదరాబాద్ రాజ్యం గురించి రాస్తూ రజాకార్లతో కమ్యూనిస్టులు కలిసి అరాచకాలు సృష్టించారని కమ్యూనిస్టులపై నిందలు వేస్తూ పచ్చి అబద్ధాలను రాశారు. చరిత్రను వక్రీకరించడం, తమకు అనుకూలంగా మల్చుకోవడం వీరికి వెన్నతో పెట్టిన విద్య. ఆర్ఎస్ఎస్ శక్తులు కోరుకుంటున్న అఖండ భారత్ భావనకు పటేల్ హోంమంత్రిగా ఉన్నప్పుడు జరిగిన ఏకీకరణ దగ్గరగా ఉన్నందువలన బిజెపి, ఆర్ఎస్ఎస్ శక్తులకు పటేల్‌ను కీర్తించడం అవసరమైంది. నేడు హిందూ ఫాసిజం జడలు విప్పుకుని ఊరేగుతున్న సందర్భంలో ఏకీకరణ అంశం, ముస్లిం రాజులపై దండయాత్రల్లాంటివి చేయడం వంటి వాటికి కారకుడుగా పటేల్‌ను చిత్రీకరించి కౌగిలించుకోవడం బిజెపి, ఆర్ఎస్ఎస్‌లకు అవసరంగా మారింది. ఏకీకరణను అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం బలవంతంగా చేసిన పనిగా కాకుండా విడదీసి పటేల్ అనే వ్యక్తికి ఆపాదించి కాంగ్రెస్ పార్టీని దూరం పెట్టే కుట్రగా కూడా అర్థం చేసుకోవచ్చు.

ఎన్నో జాతులుగా ఉన్న ప్రాంతాలను బలవంతంగా కలిపేసుకోవడం దురాక్రమణగానే చూడవల్సి ఉంటుంది. జాతులకు స్వయం నిర్ణయాధికారం ఉండేలా వాటంతటవే సమ్మతితో కలిసి ఉండేలా ఇష్టం లేనప్పుడు విడిపోయి తమ స్వంత అస్థిత్వాలతో మనుగడ సాగించేలా ఒక ఫెడరల్ వ్యవస్థగా ఏర్పరచబడకుండా పెద్దన్న పాత్రలో బలవంతంగా కలిపేసుకోవడం అనేది సామ్రాజ్యవాదం అవుతుంది. అసలు పటేల్‌ను స్వంతం చేసుకోవడమే ఓ కుట్ర. పటేల్‌ను ముస్లిం రాజులపై దూకుడుగా సైన్యంతో దాడులు చేసి కలిపేసుకున్న శక్తిమంతుడిగా చూపడం వారికి అవసరంగా మారింది.

1948లో గాంధీని హత్యచేసిన నాథూరాం గాడ్సే సంఘ్ పరివార్ భావజాలంతో ప్రేరేపితుడయ్యాడని తెల్సిన విషయమే. ఈ హత్యలో కుట్రదారులుగా ఆర్ఎస్ఎస్ ప్రత్యేకించి హిందూ మహాసభలకు చెందిన సావర్కర్‌ల పాత్రను వివరిస్తూ హోంమంత్రిగా పటేల్ అప్పటి ప్రధానమంత్రి నెహ్రూకు ఉత్తరాలు రాసిన చరిత్ర కళ్లముందే ఉన్నది. గాంధీ హత్య తరువాత నెహ్రూ, పటేల్‌ల మధ్య జరిగిన సంభాషణలు, ఉత్తర ప్రత్యుత్తరాలను పరిశీలిస్తే ఈ విషయాలు స్పష్టంగా తెలిసొస్తాయి. గాంధీని హత్య చేసిన గాడ్సేను దుర్మార్గుడనో, టెర్రరిస్ట్ అనో ఆర్ఎస్ఎస్ శక్తులు ఏనాడు ఎక్కడా చెప్పిన దాఖలాలు లేవు. కాని గాడ్సేకు ఆర్ఎస్ఎస్‌కు సంబంధం లేదని మాత్రం చెబుతుంటారు. తామనుకున్న దుర్మార్గాలను చేయించేసి వాటితో తమకు సంబంధం లేదని చేతులు కడుక్కునే సంస్కృతికి వీరు వారసులని అనేక సంఘటనలు చరిత్రలో ఉన్నాయి. అదే చరిత్ర ఇప్పటికీ కొనసాగుతున్నది.

హిందూ మతోన్మాదాన్ని వ్యతిరేకిస్తూ ప్రజల్లో ప్రభావితం చేయగలిగే వ్యక్తులను హత్యలు చేయిస్తున్నారు. ఈ హత్యలు చేసినవారు చట్టానికెన్నడూ దొరకరు. దొరికినట్లనిపించినా కోర్టుల్లో శిక్షలు పడవు నిరపరాధులుగా విడుదలవుతుంటారు. ఇదంతా ఒక బహిరంగ రహస్య వ్యవహారంగా మారింది. ఈ హంతకుల మూలాలు ఎక్కడున్నాయో తెలుస్తూనే ఉంటుంది. గౌరీ లంకేశ్, దభోల్కర్, పన్సారే, కల్బుర్గీ వంటి లౌకిక, హేతువాద, ప్రజాతంత్రవాదులను గత రెండు మూడేండ్ల కాలంలో బహిరంగంగానే చంపేశారు. లంపెన్‌లను చేరదీయడం కిరాయి హత్యలు చేయించడం లేదా మతోన్మాదం తలకెక్కించిన ఉన్మాదులచే చంపించడం, వారు అదేదో గొప్పపని చేసినట్లుగా భావించుకునేలా చేయడం జరుగుతున్నది. 2002లో గుజరాత్‌లో ముస్లింలపై జరిగిన మారణకాండ దీనినే చూపిస్తున్నది. ఎక్కడైతే సంఘ్ పరివార్ శక్తులు బలంగా ఉంటున్నాయో లేదా విస్తరిస్తున్నాయో అక్కడ ఇలాంటి హత్యలు, దాడులు జరుగుతుంటాయి. గుళ్లు, దేవుళ్లు, ఆచార సంప్రదాయాలను మతం పేరు మీద ఉపయోగించుకుని ప్రజల్లో విద్వేషాలను, పరమత ద్వేషాలను రెచ్చగొట్టడం బెదిరింపులు, దాడులు చేయడం వారి కార్యాచరణలోని విషయాలు. గాంధీ హత్య జరిగిన వెంటనే హోం మంత్రిగా ఉన్న పటేల్, ప్రధానిగా ఉన్న నెహ్రూ కాంగ్రెస్ ప్రభుత్వం ఆర్ఎస్ఎస్‌ను 1948 జనవరి 30న నిషేధించింది. ఆర్ఎస్ఎస్ కార్యకర్తలపై అలాగే ఆర్ఎస్ఎస్ నిర్వహించే బహిరంగ గీతా తరగతులపై గట్టి నిఘాను ఏర్పాటుచేసారు. ఆర్ఎస్ఎస్ చర్యలలో చురుకుగా పాల్గొంటున్న ప్రభుత్వ ఉద్యోగులను అరెస్ట్ చేసినట్లు నెహ్రూకు 1948 ఫిబ్రవరి 27న పటేల్ వివరించాడు. హిందూ మహాసభ సావర్కర్ ప్రత్యక్ష నేతృత్వంలోనే గాంధీ హత్యకు కుట్ర జరిగిందన్న బలమైన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు పటేల్. ఒక హోంమంత్రిగా తనకున్న అధికారిక సమాచారంతోనే ఈ నిర్ణయానికి వచ్చాడు.

ఆర్ఎస్ఎస్ నాయకుడైన శ్యామ ప్రసాద్ ముఖర్జీకి 1948 జులై 18న పటేల్ ఉత్తరం రాస్తూ దేశవ్యాప్తంగా ప్రభుత్వ అస్థిత్వానికి ఆర్ఎస్ఎస్ కార్యకలాపాలు ప్రమాదకరంగా ఉన్నాయని వివరించాడు. ఆర్ఎస్ఎస్, హిందూ మహాసభల కార్యకలాపాల వల్ల గాంధీజి హత్య జరిగిందని హిందూ మహాసభలో తీవ్రవాద వర్గం గాంధీ హత్యతో కుట్రలో పాల్గొన్నారనడంలో ఏ మాత్రం సందేహం లేదని పేర్కొన్నాడు. రాజ్యాంగానికి కట్టుబడి ఉంటామని, జాతీయ జెండాను గౌరవిస్తామని వివరిస్తూ ఆర్ఎస్ఎస్‌పై నిషేధాన్ని ఎత్తేయమని దాని నాయకుడు గోల్వాల్కర్ హోం మంత్రిగా ఉన్న పటేల్‌కు విజ్ఞప్తులు చేసాడు నిషేధం విధించిన సంవత్సరంన్నర తరువాత ఆర్ఎస్ఎస్‌పై జులై 1949లో నిషేధం ఎత్తేసారు. ఆర్ఎస్ఎస్ రాజకీయాలలో పాల్గొనదని చెప్పినవారు ఒట్టు తీసి గట్టున పెడుతూ రాజకీయ విభాగమైన జనసంఘ్‌ను ఏర్పాటు చేశారు. ఇది తరువాత బిజెపిగా రూపాంతరం చెందింది. ఆర్ఎస్ఎస్ నాయకత్వం తొలినాళ్ల నుండి కూడా బ్రిటిష్ ప్రభువులకు, వారి పాలనకు విధేయులుగానే ఉంటూ వచ్చింది. ఆర్ఎస్ఎస్ స్థాపకుడు హెగ్డేవార్ కాంగ్రెస్, గాంధీలు చేపట్టే ఉద్యమాల్లో పాల్గొనరాదని ఎన్నోసార్లు విజ్ఞప్తులు చేశాడు. సావర్కర్‌కు దగ్గరగా ఉన్నాడని గాంధీని కాపాడడంలో విఫలం అయ్యాడని పటేల్‌పై అనుమానాలు కూడా చరిత్రలో చోటుచేసుకున్నాయి. ఆర్ఎస్ఎస్ కార్యకర్తలను దేశభక్తులని, వారిని గాంధీ హత్య జరగక ముందు కాంగ్రెస్ పార్టీలోకి ఆహ్వానించాడు. వారిని దండించడం సరికాదని దండనను ఉపయోగించి ఏ సంస్థనైనా అణచేయలేమని, ఇలా చేయడం దొంగలు, బందిపోట్ల కోసం పనికొస్తుందని అన్నాడు. ఆర్ఎస్ఎస్ కార్యకర్తలు ఈ దేశాన్ని ప్రేమిస్తున్నారని అయితే వారి ఆలోచనలు తప్పుదోవ పట్టాయని వారిని ప్రేమతో కాంగ్రెస్ వాళ్లు గెలుచుకోవాలని పటేల్ అభిప్రాయపడ్డాడు. దేశ విభజన సమయంలో లక్షలాది మంది ఊచకోతలకు గురౌతున్నప్పుడు హోం మంత్రిగా పటేల్ చేసిందేమిలేదని, మౌనపాత్ర వహించాడని అనేక విమర్శలున్నాయి.

అంబేద్కర్‌ను రాజ్యాంగ పరిషత్‌కు ఎన్నిక కాకుండా ఓడించడానికి పటేల్ చేసిన దుష్టపన్నాగాలు, ప్రయత్నాలు దాచేస్తే దాగని చరిత్రే.

ఆర్ఎస్ఎస్ వద్ద ప్రజల్ని ఏకం చేయడానికి ప్రజా సంక్షేమ ఎజెండా గాని, ఆర్థిక, సాంఘిక, రాజకీయ సమానత్వ ప్రాతిపదికగా కార్యాచరణ లేదు. ఎంతసేపటికి పరమత ద్వేషం, హిందూ జాతీయవాదం ఆధారంగా, ఎదుగుతూ వచ్చింది. నిచ్చెనమెట్ల కులవ్యవస్థను నిలబెడుతూ ముందు కొస్తున్నది. ఈ నేపథ్యంలో ఏకీకరణకు చిహ్నంగా పటేల్‌ను చూపెడుతూ తమ భావజాలానికి అనుకూలంగా పటేల్‌ను చిత్రీకరించి లబ్ధి పొందాలని అనుకుంటున్నారు. అయితే హోంమంత్రిగా పటేల్ ఆర్ఎస్ఎస్‌ను నిషేధించిన సంగతిని మరుగున పడేస్తుంటారు. మతతత్వ శక్తులను, మతోన్మాదాన్ని వ్యతిరేకిస్తూ 1948లో చాలా స్పష్టంగా ఈ దేశం ఎప్పుడూ కూడా లౌకిక దేశంగా తప్ప మరోలా ఉండదని చెప్పిన విషయాన్ని దాటవేస్తుంటారు. పటేల్ పాటించిన లౌకిక విలువలను కాలరాస్తూనే ఆయనను కీర్తించడం బిజెపి, ఆర్ఎస్ఎస్‌లకే చెల్లింది.

మోడీ గుజరాత్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు తాను అధికారంలోకి వచ్చి పదేళ్లు పూర్తయిన సందర్భంగా 2010లో వల్లభాయి పటేల్ విగ్రహ ప్రాజెక్టును ప్రకటించారు. దీనికయ్యే ఖర్చును గుజరాత్ ప్రభుత్వమే భరిస్తుందని చెప్పారు. దీనికోసం ప్రత్యేకంగా సర్దార్ వల్లభాయ్ పటేల్ రాష్ట్రీయ ఏక్తా ట్రస్టును 2011లో మోడీ ఏర్పాటు చేసాడు. 2013, అక్టోబర్ 7న పటేల్ విగ్రహానికి శంకుస్థాపన చేసాడు. అప్పటికే మోడి ప్రధాని అభ్యర్థిగా బిజెపిచే ప్రకటించబడి ఉన్నాడు. 2014లో కేంద్రంలో బిజెపి పూర్తిస్థాయి మెజారిటీతో అధికారంలోకి వచ్చాక ఈ ప్రాజెక్టు నిర్మాణం వేగవంతం చేసి చివరగా 31 అక్టోబర్ 2018న విగ్రహావిష్కరణ తో ముగించారు. అటు గుజరాత్ రాష్ట్రంలో, ఇటు కేంద్రంలో బిజెపి అధికారంలో ఉండడం వలన ఈ ప్రాజెక్టును నిర్మించడం సులభమైంది.

ఈ అతిపెద్ద విగ్రహం వేలాది ఆదివాసీ జీవితాలను చిన్నాభిన్నం చేసింది. దాదాపుగా 70 గ్రామాలు దీనికోసం బలిచేయబడ్డాయి. ఈ ప్రాజెక్టు పర్యావరణ, అటవీ చట్టాలను ఉల్లంఘించి నిర్మించబడింది. స్థానిక ఆదివాసులతో సంప్రదించిందీలేదు. పర్యావరణ అనుమతులు తీసుకున్నదీ లేదు. తామనుకున్నదే తడవుగా, ప్రజలు, పర్యావరణం వేటినీ లెక్కచేయకుండా పటేల్ విగ్రహాన్ని నిర్మించారు. దీని వెనుక జీవితాలు కోల్పోయిన వేలాదిమంది ఆదివాసులున్నారు. మరోవైపు మిరుమిట్లు గొలిపేలా పర్యాటక క్షేత్రంగా రూపుదిద్దడానికి స్టార్ హోటళ్లు, రోడ్లు, కృత్రిమ సరస్సును ఏర్పాటు చేశారు. ఉన్న జీవికను ఊడగొట్టి స్థానిక ఆదివాసులకు ఉపాధి పెరుగుతుందని 31అక్టోబర్ 2018న పటేల్ విగ్రహాన్ని ఆవిష్కరిస్తూ మోడీ చెబుతాడు. ఇదెంత వంచనో, మోసమో అర్థం చేసుకోవచ్చు. దీనికోసం భూములు వదులుకున్న రైతులకు కృతజ్ఞతలు చెబుతాడు మోడీ. అసలు విషయమేమంటే అధికారిక దౌర్జన్యాలతో ప్రజలతో సంప్రదింపులు చేయకుండానే భూములు లాక్కోబడ్డాయి. ఇక్కడ ట్రైబల్ మ్యూజియం ఏర్పాటు చేసి వారిని గౌరవిస్తున్నామని చెబుతున్నారు. ఇది వారి జీవితాలను ఛిద్రం చేసి వారిని ఒక 'షో పీస్‌లు'గా చూపిస్తూ అవమానించడమే తప్పిస్తే మరోటికాదు.

సమాచార హక్కు చట్టం కింద పర్యావరణ చట్టాల అమలు, వినియోగించిన ఖర్చు, సమావేశ వివరాలు అడిగితే పర్యావరణ చట్టాల అమలు అవసరం లేదని పర్యావరణ ప్రభావ అంచనా, సామాజిక ప్రభావ అంచనా వంటి వాటి ప్రసక్తే తలెత్తదని అధికారికంగా వివరణలిచ్చారు. బహిరంగంగానే చట్ట ఉల్లంఘనలకు పాల్పడ్డారు. ఈ ప్రాజెక్టు బాధితులకు భూసేకరణ చట్టం 2013 ప్రకారం పరిహారం ఇవ్వలేదు. అసలిక్కడ ఈ చట్టం అమలే చేయబడలేదు. ఈ చట్టాన్ని వ్యతిరేకిస్తూ ప్రజలకు నష్టం చేసే మరోచట్టాన్ని గుజరాత్ రాష్ట్రం స్వంతంగా తయారు చేసుకుని అమలు చేస్తున్నది. గతంలో సర్దార్ సరోవర్ డ్యామ్ వల్ల లక్షలాది మంది ప్రజలు నిరాశ్రయులయ్యారు. అప్పుడు పెద్దఎత్తున దీనికి వ్యతిరేకంగా ఉద్యమాలు వచ్చాయి. తీవ్రమైన నిరసనలు, ప్రతిఘటనా పోరాటాలు ముందుకొచ్చాయి. వీటిలో మేధాపాట్కర్ చురుకుగా పాల్గొన్నారు. ఈ నిరసనల నేపథ్యంలో సర్దార్ సరోవర్ డ్యాం నుండి ప్రపంచబ్యాంకు సహితం వెనక్కి తగ్గింది. అయినా కూడా ఫలితం లేకుండా పోయింది. ప్రజల బాగోగులను తుంగలో తొక్కుతూ నోరులేని వారిని నిరాశ్రయులను చేస్తూ, నిర్బంధాలు, అక్రమకేసులు, జైళ్లు, చిత్రహింసలతో నిరసన గొంతులను నులిమేస్తున్నారు. ఇందుకొరకు వారి చేతుల్లో కోర్టులు, పోలీసులు, స్థానిక అధికార యంత్రాంగం ఆయుధాలుగా ఉంటున్నాయి. ప్రజలను రక్షించడానికి, వారి జీవితాలను మెరుగు పరచడానికి సమగ్రమైన, సమానమైన అభివృద్ధిని అందించడానికి పాటు పడవల్సిన ఇవి వారిపై అణచివేతలకు పాల్పడుతుండడం అనేది భారత ప్రజాస్వామ్యం ఎంతగా అభాసు పాలవుతున్నదో, ఎండమావిగా మిగులుతున్నదో తెలుసుకోవచ్చు.

నిరాశ్రయులైన ప్రజలు, మునిగిన గ్రామాలు, పర్యావరణ నష్టం మొదలైన వాటిని పక్కన పెట్టినప్పటికీ కూడా కేవలం ఈ భారీ విగ్రహ ప్రాజెక్టు నిర్మాణం కోసం చేసిన ఖర్చును లెక్కలోకి తీసుకుంటే లక్ష ఎకరాలకు సాగునీరు అందించవచ్చు. ఇంత పెద్ద మొత్తాన్ని మంచినీళ్ల ప్రాయంగా ఖర్చు చేస్తున్న వారికి ఈ దేశంలోని ఆకలి, అవిద్య, దరిద్రం, ఆరోగ్యం, కనీస వసతులు గుర్తుకు రాకపోవడం క్షమించరానిది. మోడీ ప్రభుత్వం మహిళా, సమగ్ర శిశు అభివృద్ధి పథకం, గ్రామీణ ఉపాధి పథకం చదువులకు సంబంధించి బడ్జెట్‌లలో కేటాయింపులు గతంలో కంటే కూడా తగ్గించి వేసింది. మౌలిక సౌకర్యాలు మరిచి ఐక్యతా విగ్రహం పేరుతో ఐక్యత కాదు కదా కలిసిమెలిసి ఒక ప్రాంతంలో నివసిస్తున్న ప్రజలను నిరాశ్రయులను చేయడం ద్వారా చెట్టుకొకరు పుట్టకొకరుగా విడగొట్టారు.

భారీ ప్రాజెక్టులు, డ్యామ్‌లు ఎప్పుడు కూడా నష్టమే చేస్తాయని పర్యావరణాన్ని నాశనం చేస్తాయని లక్షలాది మంది ప్రజలను నిరాశ్రయులను చేస్తాయని ప్రపంచవ్యాప్త అనుభవాలు ఉన్నాయి. దీనికి భిన్నమైనదేమీ కాదు పటేల్ విగ్రహ ప్రాజెక్ట్. ఏ ప్రాజెక్టు వ్యయం అయినా అది ప్రభుత్వాల లేదా పాలకుల స్వంత జేబుల్లో నుండి వచ్చేది కాదు. అది శ్రామికుల చెమట ఫలితం. ప్రజల శ్రమ ఫలితం. ఈ శ్రమ సంపదకు రక్షకుడిగా ఉండాల్సిన రాజ్యం భక్షకుడిగా మిగలడం విచారకరం. ప్రజల అభివృద్ధిని కాదని విగ్రహాల పేరు మీద వేల కోట్ల రూపాయలను దుర్వినియోగం చేయడమే కాకుండా వేలాదిమంది ప్రజలను నిరాశ్రయులను చేయడం, పర్యావరణాన్ని నాశనం చేస్తూ ప్రస్తుత, భావితరాలను ఇబ్బందుల పాల్జేయడం దుర్మార్గం. ఆ హక్కు ప్రభుత్వాలకు లేదని చెప్పడానికి పోరాటాలు తప్ప మరో మార్గం కనిపించడం లేదు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# మోడీ తోడూ నీడా అజిత్ దోవల్

***ఆర్ఎస్ఎస్ భావజాలంతో, కరుడుగట్టిన హిందుత్వవాది అయిన జాతీయ భద్రతా సలహాదారు అజిత్ దోవల్‌కు దేశ భత్రదకు సంబంధించి మరిన్ని అధికారాలను కట్టబెడుతూ నరేంద్ర మోడీ దేశంలో అప్రకటిత ఎమర్జెన్సీని అమలు చేస్తున్నారని అంటున్నారు బి.ఎస్.రాజు***

మన దేశ కేంద్ర ప్రభుత్వ పాలనా రంగంలో ఇప్పుడు కొన్ని పేర్లు వినపడడం లేదు. కొన్ని అత్యంత ప్రధానమంత్రిత్వ శాఖలు నామ మాత్రంగా మిగిలిపోయాయి. ఆయా శాఖల అమాత్యుల మొహాలు కనుమరుగై పోయాయి. వీటన్నిటికీ మొనగాడుగా వినపడుతున్న ఒకే ఒక్క పేరు 'అజిత్ దోవల్'. దేశరక్షణ మంత్రి, విదేశీ వ్యవహారాల మంత్రి, వీళ్ల వ్యక్తిత్వాలే కాదు, అడ్రస్సులు కూడా గల్లంతైనట్టుగా కన్పిస్తోంది. దేశ అంతర్గత భద్రతా వ్యవహారాల మంత్రి ఆకారం కనిపిస్తున్నా, ఆ మంత్రిత్వ వ్యవహారాలు చక్కబెడుతున్నది కూడా అజిత్ దోవలేనని అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

దేశాన్ని హిందుత్వ ఫాసిస్టు మార్గం వైపు మళ్లించడంలో ప్రముఖ పాత్ర పోషిస్తున్న దేశ ప్రధాని నరేంద్ర మోడీ, భారతీయ జనతా పార్టీ అధ్యక్షుడు అమిత్ షా ద్వయానికి మేథో సంపత్తిగా, నావికా చుక్కానిగా పనిచేస్తున్న సూపర్ ఇంటలిజెన్స్ హీరో అజిత్ దోవల్. ఈ ముగ్గురు ఓ హిందుత్వ త్రయంగా అవతరించిన వైనం మనం గమనించవచ్చు. ఆర్ఎస్ఎస్ కనుసన్నల్లో ఈ హిందుత్వ త్రయం ఇపుడు భారత రాజ్యాంగాన్ని శాసిస్తున్నది, దేశాన్ని గుప్పెట పట్టి పరిపాలిస్తున్నది. ముందు రాబోయేది రామ రాజ్యమేనని, అఖండ అజేయ పటిష్ఠ హిందుస్థానేనని ప్రభోదిస్తున్నది. ప్రచారం చేస్తున్నది. ఆ దిశగా గట్టిగా పనిచేస్తున్నది. ఈ కార్యక్రమం దిగ్విజయంగా కొనసాగడానికి పాలనాధికార కేంద్రీకరణ చాలా అవసరం. అందుకే అజిత్ దోవల్ హస్తాలను మరింత దారుఢ్యం గావించ తలపెట్టింది హిందుత్వ దళం. తదనుగుణంగా రాజ్య పాలనా వ్యవస్థలో పలు మార్పులు చేసి అజిత్ దోవల్‌కు ఉన్నత స్థానాలను కల్పించింది. ఉన్నతపీఠాలపై కూర్చుండబెట్టింది.

అజిత్ దోవల్ 1945లో ఇప్పటి ఉత్తరాఖండ్‌లో భాగమైన గర్వాల్‌లో జన్మించాడు. ఇతని తండ్రి ఓ సైనికాధికారి. ఆజ్మీర్‌లోని రాష్ట్రీయ సైనిక పాఠశాలలోను, ఆగ్రా విశ్వవిద్యాలయంలో చదువుకున్నాడు. ఆర్థిక శాస్త్రంలో 1967లో ఎంఎ పట్టా పొందాడు. 1968లో కేరళా కేడర్ ఐపిఎస్ ఆఫీసర్‌గా ఎన్నికయ్యాడు. భారత దేశంలో 'కీర్తి చక్ర' పతకం పొందిన మొట్టమొదటి ఐపిఎస్ ఆఫీసరట. పోలీసు వ్యవస్థ గూఢచర్య, రహస్య సమాచార సేకరణ విభాగాల్లో పనిచేసిన ఇతను సాహసిగా, వ్యూహ రచనలో మంచి దిట్టగా, దూసుకుపోయే పోలీసు అధికారిగా పేరుపొందాడు. ఆ వివరాలన్నీ అంతర్జాలంలో లభిస్తాయి కాబట్టి ఇక్కడ ఇవ్వడంలేదు. అయితే, ఈ వ్యాసం ద్వారా నేను చెప్పదలచుకున్న విషయం మోడీ భారత ప్రధానిగా ఎదిగిన క్రమంలో అజిత్ దోవల్ ఎదుగుదల, దేశ పాలనా వ్యవస్థలో అతను పోషిస్తున్న బహుముఖ పాత్రలు, వాటి చోదిత రాజకీయ పర్యవసానాల గురించి మాత్రమే!

అజిత్ దోవల్ కేంద్ర గూఢచర్య వ్యవస్థ (ఇంటలిజెన్స్ బ్యూరో) డైరెక్టర్‌గా ఉంటూ 2005 జనవరి 31న రిటైర్ అయ్యాడు. అప్పటి నుండి అతనేమైనా ఖాళీగా ఉన్నాడా? లేక ఇదివరకటి కన్నా మిన్నగా గొప్ప పనులేమైనా చేస్తూ వచ్చాడా? అనేది చూడాలి. 2005 నుండి 2014 వరకు, అంటే కేంద్రంలో మోడీ ప్రభుత్వం ఏర్పడేనాటికి అతను 'వివేకానంద అంతర్జాతీయ కేంద్రం (వివేకానంద ఇంటర్నేషనల్ ఫౌండేషన్)' స్థాపనకు ఆధ్యుడుగా, నిర్వహణాధికారిగా ఉన్నాడు.

ఇదో మితవాద భావజాల సంస్థ. హిందుత్వ ఆర్థిక, రాజకీయ భావజాల విస్తృతికై పనిచేసే మేథో తటాకం (థింక్ ట్యాంక్). నరేంద్ర మోడీ ప్రధాన మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన వెంటనే అజిత్ దోవల్ జాతీయ భద్రతా సలహాదారునిగా (నేషనల్ సెక్యూరిటీ అడ్వైజర్‌గా) నియమించబడ్డాడు.

విఐఎఫ్ ఢిల్లీ నుండి పనిచేస్తున్న ఓ మేధావి సంస్థ. దేశంలోని భద్రతా వ్యవహారాల నిష్ణాతులు, దౌత్య నిపుణులు, ఉన్నత పారిశ్రామిక వేత్తలు, దాతలు; వీరి సహాయ సహకారాలతో ఈ సంస్థ ఏర్పడింది. ప్రపంచ రాజకీయాల్లో తాను తప్పక నిర్వర్తించాల్సిన ఓ బలీయమైన పాత్రను పోషించడానికి తగ్గట్టుగా పటిష్ఠమైన, దుర్భేద్యమైన భారత దేశ నిర్మాణానికి కావలసిన చింతన, ఆలోచన, అభిప్రాయాలను అందించే ఉన్నత ప్రావీణ్యతా కేంద్రంగా ఈ సంస్థ ఉంటుందని తన వెబ్ సైట్ ద్వారా 'అంతర్జాతీయ వివేకానందా తాత్విక సంస్థ' (విఐఎఫ్) ప్రకటించుకుంది.

ఈ సంస్థ అజిత్ దోవల్ మానస పుత్రిక. దీనికి ఆర్ఎస్ఎస్ నుండి అన్ని హిందుత్వ సంఘ్ పరివార్ సంస్థల ప్రత్యక్ష లేక పరోక్ష ప్రాపకం ఉంది. 2005లో ఇంటలిజెన్స్ బ్యూరో నుండి రిటైర్ అయిననాటి నుండి అతను ఈ కేంద్ర స్థాపనకై తన శక్తియుక్తులనన్నింటినీ కేంద్రీకరించి పనిచేస్తూ వచ్చాడు. క్రమంగా దృఢపడ్డ ఈ వివేకానంద అంతర్జాతీయ తాత్విక సంస్థను 2009, డిసెంబర్ 10న మాతా అమ్రితానందమయి, జస్టిస్ ఎం.ఎన్. వెంకటాచల్లయ్యలు సందోహంగా ప్రారంభించారు.

1970లో ఆర్ఎస్ఎస్ ప్రముఖుడు ఏక్‌నాథ్ రేనడే తమిళనాడులోని కన్యాకుమారిలో వివేకానంద కేంద్రాన్ని స్థాపించాడు. 1993లో పి.వి. నరసింహారావు ప్రభుత్వం ఢిల్లీ చాణక్యపురిలో ఈ కేంద్రానికి భూమిని కేటాయించింది. ఆ స్థలంలోనే ఈ విఐఎఫ్ రూపుదిద్దుకుంది. కేంద్ర ప్రభుత్వంలో పనిచేసిన దౌత్యవేత్తలు, ఆర్థిక శాస్త్రవేత్తలు, భద్రతా

అధికారులు, సైనికాధికారులు అనేక మంది ఈ కేంద్రంలో పరోక్ష లేక ప్రత్యక్ష భాగస్వాములు. ఈ సంస్థ ఉద్దేశ్యాలు, లక్ష్యాలు దేశ పటిష్టతకు దోహదం చేసే తాత్త్వికతను పెంచి పోషించడమని ప్రకటించుకున్నప్పటికీ, దీనికో స్పష్టమైన అప్రకటిత లక్ష్యం ఉంది. ఈ సంస్థలో జరిగే సమావేశాలు, చర్చలు కొన్ని ప్రజా సమాచార పరిధిలో ఉంచినా, చాలమట్టుకు అవి సంస్థ సొంత నిబంధనల మాటున రహస్యంగానే ఉంచబడతాయి.

మోడీ కేంద్రంలో అధికారానికి రాకముందు నుండే ఈ సంస్థ సంచాలకుడుగా ఉన్న అజిత్ దోవల్ నుండి సలహా సంప్రదింపులు పొందేవాడు. మోడీ దేశ ప్రధాని కాగానే దోవల్‌కు జాతీయ భద్రతా సలహాదారు పదవి కట్టబెట్టాడు. నృపేంద్ర మిశ్రా, పి.కె.మిశ్రా వంటి కేంద్ర ప్రభుత్వంలోని సీనియర్ ఐఎఎస్ అధికారులు ఈ వివిఎఫ్‌తో లోతైన అనుబంధమున్నవాళ్లే. వీరిని కూడా మోడీ తన అంతర్గత అధికార్ల బంటాలోనికి తీసుకున్నాడు.

నిజానికి ఈ వివిఎఫ్ కేంద్రంలోని ఉస్తాదులే మోడీని గుజరాత్‌లో అధికార పీఠమెక్కించడానికి వ్యూహరచన తయారుచేశారు. గుజరాత్ నమూనాను ప్రచారం చేయడంలోనూ, మోడీ నామానికి ఓ బ్రాండ్ ఇమేజ్ సృష్టించడంలోనూ, యుపిఎ-2 అవినీతి కుంభకోణాలను పెద్ద ఎత్తున ప్రచారం చేసి ఆ ప్రభుత్వాన్ని గద్దెదించే వ్యూహ రచన అజిత్ దోవల్ ఆధ్వర్యంలో ఈ వివేకానంద అంతర్జాతీయ సంస్థనుండే జరిగింది.

టెలికాం నియంత్రణా వ్యవస్థ (ట్రాయ్) అధ్యక్షునిగా పనిచేసిన నృపేంద్ర మిశ్రా వివిఎఫ్ పాలనా మండలిలో సభ్యుడు. మోడీ ప్రధాని కాగానే ఈయన్ను తన ప్రిన్సిపల్ సెక్రటరీగా నియమించుకున్నాడు. ట్రాయ్ నిబంధనల ప్రకారం సంస్థ అధ్యక్ష పదవిలో ఉండి విరమణ పొందినవారు ప్రభుత్వ అధికారులుగా నియమార్హులుకాదు. అయినప్పటికీ మోడీ ప్రత్యేక చట్టం తెచ్చి ఆయన్ను ప్రభుత్వ పదవిలో ప్రతిష్టించాడు. అలానే ఇదివరలో కేంద్ర వ్యవసాయ శాఖ సెక్రటరీగా పనిచేసిన పి.కె.మిశ్రా 'వివిఎఫ్' లో ప్రముఖ సీనియర్ సభ్యునిగా పనిచేశాడు. ఈయన్ను కూడా మోడీ అదనపు ప్రిన్సిపల్ సెక్రటరీగా నియమించు కున్నాడు. అంతేగాక విశ్రాంత కేంద్ర రీసెర్చ్ అండ్ ఎనాలిసిస్ వింగ్ (ఆర్ఎడబ్ల్యు) ప్రధానాధికారి, సి.డి. సహాయ్; విశ్రాంత కేంద్ర పట్టణాభివృద్ధి ప్రధానాధికారి అనిల్ బైజాల్; రష్యా రాయభారిగా పనిచేసిన ప్రభాత్ శుక్లా; విశ్రాంత వైమానిక దళాధికారి ఎస్.జి. ఇనాందార్; విశ్రాంత సరిహద్దు భద్రతా దళాధికారి ప్రకాష్ సింగ్; వీరంతా వివిఎఫ్ తో ఉంటూ మోడీకి అండదండలు అందించినవారే!

వివిఎఫ్‌లో ఓ విభాగమైన ఆర్థిక అధ్యయనాల కేంద్రానికి ప్రధాన బోధకునిగా పనిచేసిన బిబేక్ దేబ్‌రాయ్ 'భారతదేశాన్ని తిరిగి పట్టాలెక్కించాలి' అనే పుస్తకం రాశారు. మోడీ ప్రధాని అయిన తరువాత ఆవిష్కరించిన మొట్టమొదటి పుస్తకం ఇదే.

గుజరాత్ ఎన్నికలకు, 2014 సార్వత్రిక ఎన్నికలకు, తదనంతరం జరిగిన అస్సాం, అరుణాచల్ ప్రదేశ్, జమ్మూ-కశ్మీర్, త్రిపుర ఎన్నికలకు వ్యూహ రచన చేసినది ఈ వివిఎఫ్ సంస్థ. ఆది నుండి మోడీకి, ఇతర ఆర్ఎస్ఎస్, సంఘ్ పరివార్ నాయకత్వానికి వివిఎఫ్‌తో అవినాభావ సంబంధాలు ధృడంగా కొనసాగుతున్నాయని, ఈ హిందుత్వ మేధావుల సాలెగూడుకు కేంద్ర బిందువు అజిత్ దోవల్ అని వక్కాణించి చెప్పిన రాజకీయ పరిశీలకుల పలుకులు వరుసగా నిజమవుతూ వస్తున్నాయి.

ఇష్రాత్ జహాన్ బూటకపు కాల్పుల నేరంలో కాంగ్రెస్ ప్రభుత్వం చేసిన దాడి నుండి మోడీని రక్షించడానికి దోవల్ నిలబడి, ఇష్రాత్ లష్కర్-ఎ-తోయిబా అనే తీవ్రవాద సంస్థ సభ్యురాలని, అటువంటి నేరస్తుడి చావును కాంగ్రెస్ రాజకీయం చేస్తోందని ప్రకటించాడు. అలానే 2014 ఎన్నికల సందర్భంగా అరవింద్ కేజ్రీవాల్ హిందుత్వ దళానికి దూరమై సొంత కుంపటి పెట్టుకున్నాక గుజరాత్‌లో మోడీ సాధించిన ఘనత బడా పరిశ్రమాధిపతులకు ఇబ్బడి ముబ్బడి లాభాలను చేకూర్చి పెట్టడమే తప్ప నిజానికి సాధించిన రాష్ట్ర అభివృద్ధి శూన్యమని ప్రచారం చేశాడు.

ఈ ప్రచారం దురుద్దేశ్యంతో కూడినదని, కాంగ్రెస్‌కు బలం చేకూర్చ డానికి కేజ్రీవాల్ అవాస్తవాలను మాట్లాడుతున్నాడని కన్సర్న్డ్ సిటిజన్స్ అనే పేరుతో కొంతమంది మేధావులు ఈ ప్రచారాన్ని అడ్డుకున్నారు. ఈ సమూహంలో ఉన్నవారు అజిత్ దోవల్, రచయిత ఎం.వి. కామత్, పత్రకారుడు ఎం.జె. అక్బర్, జమ్మూ-కశ్మీర్ మాజీ గవర్నర్ ఎస్.కె. సిన్హా, మాజీ ప్రభుత్వ అధికారి ఎం.ఎన్. బుచ్, ఆర్థికవేత్త బిబేక్ దేబ్రాయ్. ఈ ఎత్తుగడంతా వివిఎఫ్ దేనని వేరే చెప్పనవసరం లేదు.

2011లో అవినీతి వ్యతిరేక ఉద్యమ రూపకల్పన పన్నాగమంతా వివిఎఫ్ చేసిందే! రాందేవ్ బాబాను ముందుపెట్టి అవినీతి వ్యతిరేక ప్రచార కూటమిని ఏర్పాటు చేయాలనే నిర్ణయం 2011 ఏప్రిల్ నెలలో వివిఎఫ్‌లోనే జరిగింది. ఓ సంవత్సరంపాటు ఈ ప్రణాళికా రచన కొనసాగింది. రాష్ట్రీయ స్వాభిమాన్ ఆందోళన్ నాయకుడు కె.ఎన్. గోవిందాచార్య భాగస్వామ్యంతో నల్లధనం, అవినీతి అనే అంశాలపై వివిఎఫ్‌లో రెండు రోజుల చర్చ సమావేశం జరిగింది. రాందేవ్ బాబా, అరవింద్ కేజ్రీవాల్, కిరణ్ బేడీ ఇందులో పాల్గొన్నారు. ఈ సమావేశం ముగింపుగా అవినీతి వ్యతిరేక వేదికను ప్రకటించారు. రాందేవ్ బాబా ప్రాపకంలో, గోవిందాచార్య కార్యనిర్వాహకత్వంలో ఇది పనిచేయాలని నిర్ణయించుకున్నారు. ఇందులో సభ్యులుగా అజిత్ దోవల్, గతంలో ఎన్‌డిఎ హయాంలో అమెరికాకు రాయబారిగా పనిచేసిన భీష్మ్ అగ్నిహోత్రి, ఐఐఎం-బెంగళూరు ప్రొఫెసర్ ఆర్. వైద్యనాథన్, రాందేవ్‌కు సన్నిహితుడు, సలహాదారు, పత్రకారుడు అయిన వేద ప్రతాప్ వైదిక్, సంఘ్ పరివార్ మేధావి రచయిత, ఆర్థికవేత్త అయిన ఎస్. గురుమూర్తి ఉన్నారు.

గోవిందాచార్య అన్నా హజారేను, రాందేవ్ బాబాను కలిపేడు. వివిఎఫ్ సమూహం వీరిద్దరినీ ముందుంచి అవినీతి వ్యతిరేక ఉద్యమాన్ని ముందుకు నెట్టే వ్యూహాన్ని రచించింది. ఇందులో భాగంగానే అన్న హజారే జంతర్ మంతర్‌లో ఉపవాస దీక్ష చేపట్టాడు. రాంలీలా మైదాన్‌లో రాందేవ్‌బాబా దీక్ష కూడా ఈ వ్యూహంలో భాగమే! ఈ మొత్తం ప్రణాళికకు ఆజ్యం పోసింది ఆర్ఎస్ఎస్, బిజెపిలు.

అవినీతి కుంభకోణాల రొంపిలో కూరుకుపోయిన యుపిఎ ప్రభుత్వాన్ని గద్దెదించడంలో, హిందుత్వ మేధావుల పాత్ర, అధికారం చేజిక్కించుకునే దీర్ఘకాలిక ప్రణాళిక, ఈ ప్రణాళికలో భాగంగా 2014 ఎన్నికల్లో అవినీతిని రూపుమాపుతామని, ప్రచారము, విదేశాల్లో పోగుపడ్డ

నల్ల ధనాన్ని వెనక్కు తెచ్చి దేశంలో పేద ప్రజల బ్యాంకు ఖాతాల్లో జమ చేస్తామనే స్టంట్ ఇవన్నీ విఐఎఫ్ హిందుత్వ ముఠా పన్నాగమే!

అధికారంలోకి వచ్చిన తరువాత వరుసగా ప్రజలపై రుద్దిన అరాచక నియంతృత్వ నిర్ణయాలైన పెద్దనోట్ల రద్దు, ఏకీకృత పన్నుల విధానం, ఓ ప్రత్యేక పారిశ్రామిక–వ్యాపార వర్గానికి మేలుచేసే ప్రాపక పెట్టుబడిదారీ విధానం, హిందుత్వ భావజాలవ్యాప్తి, న్యాయ వ్యవస్థల కొనుగోళ్లు బెదిరింపులు, అన్ని రాజ్యాంగ వ్యవస్థల, ఆర్థిక సామాజిక వ్యవస్థల కొల్లగొట్టే వ్యూహాలు, అసమ్మతిని ఉక్కుపాదంతో అణచివేయడం, ఆదివాసీ ప్రాంతాల దురాక్రమణ, అణచివేత, ఊచ కోతలు ఇవన్నీ రాబోయే భయానక ఫాసిస్టు పాలనకు దిక్సూచిలు. భీమా కోరేగావ్ అల్లర్లను సృష్టించి లేని మావోయిస్టు కుట్రలు కల్పించి, దానితో అసలే సంబంధం లేని ప్రజా కార్యకర్తలను అన్ని చట్టాలను కాలదన్ని జైళ్లల్లో కుక్కడం అంటే నిస్సందేహంగా అప్రకటిత ఎమర్జెన్సీ కొనసాగుతున్నట్లే.

జాతీయ భద్రతా సలహాదారు అజిత్ దోవల్ విషయానికొద్దాం. మోడీ ప్రభుత్వం ఈ పదవికి విశేషాధికారాలు కట్టబెట్టింది, ఇంకా కొత్తవి కట్టబెడుతున్నది.

ఇలా మొత్తం అధికారాన్ని ఒకే ఒక్క అధికారి చేతిలో కేంద్రీకృతం చేయడాన్ని ఎలా అర్థంచేసుకోవాలి? ఈ నిర్ణయాలు ఏ పయనానికి దిక్సూచి?

కేంద్ర ప్రభుత్వం ఇప్పుడు రక్షణ ప్రణాళికా సమితి (డిఫెన్స్ ప్లానింగ్ కమిటీ) అనే సంస్థను తెరపైకి తెచ్చింది. దీనికి జాతీయ భద్రతా సలహాదారు అధ్యక్షత వహిస్తాడు. దేశ అంతర్గత భద్రతా రంగ, రక్షణ రంగ వ్యవహారాలు, మిలటరీ కొనుగోళ్లు వగైరా వ్యవహారాలన్నీ ఇప్పుడు ఈ కమిటీ పరిధిలోనికి వస్తాయి. రక్షణ శాఖ, విదేశీ వ్యవహారాల శాఖల ప్రధానాధికారులు, విత్త శాఖకు చెందిన ఖర్చుల విభాగాధిపతి, ప్రధాన సైనికాధికారులు వీరంతా ఇప్పుడు జాతీయ భద్రతా సలహాదారు అజిత్ దోవల్‌కు తెలియకుండా ఏ పనీ చేయలేరు.

అంతేగాక, కేంద్ర ప్రభుత్వం ఇప్పుడు 'సెక్యూరిటీ పాలసీ గ్రూప్ – ఎస్‌పిజి' ని పునర్నిర్మాణం చేసి దీన్ని కూడా జాతీయ భద్రతా సలహాదారు అజిత్ దోవల్ చేతిలో పెట్టింది. పదహారు మంది సభ్యులు గల అత్యున్నత పాలసీ వ్యవస్థ ఇది. అన్ని ముఖ్య పాలనా విభాగాధిపతులు ఇందులో సభ్యులు. కేబినెట్ సెక్రటరీ, నీతి ఆయోగ్ ఉపాధ్యక్షుడు, రక్షణ సైనిక విభాగ అధిపతులు ముగ్గురు, ఆర్.బి.ఐ గవర్నర్, విదేశీ వ్యవహారాల శాఖ, హోమ్ శాఖ, ఆర్థిక, రక్షణ శాఖల సెక్రటరీలు, వీరంతా అజిత్ దోవల్‌కు జవాబుదారీగా ఉండాలి. పాలనా పరిధిలో ఉన్నత అధికార హోదా కల్గిన కేబినెట్ సెక్రటరీ కూడా ఇప్పుడు అజిత్ దోవల్ చెప్పుచేతల్లో నడుచుకోవాలి.

గత 20 ఏళ్లలో, అంటే 1998లో జాతీయ భద్రతా సలహాదారు అనే పదవి సృష్టించినప్పటి నుండి ఇప్పటివరకు ఏ ప్రభుత్వమూ ఈ పదవికి ఇన్ని అధికారాలు కట్టబెట్టలేదు. ఇప్పటి మోడీ ప్రభుత్వం ఈ పనిచేసిందంటే దీని వెనుక పెద్ద వ్యూహమే దాగి ఉందని చెప్పాల్సి ఉంటుంది.

ఈ వ్యూహం మనం ఊహించలేనిదేమీ కాదు. క్లుప్తంగా దానిలో దాగి ఉన్న అంశాలు:

1. 2019 ఎన్నికల్లో హిందుత్వ బ్రిగేడ్ గెలుపు ఖాయం చేయడం.

2. అది సాధ్యపడదని తేలితే రామ మందిర నిర్మాణాన్ని, శబరిమలై వ్యవహారం లాంటి వాటిని అడ్డం పెట్టుకుని దేశంలో అల్లకల్లోలం సృష్టించి అసలు ఎన్నికలే జరగకుండా అడ్డుకోవడం, ఇప్పుడు అప్రకటితంగా అమలౌతున్న ఎమర్జెన్సీని బహిర్గతంగానే కొనసాగించడం.

3. 2019 ఎన్నికల్లో విజయం వరిస్తే పటిష్ఠ హిందుస్థాన్ పేరిట దేశాన్ని కాషాయమయం చేయడం.

4. జమ్మూ–కశ్మీర్, మధ్య భారతం, ఈశాన్య భారతంలో ఏదో రూపంలో చెలరేగుతున్న ఉద్యమాలు, వాటి ప్రభావంలో ఇరుక్కుని ఉన్న అపార సంపదను దేశ విదేశీ పెట్టుబడికి కట్టబెట్టడం. రక్తపు టేరులు ప్రవహింప చేసైనా ఇది సుసాధ్యం చేయడం.

5. వామపక్ష, హేతువాద భావజాలాన్ని సమూలంగా భూస్థాపితం చేసి హిందుత్వ ఫాసిజాన్ని స్థిరపర్చడం.

ఈ మధ్యన అజిత్ దోవల్ అంటున్న కొన్ని మాటల అంతస్సారాన్ని గ్రహిస్తే ఇది బోధపడుతుంది. చూడండి ఆయన ఏమంటున్నాడో! 'రాబోయే పదేళ్లు దేశానికి ఉక్కు క్రమశిక్షణ గల రాజకీయం, నేతృత్వం ఉండాలి. కలగూరగంప కిచిడీ రాజకీయాలు దేశాన్ని బలహీన పరుస్తాయి. అలా జరిగితే భారతదేశం చైనా లాంటి దేశాలకు ధీటుగా నిలబడలేదు. ప్రపంచంలో ఓ అగ్రరాజ్యంగా ఎదగలేదు.

మనకి కావలసింది నీతి నియమాల జపంకాదు. బలమైన కార్యాచరణ. జాతి ఏకీకరణ. చైనాకి 'రేర్ ఎర్త్' ఉంటే మనకు గొప్ప యువ సంఖ్యా సైన్యం ఉంది. ఇదే మన బలం. దీన్ని ఏకీకృతం చేస్తే చైనా మనముందెంత?'

ఎన్ని నీతులు చెప్పినా, మేమే మహోన్నత దేశభక్తి గుత్తదారులమని గొంతులు చించుకున్నా, హిందుత్వ వీబూధులు, నామాలు ధరించినా పాలనా దుర్నీతిలో కాంగ్రెస్‌ను తలదన్ని అవినీతి, ఆశ్రిత పక్షపాతం, ఊకదంపుడు మోసపూరిత వాగ్దానాలు గుప్పించి ప్రజలను మోసపుచ్చడం, శ్రామిక ప్రజలను దోచి, అణచి బిలియనీర్లను, మిలియనీర్లను పెంచడంలో మోడీ కాషాయ దళం కొమ్ములు తిరిగిన పొగరుబోతు ఫాసిస్టు వృషభమేనని అనునిత్యం రుజువౌతూనే ఉన్నది.

దేశంలో ఏ స్వతంత్ర పాలనా వ్యవస్థ తన ఉనికిని కాపాడుకోలేని దుస్థితిని కాషాయ దళం కల్పించింది. సిబిఐకి ఏ గతి పట్టించినదీ దేశ ప్రజలు మరువలేని తాజా అనుభవం. దేశ అత్యున్నత న్యాయస్థానం, దాని అత్యున్నత జడ్జీ గారు మేకపోతు గాంభీర్యం ప్రదర్శించారు గాని ఆయన అన్యాయాన్ని సరిచేయలేని అసహాయ స్థితిలో ఉన్నాడనే వాస్తవ చిత్రం అప్పుడే అగుపడింది.

ఓ దేశ ప్రధాని తనకు దేశ భద్రతా సలహాదారుగా ఉంచుకున్న ఓ సాధారణ ప్రభుత్వ అధికారికి అసాధారణంగా ఓ పదహారు రకాల ఉన్నత పదవులు కట్టబెట్టడం ఎందుకో ఇపుడు అందరికీ అర్థమై ఉండాలి. ముగింపుగా చెప్పాలంటే కాషాయ ఆకాశంలో కూడా మూడే మూడు ధ్రువతారాలు ఉండాలనే ఫాసిస్టు నిర్ణయమే దీనికి కారణమై ఉండాలి.

ఆలోచించండి మరి, రాబోయే కాలమెట్టిదో ! దేశ ప్రజల భవితవ్య మెటులుంటదో !

*(రచయిత శ్రామిక నేస్తం సంపాదకులు)* వీ

# నోట్ల రద్దు ప్రపంచీకరణలో అంతర్భాగమే

***నోట్ల రద్దుకు పాలకులు చెప్పిన కారణాలు వాస్తవం కాదనీ, అది వాస్తవంగా దేశీయ మార్కెట్‌ను దెబ్బతీసి, క్యాష్‌లెస్ ఎకానమీ ద్వారా కార్పొరేట్ కంపెనీల, బ్యాంకుల లాభాల కోసమేననీ అంటున్నారు కేశవ్***

అస్తవ్యస్తమైన, అస్థిరతతో కూడిన నోట్ల రద్దు జరిగి రెండు సంవత్సరాలు గడిచాయి. 2016 నవంబర్ 8న పెద్ద నోట్ల రద్దుకు పునాది పడింది. వెయ్యి, అయిదు వందల నోట్లు అకస్మాత్తుగా రాత్రికి రాత్రే విలువ కోల్పోయి మారకపు విలువ లేని కాగితం ముక్కలై పోయాయి. నోట్ల రద్దు ప్రక్రియ ప్రజల్ని విపరీతమైన కష్టాల్లో ముంచింది. ఎంతోమందికి ఉపాధిని దూరం చేసింది. ప్రజలు షాక్ నుండి తేరుకునే లోగా బ్యాంకుల ముందు అర్ధ రాత్రుల నుండే పెద్ద పెద్ద క్యూలు ఏర్పడ్డాయి. ఇది మహా యజ్ఞమనీ, దేశం కోసం ఇలాంటి త్యాగం అవసరమనీ అమ్ముడుపోయిన మీడియా ప్రజల మెదళ్లని వాష్ చేసే పని ఆరంభించింది. ఉద్యమం చెయ్యాల్సిన, వ్యతిరేకించాల్సిన ప్రజలు తమ జీవితాలు ఈ రకంగానయినా సరే బాగుపడతాయని నమ్మారు. ఇంకొద్ది రోజులు ఓపిక పడితే ధనవంతుల దగ్గర ఉన్న దొంగ నోట్లు బయటికి వచ్చేస్తాయి. దేశం ఆర్థికంగా బలపడుతుంది. ఇంత ఉన్నతమైన పనికి ముందుకొచ్చిన నాయకులకు మనం మద్దతునివ్వడం అవసరం. కాబట్టి ఓపిక పట్టాలి అని ఏ.టి.ఎం.ల ముందు తమ భారత సహోదరులు నోట్ల కోసం క్యూ కట్టి చెమట లెక్కి ఊపిరి ఆగి చనిపోయినా సరే మహాయజ్ఞం కోసం సహకరించారు. కొద్ది రోజుల్లో దేశ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక వ్యవస్థలా మారిపోతుందని నమ్మారు.

### ఆ రోజు ఏం జరిగింది ?

ప్రభుత్వం వెయ్యి, అయిదు వందల డినామినేషన్ ఉన్న నోట్లను రద్దు చేసింది. నల్ల ధనం ఈ నోట్లలోనే ఉందని ప్రభుత్వం ఆలోచన. ఇలా, 99 శాతంగా ఉన్న 15.28 ట్రిలియన్ల విలువగల నోట్లను రద్దు చేసింది. పాత నోట్లు చూపిస్తే కొత్త నోట్లు ఇచ్చే పద్ధతి ఆరంభించారు. ఇందుకోసం ప్రతి రోజూ అర్ధ రాత్రి నుండి ప్రజలు బ్యాంకుల ముందు నిల్చున్నారు. అది కూడా ఏదో ఒకటో, రెండో రెండు వేల రూపాయల నోటు కోసమే. ఇంకా ఎక్కువ కావాలంటే మరలా క్యూలో నిల్చోవాలి. క్యూలో ఉన్న వారందరికీ దొరుకుతుందన్న గ్యారంటి లేదు. నోటు కోసం క్యూకట్టి ఎంతోమంది ప్రాణాలు కోల్పోయారు. ప్రాణాలు కోల్పోయిన వారిలో బ్యాంకు ఉద్యోగులూ, సాధారణ ప్రజలూ ఉన్నారు.

### పెద్ద నోట్ల రద్దుకి ప్రభుత్వం అందించిన తర్కం

నల్లధనం పెద్ద నోట్లలో విపరీతంగా ఉంది. ఇందువల్ల దేశాభివృద్ధి కుంటుపడుతున్నది. నోట్ల రద్దు అనేది దేశం మేలు కోసం ప్రభుత్వం చేపట్టిన చర్య. ఈ నోట్ల రద్దు మహా యజ్ఞంలో అందరూ సహకరిస్తే, నల్లదనం గన్నీ బ్యాగుల్లోంచి బయట పడుతుంది. బీరువాల్లోంచి బయట పడుతుంది. అల్మారాల్లోంచి బయట పడుతుంది. ఎంచక్కా దేశం బాగుపడుతుంది. మూడు నుండి నాలుగు లక్షల కోట్ల డబ్బు బ్యాంకులకి అసలు తిరిగి రాదు. ఎందుకంటే ఇది నల్ల ధనం. దీంతో దేశ ఆర్థిక వ్యవస్థ బాగుపడుతుంది. క్యాష్ లేకపోతే ప్రజలు, డిజిటల్ ఎకానమీలోకి వస్తారు. ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి పథంలో పయనిస్తుంది.

### ప్రజలు ఎలా నమ్మారు?

నల్లధనం విపరీతంగా సినిమా ఫక్కీలో పట్టుకుంటారని నమ్మారు. నల్లధనం ఉంచుకున్న వారు నేరుగా జైలుకే అని సరదా పడ్డారు. గోనె సంచుల్లో విపరీతంగా నల్లధనం దాచిన నేరస్తులకి శిక్ష పడాల్సిందే అని సాధారణ ప్రజలు నమ్మారు. నమ్మలేదు. బాధ్యత లేని మీడియా అలా కట్టు కథలతో నమ్మించింది. ఇదో యజ్ఞం అంది. ఈ యజ్ఞంలో భాగస్వామ్యం కండి అంది. దేశం మేలుకోసం కష్టమయినా, పిల్లల పెళ్లి ఆగిపోయినా పర్లేదు. ఒక మంచి పనికోసం స్వాతంత్ర్య యోధులు కొన్ని సంవత్సరాలు అంతగా శ్రమించినప్పుడు మనం కొద్ది రోజులు కష్టపడకపోతే ఎలా? అని ప్రజల్ని చాకచక్యంగా నమ్మించారు. మ్యానుఫ్యాక్చరింగ్ ఆఫ్ ఐడియాస్ అనేది ప్రపంచీకరణ అతి పెద్ద అస్త్రం. ప్రజల మెదళ్లు ఒక టార్గెట్‌కు అనుగుణంగా ఆలోచించేలా చెయ్యడం అనేది కొత్త అస్త్రం. స్వేచ్ఛా వాణిజ్యంలో కార్పొరేట్ల ప్రయోజనాల కోసం కొన్ని పనులు జరగాలంటే ఈ అస్త్రం ఉపయోగించక తప్పదు. అందుకే ప్రజలు కూడా నమ్మారు. తమ తోటి ప్రజల్లో కొందరు బ్యాంకుల ముందు ఒక చిన్న నోటు కోసం ఎండల్లో క్యూకట్టి ప్రాణం కోల్పోయినా నమ్మారు. ఇంత కాలానికి తమ గోడుని అర్థం చేసుకున్న ఒక మహానుభావుడు తమలాంటి సాధారణ జీవితంలోంచి వచ్చాడు. దేశాన్ని బాగు చెయ్యడానికి చాలా కష్టపడుతున్నాడు. ఇదిగో మరికొన్ని రోజులే ఓపిక పట్టాలి. నల్ల ధనం బస్తాలకు బస్తాలు బయట పడుతుంది. కొన్ని వేలమంది జైలుకి వెళతారు. దీంతో పాటు బయటి స్విస్ బ్యాంకు నుండి నల్లధనం విపరీతంగా వచ్చి పడుతుంది. తమ ఖాతాల్లో లక్షలు పడతాయి. ఈ కోణంలో ఇంతవరకు ఏ ప్రభుత్వమయినా ఆలోచించిందా? ఈ రోజు ఆ మంచి దినాలు రాబోతున్నాయి అని ఆర్థిక శాస్త్రంలో ఓనమాలు తెలీని సాధారణ ప్రజలు, శ్రామికులు, మెదళ్లని కడిగేసిన మీడియా మాయ మాటల్లో ఇరుక్కున్న చాలా మంది మధ్యతరగతి ప్రజలు నమ్మారు. చిప్ ఉన్న నోట్లు వస్తే ఇక నకిలీ నోట్ల బెడదే ఉండదు అన్నారు. ఆ నోట్లు ఎక్కడ ఉన్నా ఇట్టే తెలిసిపోతుంది. ఇలా, బాధ్యతారహితమైన ఎలక్ట్రానిక్ మీడియా అబద్ధాలు ప్రచారం చేసి నమ్మించింది.

### వాస్తవంలో జరిగిందేమిటి?

ప్రభుత్వం నమ్మించిన దానికి విరుద్ధంగా ఇంచుమించుగా 99 శాతం కరెన్సీ బ్యాంకుల్లోకి తిరిగి వచ్చింది. అంటే నల్లధనం కరెన్సీలో

లేదనేగా అర్థం. నోట్ల రద్దుకు మూడు కారణాలను ప్రభుత్వం అందించింది. 1) నల్లధనం అంతం. 2) నకిలీ నోట్ల అదుపు. 3) డిజిటల్ ఎకానమీ. నల్లధనం అంతం అవ్వడం వల్ల దేశ ఆర్థిక వ్యవస్థ బలపడుతుంది. టెర్రరిజం అంతమవుతుంది.. నోట్లు తక్కువై, డిజిటల్ లావాదేవీలు ఎక్కువవ్వడం వల్ల ప్రతి లావాదేవీ కూడా లెక్కలోకి వస్తుంది. అవినీతి అనేది మటుమాయమవుతుంది. నకిలీనోట్లు దేశ ఆర్థిక వ్యవస్థను నష్టం చేస్తున్నాయి. నోట్ల రద్దువల్ల నకిలీ నోట్ల సమస్య పరిష్కారమవుతుంది. కొత్తరకం నోట్లు కొత్త ఫీచర్లతో వస్తున్నాయి. వీటిని నకిలీ చెయ్యడం అసాధ్యం. ఇలా ప్రజల్ని చాలా జాగ్రత్తగా నమ్మించారు.

కానీ, ఇందులోని ఒక్క విషయం కూడా నిజం కాలేదు. నల్లధనం దేశంలో అంతం కాలేదు. నల్లధనం నోట్లలో లేదని, నోట్లు విడిచి ఇతర ఆస్తుల్లో ఉందని తెలుసుకున్నాం. నోట్లు కొద్దిరోజులు ఆగిపోయినంత మాత్రాన ఉగ్రవాదం అంతంకాలేదు. ఈ రెండు సంవత్సరాల్లో ఉగ్రవాదం దేశంలో చూశాం. అసలు వీటికి కారణం నోట్లు కానే కావని ప్రజలు మెల్లమెల్లగా తెలుసుకుంటున్నారు.

ఇక డిజిటల్ లావాదేవీలు నోట్లు లేకపోవడం వల్ల కాస్తా పెరిగితే పెరిగి ఉండొచ్చు. కానీ, సగానికి పైగా జనాభాకి డిజిటల్ లిటరసీ లేదు. మరి, డిజిటల్ లావాదేవీలు బలవంతంగా ఎలా పెరుగుతాయి? నోట్ల సరఫరా సర్దుకున్నాక ప్రజలు నోట్లని విడిచిపెట్టలేదు. పైగా, రిటైల్ వ్యాపారం చాలా ఎక్కువగా ఇక్కడ అసంఘటిత రంగం చేతిలో ఉంది. ఈ వ్యాపారులకు నోట్లలెక్క తప్ప వీరికి యూజర్ ఐడిలూ, పాస్ వర్డ్‌లూ తెలీవు. డిజిటల్ యంత్రాలు ఆపరేట్ చెయ్యడం బజార్లో నేలమీద కూర్చొని దుంపలు, ఉల్లి అమ్ముతున్న సాధారణ దుఖానాదారుడికి మనం ఆన్‌లైన్‌లో చెల్లిస్తామన్నా వారికి అవి ఎలా తీసుకోవాలో తెలీదు. ఇలాంటి వారే దేశంలో కొన్ని కోట్లమంది ఉంటారు. మరి దేశం క్యాష్‌లెస్ ఎకానమీగా, లెస్‌క్యాష్ ఎకానమీగా ఎలా మారగలదు? అమెరికాకీ, జపాన్‌కీ సాధ్యంకాని పని మనకెలా అవుతుంది? కాబట్టి నోట్ల రద్దుకు మద్దతుగా ప్రభుత్వం అందించిన ఏ తర్కం కూడా వాస్తవ అగ్నిపరీక్ష ముందు నిలబడలేక పోయింది? ఓడిపోయింది.

దొంగనోట్లు పశ్చిమ బెంగాల్‌లోని మాల్దా జిల్లా నుండి మధ్యవర్తులు తెస్తున్నట్టు పత్రికల ద్వారా వింటూనే ఉన్నాం. ఇక కొత్త నోట్లలో మనం ఒక ఛానల్ ద్వారా విన్న మైక్రో చిప్పుల బొమ్మరిల్లు కథలు కథలుగానే ఉన్నాయి. అంతేకాదు, కొన్ని వేల, లక్షలమంది నల్లధనంతో జైలుకి పోతారని ప్రజలు భ్రమపడ్డారు. కానీ, ఎక్కడో ఒకటో రెండో తప్ప అలాంటి సంఘటనలు కానరాలేదు. కరెన్సీ ఎక్కువ ఉంటేనే నల్లధనానికి ప్రోత్సాహం ఉంటుందనీ, లేకపోతే నల్లధనం ఉండదనీ మరో వాదన. ఇది కూడా తప్పుడు వాదనే. కరెన్సీకీ, నల్లధనానికి సంబంధం లేదు. నైజీరియాలో కరెన్సీ తక్కువ. కానీ నల్లధనం ఎక్కువ. జపాన్‌లో కరెన్సీ ఎక్కువ. కానీ, నల్లధనం తక్కువ.

నోట్లు ఇంటిలో దొరికిపోగానే, నల్లధనం దొరికిపోయిందనీ, అది దాచుకున్న వ్యక్తి నేరస్తుడనీ నాడు నోట్లరద్దు దినాల్లో విపరీతమైన ప్రచారం మీడియాలోనూ, సోషల్ మీడియాలోనూ నడిచింది. నోట్లు ఇంటిలో ఉంచుకున్నంత మాత్రాన వ్యక్తి నేరస్తుడు కాకపోవచ్చు. ఒకవేళ, అదే నిజం అయితే, ఇప్పటికి కొన్ని లక్షలమంది నల్లధనం కేసుల్లో జైల్లో ఉండేవారు. కానీ అలా జరగలేదు. తెల్లధనమే వ్యాపారం కోసం, పెళ్లి లాంటి శుభకార్యం కోసం, ఉద్యోగులకు జీతాలు ఇవ్వడం కోసం, అకస్మాత్తుగా ఏదైనా జరిగితే ఎటిఎంలో దొరక్కపోతే ఎలా అని కూడా నోట్లు ఇంటిలో ఉంచుకోవచ్చు. నోట్లకు పునాది ఆలోచించాలి గాని నోట్లు దొరికిపోయాయని సెన్సేషన్ చేసేసి దొంగల్ని పట్టేశాం చూశారా? నోట్లరద్దు ఎంత మంచి కార్యమో! అని తర్కంలేని కొన్ని మీడియా సంస్థలు నాడు విపరీతమైన హంగామా చేసి ప్రజల చెవుల్లో పువ్వులు పెట్టడానికి ప్రయత్నించాయి.

**మహాయజ్ఞం వ్యర్థ ప్రయత్నమే**

నోట్లరద్దు కార్యక్రమంలో 1.04 శాతం కరెన్సీ మాత్రమే ఆర్‌బిఐకి తిరిగి రాలేదు. ఇన్ని వందల ఫారాలు, తనిఖీల డ్రామాల తర్వాత కూడా 99 శాతం కరెన్సీ తిరిగి వచ్చింది. ఈ ఒక్క ఉదాహరణ ద్వారానే, భారతదేశ చరిత్రలో ఇదొక వ్యర్థప్రయత్నం అని చెప్పొచ్చు. స్విస్‌బ్యాంకుల్లో మూలుగుతున్న అసలు సిసలు నల్లధనం తెచ్చే ప్రయత్నం ఇంతవరకూ జరగనే లేదు. జనధన్ అకౌంట్లలో పదిహేను లక్షల చొప్పున వేస్తామన్న వాగ్దానం చెవిలో పువ్వే అయింది. దీన్ని మరిపించడానికే ఈ ప్రయత్నమా అనే సందేహం విజ్ఞులకు రాక మానదు. పైపెచ్చు, నల్లధనాన్ని పట్టుకోలేని నోట్లరద్దు మహాయజ్ఞం కొత్త నోట్ల ప్రింటింగ్‌కి దాదాపు 21 వేల కోట్ల రూపాయలని ఖర్చుపెట్టింది. మొత్తం బ్యాంకింగ్ వ్యవస్థ ఉద్యోగులు తమ రోజువారీ పనులను పక్కన పెట్టి పాతనోట్లు సేకరించడం, కొత్త నోట్లు అందివ్వడం, సవాలక్ష ఫారాలు నింపడం, సిసిటివి ఫుటేజిలు అధికారులకు పంపించడం, విపరీతమైన పని ఒత్తిడితో ఎక్కువ సమయం పనిచెయ్యడం ఇదంతా వ్యర్థ ప్రయత్నమే. ఆర్థికంగా చూస్తే కొన్నివేలకోట్ల నష్టం. నోట్లరద్దు, జిఎస్‌టి అనే ఈ రెండు సంఘటనలు ఒకదాని తర్వాత ఒకటి భారతదేశం పెరుగుదలపై చాలా పెద్ద షాక్‌కు గురిచేశాయని ఆర్.బి.ఐ. పూర్వ గవర్నర్ రఘురాం రాజన్ కూడా అన్నారు.

మరోవైపు, కొత్త నోట్లు వస్తే, నకిలీ నోట్లకు బ్రేకు పడుతుంది అన్నారు. కానీ, కొత్త నోట్లలో కూడా నకిలీ నోట్లు పోలీసులు పట్టుకున్నారు. నోట్ల రద్దు దేశాన్ని డిజిటల్ ఎకానమీకి, క్యాష్‌లెస్ ఎకానమీకి, లెస్ క్యాష్ ఎకానమీకి దారితీయలేదు. కాస్తా డిజిటల్ లావాదేవీలు పెరిగితే పెరిగి ఉండొచ్చు. కానీ, క్యాష్ లావాదేవీలు అనూహ్యంగా మొదట్లానే జరుగుతూ ఉన్నాయి. ఇంత హంగామా చేసి సాధించింది ఏమిటో అర్థం కావడం లేదు. ఒక వేళ టాక్స్ కలెక్షన్‌లు ఆర్థిక మంత్రి చెప్పినట్టు పెరిగినా, నోట్ల రద్దు చెయ్యకుండా, ప్రజానీకానికి ఇంత శ్రమకూ, అభద్రతకూ గురి చెయ్యకుండా కూడా ఈ పని సాధించవచ్చు. నోట్ల రద్దుతో ఉగ్రవాదాన్ని అణచివెయ్యవచ్చు అన్న మాట కూడా నిజం కాలేదు. ఎందుకంటే, నోట్ల రద్దు తర్వాత కూడా ఉగ్రవాదం సంఘటనలు గత రెండు సంవత్సరాల్లో సరిహద్దుల్లో కొనసాగాయి. నోట్ల రద్దుకు ముందు 18 లక్షల కోట్ల రూపాయల కరెన్సీ చలామణిలో ఉంది. నేడు పది శాతం ఎక్కువ ఉంది. కాబట్టి నోట్లు ఎక్కువ అయిపోయాయి కాబట్టి రద్దు చెయ్యాల్సి వచ్చింది అన్న మాట అర్థరహితం. నోట్ల రద్దుని ప్రధాని ప్రకటించిన కొన్ని గంటల ముందు ఆర్.బి.ఐ. మినిట్స్‌లో రాసుకున్న అమూల్యమైన మాటలు ఈ రోజు ఇన్నాళ్ల తర్వాత బయటికి వస్తున్నాయి. నల్ల ధనం కరెన్సీలో లేదనీ, కరెన్సీ రద్దు ద్వారా నల్లధనం అంతం కాదని తన మినిట్స్‌లో రాసుకుంది. ప్రభుత్వం నిపుణుల ఆలోచనలని పెడచెవిన పెట్టింది.

**ప్రపంచీకరణలో అంతర్భాగమే నోట్ల రద్దు**

నోట్ల రద్దు ప్రక్రియ ఏదో విడి సంఘటన కాదు. స్వేచ్ఛా వాణిజ్యంలో, ప్రపంచీకరణలో అంతర్భాగమే. నోట్ల రద్దు ప్రక్రియ

# ఖషోగీ హత్య వెనుక అసలు నిజాలు

***సౌదీ జర్నలిస్టు ఖషోగీ టర్కీలో హత్యకావడం వెనుక సౌదీ అరేబియా రాజు హస్తం ఉందనీ, ఆ హత్య వెనుక ఉన్న రాజకీయార్థిక కారణాలతో పాటు, భావప్రకటనా స్వేచ్ఛపై నిర్బంధం ఎంత దారుణంగా అమలవుతుందో తెలుపుతుందనీ అంటున్నారు బైరెడ్డి సతీష్***

భిన్నాభిప్రాయాన్ని, విమర్శను సహించలేని పాలకులు అసమ్మతిని హత్యలతో అణచివేయాలని ప్రపంచమంతా ఒకేలా ఆలోచిస్తూ, అమలు చేస్తున్నారు. గత అక్టోబర్ 2న టర్కీలో సౌదీ అరేబియా రాయబార కార్యాలయంలోకి వ్యక్తిగత పనినిమిత్తం ప్రవేశించిన సౌదీ జర్నలిస్ట్, కాలమిస్ట్ అమెరికాలోని వాషింగ్టన్ పోస్ట్ కోసం పనిచేస్తున్న జమాల్ ఖషోగీ మళ్లీ కనిపించలేదు. గత కొంతకాలంగా తనకు తానే విధించుకున్న ప్రవాసంలో జీవిస్తున్న ఖషోగీ సౌదీ అరేబియా పాలకులు అవలంబిస్తున్న దేశీయ, విదేశాంగ విధానాలపై విమర్శనాత్మకంగా కథనాలు రాయడమే కాకుండా పలు వేదికలపై ప్రసంగించడం సౌదీ పాలకులకు కంటగింపైంది. ఇటీవలి కాలంలో సౌదీ పాలకులు ప్రవేశపెడుతున్న సంస్కరణలను ఓవైపు సమర్థిస్తూనే ఒకింత విమర్శనాత్మక దృష్టితో ప్రపంచానికి చెప్పే ప్రయత్నమే ఆయన చేసిన మహాపరాధం.

ప్రజాస్వామ్యంగా పిలువబడుతున్న దేశాల్లోనే అత్యంత పాశవికంగా ప్రవర్తిస్తున్న పాలకులు కరుడుగట్టిన రాజరికంలో మగ్గుతున్న సౌదీ అరేబియాలో భావ ప్రకటనా స్వేచ్ఛ ఉండడం, పాలనపై విమర్శ చేయడం దుస్సాహసమే అవుతుంది. అందుకు భారీమూల్యమే చెల్లించాల్సి వస్తుంది. సరిగ్గా జమాల్ ఖషోగీ కూడా తన ప్రాణాన్నే చెల్లించాల్సి వచ్చింది.

సౌదీ యువరాజుగా నియమింపబడిన మహ్మద్ బిన్ సల్మాన్ ఇటీవలి కాలంలో ఆధునికుడిగా ముద్ర వేయించుకునే తాపత్రయంలో భాగంగా అనేక సంస్కరణలకు తెరలేపాడు. ఇస్లాంకు పుట్టినిల్లు అయిన సౌదీలో సహజంగానే మతఛాందసత్వం, ప్రజా జీవితాలపై దాని పట్టు శతాబ్దాలుగా కొనసాగుతున్నది. ఒక వైపు ఊడలు దిగిన రాజరికం, మరోవైపు మతం ఆధునిక మానవులు అందిపుచ్చుకోవాల్సిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు అక్కడి ప్రజలను దూరం చేసినవి. మార్పును ఆహ్వానించని మతం, ఒకే కుటుంబంలో కేంద్రీకరించబడిన రాజకీయ అధికారం వెరసి అక్కడి ప్రజలపై ఆధిపత్యం చెలాయిస్తున్నాయి. సిరులు కురిపించే ఆయిల్ నిక్షేపాలు, భౌతిక సంపదలతో తులదూగే పరిస్థితులు ఉన్నప్పటికీ అవేవీ అక్కడి ప్రజల భౌద్ధిక వికాసానికి పెద్దగా అక్కరకు రాకుండా నియంతృత్వ పాలనా వ్యవస్థలో ప్రజలు బంగారు పంజరంలో చిలకల్లా బతుకులీడుస్తున్నారు. పోనీ రాజ కుటుంబంలోనైనా కనీస ప్రజాస్వామ్యం

---

సామ్రాజ్యవాద సంస్థలైన ప్రపంచ బ్యాంకు, ఐ.ఎం.ఎఫ్.లు నియంత్రిస్తున్న ప్రపంచీకరణలో ఒక భాగమే. స్వేచ్ఛా వాణిజ్యం, కార్పొరేట్ల పెట్టుబడుల స్వైర విహారంలో భాగమే ఈ ప్రక్రియ. ఇది ఎవరో ఒక వ్యక్తి చేసిన పని కాదు. పెట్టుబడిదారీ వ్యవస్థలోని ఒక అంతర్భాగమే. డిజిటల్ పేమెంట్‌లని నియంత్రిస్తున్న కార్పొరేట్లకు దేశంలో విరివిగా చలామణిలో ఉన్న క్యాష్ ఒక అడ్డుగోడ. నోట్లని ఎంత ఎక్కువ తగ్గిస్తే అంత ఎక్కువగా ప్రజలు ఆన్ లైన్ పేమెంట్‌లలో పడతారు. ఫలితంగా, ఈ కంపెనీలు కమీషన్లు అనుభవిస్తాయి. ఇది ప్రపంచీకరణ ఒకటో సూత్రం. అంతే కాకుండా భారత దేశంలాంటి తృతీయ ప్రపంచ దేశాల్లో అసంఘటిత రంగం చాలా ఎక్కువ. రిటైల్ రంగంలోని ఎక్కువ భాగం అసంఘటిత రంగమే. రిటైల్ రంగాన్ని కైవసం చేసుకోవాలనుకున్న వాల్మార్టు బడ దిగ్గజాలకు ఇది ఇబ్బంది కలిగించే విషయం. ఏకంగా, నగదు తగ్గించేసి డిజిటల్ ఆన్ లైన్ పేమెంట్‌ల వైపు వ్యవస్థని మరలిస్తే, అది పాటించలేని అసంఘటిత రంగం దానికదే దారి నుండి తప్పుకుంటుంది. స్వేచ్ఛా వాణిజ్యం, ఆర్థిక దోపిడీ మరింత సులభమవుతుంది. ఇక రెండో విషయం, ఐ.ఎం.ఎఫ్., ప్రపంచ బ్యాంకుల నుండి అధికంగా రుణాలను తీసుకుంటున్న భారతదేశం లాంటి దేశాలకు ఈ సంస్థలు ఎప్పటినుంచో కొన్ని షరతుల్ని విధిస్తూనే ఉన్నాయి. ఆ షరతుల ఫలితంగానే, అంతవరకూ విద్యకూ, వైద్యానికీ, ఎల్.పి.జి.కీ అందిస్తున్న సబ్సిడీల నుండి వైదొలగే పని ఏనాడో ఆరంభమయింది. పన్నుల విధానాన్ని మరింత పటిష్టం చేసి దేశం ఆర్థికంగా పరిపుష్టం అయినట్టు చూపించి మరో విడత ఋణం కోసం సన్నద్ధం కావడం అవసరం. అప్పులు తీసుకున్న దేశాలు ఇలాంటి చర్యలు చేపట్టడం ఆయా పెట్టుబడిదారీ దేశాలకు అవసరం. ఆయా సామ్రాజ్యవాద సంస్థలకు ఇలా సంతృప్తి కలిగించడం అవసరం. అయితే, ఈ ప్రక్రియలు ఏవీ కూడా సాధారణ ప్రజలకు చేసే మేలు ఏమీ ఉండదు. కార్మిక వర్గానికి ఇలాంటి ప్రక్రియలు ఏమాత్రం సరయిన న్యాయాన్ని అందించవు.

నల్లధనం స్విస్ బ్యాంకుల నుండి వచ్చేస్తుందనీ, తెచ్చేస్తున్నామనీ, ప్రజలకు ఉచితంగా అకౌంట్‌లలో వేసేస్తున్నామని, భారతదేశంలో కూడా పట్టేసుకున్నామనీ ప్రజలకు మాయ మాటలు చెప్పడంలో ప్రయోజనం ధనిక వర్గానికే ఉంది తప్ప పేదలకు ఇందులో పనికొచ్చేదేమీ లేదు. సాధారణ ప్రజలు బికారులు కాదు. యాచకులు కాదు. ప్రజల్ని యాచకులుగా మార్చేవిధానం మనకొద్దు. సాధారణ ప్రజలకు కావాల్సింది ఉచితంగా వచ్చే నల్లధనం కాదు. న్యాయమైన పాలన. పనికి తగ్గ ఫలితం. ప్రతి ఒక్కరికీ ఉద్యోగం. ఆకలి నుండి విముక్తి. అన్నంపెట్టే రైతన్నకు ఆత్మహత్యకు పురికొల్పని న్యాయమైన వ్యవస్థ. దోపిడీ నుండి విముక్తి. కాబట్టి నోట్ల రద్దులాంటి ప్రక్రియలకు ప్రజలకు పనికొచ్చే ప్రయోజనం ఏమీ లేదు. ఉండదు. అది ప్రయోజనం కలిగించిందని చెప్పే కొత్త వాదనల వల్ల ప్రజలకు జరిగే మేలు ఏమీ లేదు.

*(రచయిత ఉపాధ్యాయులు, జాగృతి సమీక్ష త్రైమాసిక పత్రిక సంపాదకులు)* వీ

ఉంటుందా అంటే అదీ అక్కడి ఎడారి రాజ్యంలో ఎండమావి లాంటిదే. రాజ కుటుంబంలో ఒకరిద్దరి గుప్పిట్లోనే అధికారం కేంద్రీకరణ చేసే ప్రక్రియలో భాగంగానే అవినీతిపై యుద్ధం పేరిట అనేకమంది రాజ కుటుంబీకులను నిర్బంధించి దారికి తెచ్చుకోవడమో, విదేశాల్లో తలదాచుకున్న వారిని తమ అధికార యంత్రాంగంతో అదృశ్యం చేయడమో అక్కడి రాజరిక వ్యవస్థకి సర్వసాధారణమైపోయింది. ఇక సాధారణ మనుషులు గొంతు విప్పినా, విమర్శలు వినిపించినా వారికి ఏ గతి పడుతుందో జమాల్ ఖషోగీ దృష్టాంతమే తెలియపరుస్తున్నది. అధికార దాహం, ఆధిపత్య అహంకారం ఎలాంటి అమానవీయ చర్యలకు ప్రేరేపిస్తుందో ఖషోగీ క్రూర హత్యనే ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

ఎంబిఎస్‌గా ప్రసిద్ధుడైన సౌదీ యువరాజు మహ్మద్ బిన్ సల్మాన్ ఆయిల్‌పై ఆధారపడిన తమ దేశ ఆర్థిక వ్యవస్థను చమురేతర రంగాలకు విస్తరింపచేసి మరింత పటిష్ఠం చేయాలనే సంకల్పమే కాకుండా ఇటు సామాజిక సాంస్కృతిక రంగాల్లో కూడా సంస్కరణవాద దృక్పథాన్ని ప్రదర్శించే ప్రయత్నం చేస్తున్నాడు. మహిళలకు వాహనాలను నడిపే హక్కు, వినోద సాధనమైన సినిమాను వీక్షించి ఆనందించే వెసులుబాటును కలగజేసేలా చర్యలు చేపట్టడం జరిగింది. ఇవన్నీ ఆయనలో గొప్ప సంస్కరణవాద దృష్టి ఏదో ఉన్నందుకు కాదు అక్కడి మహిళలు వీటిని సాధించుకునే పోరాట క్రమంలో అనేకసార్లు నిర్బంధాలను, జైలు జీవితాలను అనుభవించాకే ఈ కొంత మాత్రమైనా యువరాజా వారిలో ఆధునికోదయ కిరణాలు అనివార్యంగా విచ్చుకున్నాయి. అనివార్యంగా చేపట్టాల్సిన ఈ చర్యలన్నీ ఆధునిక మానవుల అవసరాలుగా భావించకుండా అవేవో తమ దయా దాక్షిణ్యాలయినట్లు యువరాజు గారి వ్యవహారశైలి ఉన్నది.

ఈ నేపథ్యంలోనే అక్కడ నెలకొని ఉన్న భావ ప్రకటనా స్వేచ్ఛా శూన్యతను బయటి ప్రపంచానికి తెలియజెప్పే ప్రయత్నం, ఆ కనీస మాత్రంగా చేపట్టిన సంస్కరణలోని డొల్లతనాన్ని, యువరాజు ఆధిపత్య ధోరణిని సున్నితంగానైనా ప్రశ్నించే సాహసమే రాజుగారు కన్నెర్ర చేయడానికి కారణమై ఖషోగీని కర్కశంగా హత్య చేయించింది. నిజానికి మామూలు పరిస్థితుల్లో అయితే ఇలాంటి హత్యలు, అపహరణలు అంతర్జాతీయ ప్రాముఖ్యం సంపాదించుకొని అందరి దృష్టిని ఆకర్షించేంత గా ఉండవు. ఏదో ఒకరోజు, రెండు రోజుల వార్తల్లా వచ్చి వెళ్లేవి. కాని ఖషోగీ విషయంలో అట్లా జరగకపోవడానికి అంతర్జాతీయంగా ముఖ్యంగా మధ్య ప్రాచ్యం, పశ్చిమాసియాలో నెలకొని ఉన్న యుద్ధ వాతావరణం, దశాబ్దాలుగా ఇరాన్ సౌదీ అరేబియాల మధ్య కొనసాగు తున్న ప్రచ్ఛన్న యుద్ధం, అమెరికా, బ్రిటన్‌లు సౌదీతో నెరిపే భారీ ఆయుధ వ్యాపారాలు, సందట్లో సడేమియా అన్నట్టు టర్కీ కూడా సౌదీతో ఇటీవలి కాలంలో తలెత్తిన విభేదాలు, ఉద్రిక్త పరిస్థితుల రిత్యా తన దేశంలోనే సౌదీ రాయభార కార్యాలయంలో జరిగిన ఈ పాశవిక హత్యను ప్రపంచానికి మరింతగా తెలిసేలా, అంతర్జాతీయ యవనికపై సౌదీని నేరస్థునిగా నిలబడేలా చేసింది. ఇంత నేపథ్యం, తదుపరి పరిణామాలు లేకుండా ఉండి ఉంటే ఇది ఒక సాధారణ అపహరణ, అదృశ్య, అనుమానాస్పద మృతిగానో, వీడని మిస్టరీగానో మిగిలిపోయేది.

తన వ్యక్తిగత పని నిమిత్తం అక్టోబర్ 2న టర్కీలోని సౌదీ రాయభార కార్యాలయంలోకి ఖషోగీ ప్రవేశించినట్లు సిసి టీవీల్లో రికార్డు అయిన దృశ్యాలు పదే పదే ప్రపంచమంతా చూసింది. కాని ఖషోగీ బయటకి వచ్చిన దృశ్యాలేవి అనేక రోజుల పాటు కనిపించక పోవడంతో జమాల్ ఖషోగీ హత్యకు గురై ఉంటాడన్న కథనాన్ని ఆయన పనిచేసిన వాషింగ్టన్ పోస్ట్ వెలువరించడంతో దీనిపై మరింత దృష్టిని సారించిన టర్కీ ప్రభుత్వం నిజా నిజాలను వెలికితీసే దర్యాప్తును చాలా సీరియస్‌గా తీసుకొని ఈ హత్య సౌదీ ప్రభుత్వ పెద్దల ఆదేశంతోనే, ముందస్తుగా వేసుకున్న పథకం ప్రకారమే జరిగిందని నిర్ధారించింది.

ఈ హత్యోదంతంపై అనేక కథనాలు వెలుగులోకి వచ్చినవి. ఒక కథనం ప్రకారమైతే ఖషోగీ రాయభార కార్యాలయంలోకి ప్రవేశించిన ఏడు నిమిషాల వ్యవధిలోనే అత్యంత క్రూరంగా హత్య కావించబడ్డాడని, రెండు ప్రత్యేక విమానాల్లో సౌదీ నుండి టర్కీకీ ఈ 'మిషన్' కోసమే వచ్చిన 15 మందితో కూడిన హిట్ స్క్వాడ్ ఆయనను చంపివేసి శరీరాన్ని ముక్కలు ముక్కలుగా చేసి యాసిడ్‌లో కరిగేలా చేసి అవశేషాలను సూట్‌కేసుల్లో నింపుకొని స్థానిక టర్కీ ఏజెంట్‌కు అప్పగించడమో, సమీప అడవుల్లో పడేయడమో చేసి ఉంటారనేది విశ్వసనీయంగానూ, టర్కీ అధికారికంగా జరిపిన దర్యాప్తుకు సమీపంగానూ ఉన్నది.

మొదట ఈ ఆరోపణలను తీవ్రంగా ఖండించిన సౌదీ ప్రభుత్వం అన్నివైపుల నుండి ఒత్తిడితో ఉక్కిరిబిక్కిరయిపోయి రాయభార కార్యాలయంలో జరిగిన ఘర్షణలో అతడు మరణించాడు అని చెప్పింది కాని అతని శవం ఎక్కడికెళ్లిందనే విషయంలో నీళ్లునమిలి ఆత్మరక్షణలో పడింది. నిందితులను అరెస్టు చేస్తున్నట్లు, న్యాయం జరిగేలా చేస్తామన్నట్టు ప్రకటనలు చేసిందే గాని అసలు సూత్రదారులు ఎవరన్న సంగతిని మాత్రం బయటికి చెప్పడం లేదు.

అమెరికా, బ్రిటన్‌లైతే తక్షణమే తీక్షణంగా స్పందించినట్టు కనిపించి, నేరస్థులెవరో నిగ్గు తేల్చకపోతే ఆంక్షలు విధిస్తామని లాంఛనప్రాయ ప్రకటనలకు, ఖండనలకు మాత్రమే పరిమితమైపోయినవి. సిఐఎ డైరెక్టర్ టర్కీని సందర్శించి టర్కీ దర్యాప్తును వినడం, అమెరికా విదేశాంగ మంత్రి పాంపే సౌదీని సందర్శించి అక్కడి పాలకులను నిలదీస్తున్నట్టు నాటకాలాడడమే తప్ప నికరంగా ఆ హత్యకు ఆదేశించిందెవరో తెలిసినా బయటి ప్రపంచానికి తెలియపరచలేదు.

టర్కీ ఉత్సాహంగా, నిజాయితీగా ఈ హత్య వెనుకాల ఉన్న నిజాలను నిగ్గు తేల్చే ప్రయత్నం వెనుక, అమెరికా బ్రిటన్ ఇతర యూరప్ దేశాల ఆర్భాటపు, ఆడంబరపు బెదిరింపు ప్రకటనల వెనుక ఆ తదుపరి మౌనం వెనుక భారీ స్వప్రయోజనాలు మాత్రమే ఉన్నాయి. టర్కీ తన గడ్డపై జరిగిన ఈ హత్య వెనకాల దాగిన నిజా నిజాలను బయట పెట్టడంలో ఎవర్నో దోషిగా ప్రపంచం ముందు నిలబెట్టడం, బాధితునికి న్యాయం చేయడం వంటి సూత్రబద్ధ అంశాలు, నైతిక బాధ్యతకంటే ఈ క్రూరమైన చర్యను అడ్డుపెట్టుకొని ఇటు సౌదీ అరేబియా అటు అమెరికా రెండు దేశాల నుండి తన ప్రయోజనాలను నెరవేర్చుకునే స్వార్థపూరిత ఉబలాటమే కనిపిస్తుంది. తన పైన జరిగిన సైనిక తిరుగుబాటును అణిచే పేరుతో అత్యంత క్రూరంగా, అప్రజాస్వామికంగా వ్యవహరించి అనేకమంది చావుకు, జైళ్లల్లో మగ్గిపోవడానికి కారణమైన ఆ దేశ అధ్యక్షుడు ఎర్డోగాన్ న్యాయం, విలువలు చట్టం గురించి మాట్లాడడమే హాస్యాస్పదంగా ఉన్నది.

మరోవైపు అమెరికా, బ్రిటన్‌లు ఈ విషయంలో స్పందించిన తీరు,

వారి వ్యవహార శైలి ఇంకా దారుణంగా ఉన్నది. ఎంతో కఠినంగా వ్యవహరించబోతున్నట్టు, ఎన్నో ఆంక్షలు విధించబోతున్నట్టు అనేక ఆడంబర ప్రకటనలు, ఆర్భాటాలను ప్రదర్శించి చివరికు మౌనాన్నే ఆశ్రయించినవి. టర్కీలో మత ప్రచారకునిగా వెళ్లిన అమెరికా పౌరున్ని ఆ దేశం అరెస్టు చేసి జైళ్లో పెడితే తీవ్రమైన ఆంక్షలు విధించి మరీ తన దారికి తెచ్చుకొని విడిపించుకున్నది అమెరికా. కాని హత్య జరిగిందని, అది సౌదీ యువరాజు మహ్మద్ బిన్ సల్మాన్ ఆదేశంతోనే జరిగిందని సిఐఎ నిర్ధారణకు వచ్చినప్పటికీ సౌదీ చెంతనే నిలవడం, ప్రపంచమంతా ప్రజాస్వామ్యం పౌర హక్కుల గురించి మాట్లాడే అమెరికా దుర్మార్గమైన సౌదీ రాజరికాన్ని ప్రశ్నించకుండా వెనకేసుకరావడానికి చారిత్రక నేపథ్యం వర్తమాన వాణిజ్య ప్రయోజనాలు మాత్రమే ఉన్నాయి.

అమెరికా అధ్యక్షుడిగా ఎన్నికైన తర్వాత ట్రంప్ అధికారికంగా పర్యటించిన మొదటి దేశం సౌదీ అరేబియానే. ప్రపంచ మొత్తం చమురు నిక్షేపాల్లో 18 శాతం నిలువలు కలిగిన సౌదీ అరేబియాతో అంతకంటే సౌదీ రాజ కుటుంబంతో అమెరికా అనుబంధం దశాబ్దాల కాలం నాటిది. చమురు ఎగుమతుల్లో సింహభాగం సౌదీ అరేబియాదే. మొత్తంగా దాని ఆర్థిక వ్యవస్థ నిర్మాణమంతా ఆయిల్‌పై ఆధారపడిందే. సౌదీ అరేబియా నుండి రోజుకు 810,000 బ్యారల్స్ చమురు దిగుమతితో అమెరికా మొదటి స్థానం ఆక్రమించింది.

స్టాక్ హోం పీస్ రీసర్చ్ సంస్థ ప్రకారం ప్రపంచంలోనే మూడవ అతిపెద్ద రక్షణబడ్జెట్ సౌదీ అరేబియాదే. 2017లో 110 బిలియన్ డాలర్ల విలువైన ఆయుధ కొనుగోలు ఒప్పందం అమెరికా సౌదీ మధ్య కుదిరింది. అమెరికా ఆయుధ అమ్మకాల చరిత్రలోనే అతిపెద్ద ఒప్పందమిది. ఈ ఒప్పందం ప్రకారమే వచ్చే పదేళ్లలో ఈ ఆయుధ కొనుగోళ్ల పరిమాణం 350 బిలియన్ డాలర్లు ఉండబోతున్నది. సౌదీ అరేబియా మొత్తం ఆయుధాల, రక్షణ ఉత్పత్తుల కొనుగోళ్ల దిగుమతిలో 60 శాతం అమెరికా, 20 శాతం బ్రిటన్, 5 శాతం ఫ్రాన్స్‌ది. సౌదీ మొత్తం విదేశీ వస్తు దిగుమతుల్లో 46 బిలియన్ డాలర్ల విలువైన దిగుమతులు కేవలం అమెరికా నుండే జరుగుతున్నది. అన్నింటికి మించి మధ్యప్రాచ్చంలో 'శాంతి'ని నెలకొల్పాలంటే అమెరికాకు సౌదీ అండదండలు అనివార్యమవుతున్నవి. దీనికి తోడు ఇస్లామిక్ దేశాల్లో ప్రాంతీయ ఆధిపత్య పోరులో ఇరాన్‌ను సౌదీ ఢీకొట్టడం అమెరికాకు అందివచ్చిన అంశం.

ఇస్లాంకు పుట్టినిల్లయిన, సున్నీ మెజారిటీ కలిగిన సౌదీ, షియా తెగతో ఉన్న ఇరాన్ 1979 ఇస్లామిక్ విప్లవం తర్వాత ప్రాంతీయ ఆధిపత్యం కోసం ప్రచ్ఛన్న యుద్ధ చేస్తున్నాయి. చమురు సంపద కలిగిన సౌదీతో ఓ వైపు వ్యాపారం చేస్తూనే ఇస్లామిక్ దేశాలపై ఆధిపత్యం చేసే క్రమంలో తనను ఎదిరించే దేశాలను తన చెప్పు చేతల్లో పెట్టుకునేలా అమెరికా చేస్తున్న పన్నాగంలో పెద్ద పావు సౌదీ. అరబ్ స్ప్రింగ్ పేరుతో ఇస్లామిక్ దేశాల్లో తలెత్తిన తిరుగుబాట్ల నేపథ్యంలో పరిస్థితులను తమకనుకూలంగా మార్చుకునే ప్రయత్నాల్లో సౌదీ ఇరాన్‌ల మధ్య వైరం మరింత తీవ్రం అయింది.

ఎంతో కొంత ప్రజాస్వామికంగా ఉండే ఇరాన్ స్వతంత్ర్యంగా ఉంటూ ఇస్లామిక్ దేశాలకు నాయకత్వం వహించాలని ముఖ్యంగా పాలస్తీనా, కతర్ దేశాలనే కాకుండా షియా ప్రాబల్యం ఉన్న చోటల్లా తన ఆధిపత్యం నిలబెట్టుకుంటూ ఇజ్రాయిల్ దూకుడును నిలువరించే ప్రయత్నం చేస్తుంటే, తన రాజరికాన్ని నిలబెట్టుకునేందుకు ఇజ్రాయిల్‌తో అంటకాగుతూ అమెరికాకు ఊడిగం చేస్తున్నది సౌదీ అరేబియా. మహ్మద్ బిన్ సల్మాన్ రక్షణ మంత్రిగా యెమెన్‌లో హుతి తిరుగుబాటుదారులకు ఇరాన్ మద్దతిస్తుందన్న సాకుతో సౌదీ నాయకత్వం లో సంకీర్ణాన్ని ఏర్పర్చి గత నాలుగేళ్లుగా నరమేధాన్ని సాగిస్తున్నది సౌదీ రాజ కుటుంబం. ఈ అమానుష యుద్ధానికి ఆయుధాలు అందిస్తున్నది అమెరికా, బ్రిటన్‌లే. మరోవైపు సిరియా అంతర్యుద్ధంలో ఇరాన్ ఆ దేశ అధ్యక్షుడైన అల్ బషర్‌కి మద్దతిస్తుంటే తిరుగుబాటుదారులకు సౌదీ సాయం చేస్తున్నది. టెర్రరిజంపై పోరు పేరుతో ఇస్లామిక్ మిలటరీ కౌంటర్ టెర్రరిజం పేరిట 40 ఇస్లామిక్ దేశాలను కూడగట్టి సౌదీ వెనకాల ఉండి నడిపిస్తున్నది అమెరికా.

మరోవైపు ఇస్లామిక్ దేశాల్లో పెద్దన్నపాత్ర కోసం పరితపిస్తున్న టర్కీ కూడా ఈ ఆధిపత్య పోరులో ఇరుక్కున్నది. మధ్యప్రాచ్యం పశ్చిమాసియా లో తన పాత్రను, ప్రాధాన్యతను తగ్గించి సౌదీ అరేబియాకి అమెరికా అమిత ప్రాముఖ్యం ఇస్తున్నదన్న అక్కసు టర్కీకి ఉన్నది. తన దేశ భద్రతకు, సమైక్యతకు భంగకరంగా భావిస్తున్న కుర్దిస్తాన్ వర్కర్స్ పార్టీ, దానికనుబంధంగా ఇరాక్, సిరియా సరిహద్దు ప్రాంతాల్లోని కుర్దు మిలీషియాలకు అమెరికా, సౌదీ మద్దతు పలుకుతున్నాయని టర్కీ ఆగ్రహం పెంచుకున్నది. కుర్దు దళాలు ఇస్లామిక్ టెర్రరిజం మీద పోరు చేయడంలో తమతో కలిసి వస్తున్నాయని అమెరికా, సౌదీలు వాటిని వెనకేసుకొస్తున్నాయి. కతర్ దేశం ఇరాన్‌తో సన్నిహితంగా ఉండడం సహించని సౌదీ ఆర్థిక దిగ్బందనం చేయాలని ప్రతిపాదించినపుడు ఇరాన్‌తో కలిసి కతర్ వైపు నిలబడింది టర్కీ.

ఇలా అనేక పరిణామాలు సౌదీ, టర్కీల మధ్య వైషమ్యాలు తీవ్రమవడానికి దారితీసిన నేపథ్యంలో చేతికి అందివచ్చిందే జమాల్ ఖషోగీ హత్య. ఒక్క దెబ్బతో రెండు పిట్టలన్నట్టు ఇటు సౌదీని అటు అమెరికాను దారికి తెచ్చుకునేందుకు, తనపైన విధించబడిన ఆర్థిక ఆంక్షలను సడలింపచేసుకునే ప్రయత్నమే కాకుండా అటు సౌదీ నుండి కూడా భారీఎత్తున ఆర్థిక సహాయం పొందే ఎత్తుగడలో భాగంగానే సౌదీని ఖషోగీ హత్యోదంతంలో మరింత కార్నర్ చేసే దూకుడును ప్రదర్శిస్తున్నది.

ప్రతి మనిషి సహజ హక్కయిన భావ ప్రకటనా స్వేచ్ఛలో భాగంగా సత్యాన్ని చెప్పినందుకు, ప్రజల వైపు నుండి పాలకుల్ని ప్రశ్నించినందుకు, విమర్శించినందుకు పాశవికంగా హత్య కావింపబడ్డాడు ఖషోగీ. మరణం వెనుక దాగిన నిజానిజాలు నిగ్గుతేల్చిన వాళ్లు పాత్రదారులను, సూత్రదారులను దుర్మార్గ పాలకులను ప్రపంచం ముందు దోషులుగా నిలబెట్టాల్సింది పోయి, నీతి, న్యాయం, విలువల్ని, హకుల్ని గాలికొదిలేసి నిర్లజ్జగా నెత్తుటి కూదును తింటున్నారు. దేశం ఏదైనా సకల సంపదలను, సమస్త వనరులను ప్రజల హక్కు భుక్తం చేయాల్సింది పోయి కార్పొరేట్స్, పాలకుల ముసుగులో ఉన్న రాజ కుటుంబాలు రాశులుగా పోసుకుంటున్నాయి. ఖషోగీ త్యాగం కనువిప్పు కావాలని, మరిన్ని గొంతులు సంఘటితమై సౌదీ రాజ సౌధాలను కూల్చే, అరబ్ స్ప్రింగ్‌లను తలదన్నే అసలు సిసలు ప్రజా విప్లవం ఉద్భవిస్తుందని ఆశిద్దాం.

*(రచయిత ఆంగ్ల ఉపాన్యాసకులు)* వీ

# బ్రెజిల్ అధ్యక్షునిగా మితవాది బోల్సనారో

***బ్రెజిల్‌లో అధికారం చేపట్టిన బోల్సనారో పాలనా విధానాలు పర్యావరణాన్ని ధ్వంసం చేస్తూ, స్థానిక ఆర్థిక వ్యవస్థను దెబ్బతీస్తూ సామ్రాజ్యవాదానికి అనుకూలంగా ప్రజల హక్కులను కాలరాసే విధంగా ఉన్నాయని అంటున్నారు* ఎ. నర్సింహారెడ్డి**

**1985**లో బ్రెజిల్‌లో మిలటరీ నియంతృత్వ పాలన ముగిసిన తర్వాత మధ్యేవాద, వామపక్ష రాజకీయాలు అధికారంలో కొనసాగాయి. 1995లో కార్డోసో ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. కొన్ని ప్రజాహిత కార్యక్రమాలు చేపట్టినా సంస్కరణలబాట వీడనందున సంక్షోభం నుండి గట్టెక్కలేదు. ప్రజల్లో తీవ్ర అసంతృప్తి పెరిగింది. దేశవ్యాప్త సమ్మెలు జరిగాయి. కార్డోసో ప్రభుత్వం ఈ సమ్మెలను అణచివేసింది. 3 శాతం కుటుంబాల చేతుల్లో 67శాతం భూమి ఉన్నందున భూపోరాటాలు ఉధృతంగా వచ్చాయి. ప్రభుత్వం ఉద్యమకారులపై జరిపిన కాల్పుల్లో వెయ్యి మంది చనిపోయారు. 2002 ఎన్నికల్లో లూలా నాయకత్వంలోని వర్కర్స్‌పార్టీ, సోషలిస్టుపార్టీ, కమ్యూనిస్టుపార్టీ భాగస్వాములుగా అధికారం చేపట్టారు. ఆ తర్వాత దిల్మా రౌసెఫ్ అధ్యక్షులుగా కొనసాగారు. వర్కర్స్ పార్టీ నేత లూలా, దిల్మారౌసెఫ్ అధ్యక్షులుగా అధికారంలో కొనసాగారు.

బ్రెజిల్ లాటిన్ అమెరికాలోనే అత్యధిక జనాభా గల దేశం. చైనా, భారత్, యుఎస్ఎ, ఇండోనేషియా తర్వాత ప్రపంచంలోనే జనసంఖ్య పరంగా ఐదో పెద్ద దేశం. ప్రపంచంలో ఎనిమిదో అతిపెద్ద స్థూల జాతీయోత్పత్తి ఉన్న దేశం. వ్యవసాయం, తయారీరంగం, సొంత ఆయుధ పరిశ్రమలతోపాటు భారీగా ఖనిజ వనరులు కలిగిన సంపద్వంతమైన దేశం. లూలా, రౌసెఫ్ హయాంలో ఐఎంఎఫ్ దగ్గర అప్పులు తెచ్చి సంస్కరణలు అమలు చేశారు. 1994 నాటికి 184 మిలియన్ డాలర్లున్న అప్పు 2002 నాటికి 400 మిలియన్ డాలర్లకు పెరిగింది. దానితో నిత్యావసర వస్తువుల ధరలు పెరిగాయి. ఆర్థిక మాంద్యం, నిరుద్యోగం పెరిగింది. మరోవైపు పాలకుల్లో అవినీతి ఆరోపణలు వెల్లువెత్తాయి. బ్రెజిల్ అధ్యక్షునిగా 2018 ఎన్నికల్లో మితవాది జాయిర్ బోల్సనారో గెలవడం ప్రగతికాముకులకు పెద్ద ఎదురుదెబ్బ. ఎన్నికల ముందు మితవాదులు అదే పనిగా వర్కర్స్ పార్టీ అధ్యక్షులపై అవినీతి ఆరోపణలు చేయడం, కోర్టులు వాటిని సమర్థించడం జరిగింది.

1985లో బ్రెజిల్‌లో మిలిటరీ నియంతృత్వ పాలన ముగిసిన అనంతరం సెంట్రిస్ట్ (మధ్యేవాద), వామపక్ష రాజకీయాలు అధికారంలో కొనసాగాయి. ద సిల్వా తర్వాత వర్కర్స్ పార్టీ నేత లూలా 2003లో పదవిలోకి వచ్చి 8 ఏళ్లపాటు కొనసాగారు. 2011 నుంచి 16 వరకు ఐదేళ్ల ఆటు దిల్మా రౌసెఫ్ అధ్యక్షులుగా కొనసాగారు. ప్రభుత్వం ఈ కాలమంతా పేదరిక నిర్మూలనపై కేంద్రీకరించి ఒక మేరకు విజయం సాధించినప్పటికీ, క్రమంగా అవినీతి వ్యవస్థీకృతమై, దేశం ఆర్థిక సంక్షోభంలోకి కూరుకుపోవడంతో వామపక్షాల నాయకత్వంపై ప్రజలకు విశ్వాసం పోయింది. బ్రెజిల్ వామపక్ష రాజకీయాల ప్రస్థానంలో మధ్యతరగతి ప్రజానీకాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేసింది. ఆర్థిక సంక్షోభంలో ఉనికిని కోల్పోతున్న మధ్యతరగతి ప్రజానీకం వామపక్ష పార్టీ పాలన వైఫల్యాలకు విసుగుచెంది, వివాదాస్పద మితవాద బోల్సనారోకు పట్టం కట్టారు. దక్షిణపక్ష/జాత్యహంకార/మతతత్వ/ మితవాద రాజకీయాల వైపునకు మొగ్గడం కార్పొరేట్ శక్తుల విజయంగా చెప్పవచ్చు. పన్నుల విధానాన్ని సరళతరం చేయడం, మదుపుల ప్రవాహాన్ని ప్రోత్సహించడం, వాణిజ్యాభివృద్ధి పేరుతో హైవే నిర్మాణాన్ని చేపట్టి, వనరుల విధ్వంసానికి పాల్పడే విధానాలను బోల్సనారో చేపట్టనున్నాడు.

దిల్మా రౌసెఫ్ అధ్యక్షురాలిగా ఉన్న కాలంలో చమురు ధరలు పడిపోవడం, తద్వారా వచ్చే ఆదాయం తగ్గడంతో ఆ ప్రభావం దేశ ఆర్థిక వ్యవస్థపై పడింది. బడా పారిశ్రామిక వేత్తలు, అమెరికా బహుళజాతి కంపెనీలు దీన్ని ఆసరాగా తీసుకొని ప్రతిపక్ష పార్టీలకు అన్ని విధాలా అండదండలందించడంతో ఆమెను రాజ్యాంగ విరుద్ధంగా అధికారం నుంచి దించివేశాయి. ఆమె స్థానంలో అనేక అవినీతి ఆరోపణలున్న మైఖేల్ తిమెర్‌ను అధ్యక్షస్థానంలో కూర్చోబెట్టి ఈ ఎన్నికలు నిర్వహించారు. బ్రెజిల్‌లో ఇప్పటికీ లూలానే అత్యంత ప్రజాదరణ కలిగిన నాయకుడు, ఎందుకంటే ఆయన పాలనలో ప్రజలకు కొంత మేరకు ఆర్థిక, సామాజిక ప్రయోజనాలు అనేకం ఒనగూరాయి. మహిళలు, కార్మికులు, పేదలకు అన్ని రకాల హక్కులు అందుబాటులోకి వచ్చాయి. ఆయనపై తప్పుడు ఆరోపణలు సృష్టించి నిర్బంధించడంతో ఎన్నికల్లో లూలాను అధ్యక్ష అభ్యర్థిగా నిలబెట్టాలన్న వర్కర్స్ పార్టీ, దాని మిత్రపక్షాల ప్రయత్నాలు ఫలించలేదు.

2008 నుంచి కొనసాగుతున్న ప్రపంచ ఆర్థిక సంక్షోభం ప్రతిఫలంగా ప్రపంచవ్యాప్తంగా ఫాసిస్టు, అర్ధఫాసిస్టు, మితవాద ప్రభుత్వాలు ఉనికిలోకి రావడంతో భౌగోళిక రాజకీయ సమీకరణాలు గుణాత్మకంగా మారాయి. అమెరికాలో జాత్యహంకార అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ మొదలు యూరోపియన్ యూనియన్ దేశాలు, ఆసియా, ఆఫ్రికా దేశాలు సహా భారత్‌లోను మితవాద మతతత్వ రాజకీయ పక్షాలు అధికారంలోకి వచ్చాయి. అదేక్రమంలో మితవాద, సంప్రదాయ ఫాసిస్ట్, సోషల్ లిబరల్ పార్టీ (ఎస్ఎల్‌పి) నేత జాయర్ బోల్సనారో (53) బ్రెజిల్ నూతన అధ్యక్షుడిగా ప్రత్యర్థి వర్కర్స్ పార్టీకి చెందిన ఫెర్నాండో హద్దాద్‌పై విజయం సాధించారు. బ్రెజిల్ ట్రంప్, అభినవ హిట్లర్, 'ఉష్ణ మండల ట్రంప్'గా బోల్సనారోను అభివర్ణిస్తూ అభ్యర్థిత్వానికి వ్యతిరేకంగా బ్రెజిల్‌లోనే కాకుండా ప్రపంచ వ్యాప్తంగా ఆందోళనలు వ్యక్తమైనాయి.

ఎన్నికల ప్రచారకాలంలో సెప్టెంబర్ 5న బోల్సనారోకు కత్తిపోటు తగిలింది. దాంతో ప్రత్యర్థులను తుపాకులతో కాల్చివేయమని పిలుపు ఇచ్చాడు. బ్రెజిల్ పౌరులకు మరింత భద్రత కల్పించేందుకు పౌరులందరూ తుపాకీని కలిగి ఉండే చట్టబద్ధ అవకాశం, అబార్షన్‌ను చట్టబద్ధం చేస్తానన్నాడు.

ఇజ్రాయెల్‌లోని బ్రెజిల్ కార్యాలయాన్ని అమెరికా వలె జెరూసలెంకు మార్చడంతోపాటు బ్రెజిల్‌లోని పాలస్తీనా కార్యాలయాన్ని మూసివేయడం దగ్గర నుంచి ప్యారిస్ వాతావరణ మార్పు ఒప్పందం నుంచి వైదొలగడం వంటి బోల్‌సనారో ప్రకటించిన విదేశాంగ, పర్యావరణ విధానాలు, మధ్య ప్రాచ్యదేశాలతో విభేదాల అంశాలు చాలా వరకూ వాతావరణ మార్పు నిరాకర్త ట్రంప్ విధానాలతో పోలి ఉన్నాయి. గతంలో సైనికాధికారిగా పనిచేసిన బోల్‌సనారో ఎన్నికల ప్రచార సమయంలో తరచూ మహిళలు, గేలపై, మానవ హక్కుల, పర్యావరణ కార్యకర్తల పట్ల ట్రంప్‌లాగా వివాదాస్పద వ్యాఖ్యలు చేశారు.

ఇవాళ బ్రెజిల్‌లో అమెరికా కనుసన్నల్లో కార్పొరేట్ అనుకూల విధానాలు ప్రాధాన్యత సంతరించుకున్నాయి. ఫలితంగా బ్రెజిల్ ప్రజాస్వామ్య చరిత్రలో చీకటి అధ్యాయం ప్రారంభమైంది. 1985 నుంచి మధ్యేవాదులు, వామపక్షీయుల పాలనలో ఉన్న బ్రెజిల్‌లో ఇటీవల జరిగిన ఎన్నికల్లో మితవాద, ఫాసిస్ట్ భావజాలం కలిగిన సోషల్ లిబరల్ పార్టీ (ఎస్ఎల్‌పి) నేత జాయిర్ బోల్‌సనారో విజయం సాధించడం ఆ దేశానికే కాదు, లాటిన్ అమెరికాకే విపత్కర పరిణామం. ఆయన సైన్యంలో పనిచేసి రాజకీయాల్లోకి వచ్చాడు. 1985 ముందు నాటి సైనిక నియంతృత్వాన్ని సమర్థిస్తూ సైనిక ప్రభుత్వం మరో మూడు లక్షల మందిని చంపి ఉండాల్సిందని అమానుష వ్యాఖ్యలు చేసినవాడు. మహిళలు ఉద్యోగాలు చేస్తే ప్రసూతి సెలవుల్లో జీతాలు ఇవ్వవల్సి వస్తుందని, అందుకు మహిళలకు తక్కువ జీతాలివ్వాలని, పోలీసులకు నేరస్తులపై కాల్పులు జరిపే అధికారాలిస్తానని చెప్పిన బోల్‌సనారో బ్రెజిల్ అధ్యక్షుడయ్యాడు.

అక్టోబర్ 7న జరిగిన తొలి విడత ఎన్నికల్లో ఏ అభ్యర్థికీ విజయానికి అవసరమైన 50 శాతానికిపైగా ఓట్లు రాకపోవడంతో మొదటి రెండు స్థానాల్లోని బోల్‌సనారో, హడ్డాడ్‌లు రెండోరౌండ్ పోటీకి అర్హత సాధించారు. అక్టోబర్ 28న జరిగిన మలివిడత ఎన్నికల్లో బోల్‌సనారోకు 55.1 శాతం, హడ్డాడ్‌కు 44.9 శాతం ఓట్లు వచ్చాయి. మొదటి రౌండ్‌తో పోల్చితే విజేత, మితవాది బోల్‌సనారోకు 60 లక్షల మంది మద్దతు పెరిగింది. అయితే అక్టోబర్ 28న రెండోవిడత పోలింగ్‌లో 21.17 శాతం మంది ఓటర్లు ఓటింగ్‌లో పాల్గొనలేదు. కాగా, మరో 7.43 శాతం బ్యాలెట్లు చెల్లుబాటు కాకపోవడంతో బోల్‌సనారో విజయం ఖరారయింది. తొలి విడత 46 శాతం మాత్రమే ఓట్లు సాధించిన బోల్‌సనారోకు మితవాద శక్తులన్నీ మద్దతివ్వడం, డబ్బు వెదజల్లడం, బినామీ కంపెనీల పేరు మీద సోషల్ మీడియా సంస్థలకు విచ్చలవిడిగా ప్రకటనలివ్వడం, అమెరికా మద్దతు తదితర అంశాలు ఆయన విజయానికి దోహదం చేశాయి.

ఇప్పటి వరకు బ్రెజిల్ వాతావరణ సమతుల్యత, పర్యావరణ ప్రయోజనాలకు ఒక నైతిక శక్తిగా ఉంది. బోల్‌సనారో పర్యావరణంపై శ్రద్ధ లేనివాడు, బ్రెజిల్ ప్రగతికి పర్యావరణ చట్టాలు అడ్డంకిగా భావిస్తాడు. అమెజాన్ రెయిన్ ఫారెస్టులో పర్యావరణాన్ని పట్టించుకోకుండా ప్రగతి కార్యక్రమాలు చేపట్టాలంటున్నారు. ఖనిజాల తవ్వకాలకు అనుమతించాలని, రేయిన్ ఫారెస్ట్‌లో రింగ్‌రోడ్డు నిర్మాణం చేపడుతానంటున్నారు. ఇప్పుడు అమెజాన్ తీరంలో ఆనకట్టలు కట్టడానికి అనుమతిచ్చేందుకు బోల్‌సనారో సంసిద్ధత వ్యక్తం చేయడమంటే అక్కడి పర్యావరణ సమతుల్యతను దెబ్బతీయడమే అవుతుంది. అదే సమయంలో అవినీతిని అంతం చేస్తానని, మూక హింసను అరికడుతానని చెబుతున్నాడు.

ప్రభుత్వ చమురు సంస్థ పెట్రొబ్రాస్‌కు చెందిన రిటైల్, రవాణా, శుద్ధి తదితర రంగాల్లో అధిక భాగాన్ని ప్రైవేటీకరించడంతోపాటు ప్రభుత్వ రంగ సంస్థల్లో ప్రభుత్వ వాటాలను తగ్గిస్తానని ఆయన ప్రకటించారు. బ్రెజిల్ క్రిస్టియన్ దేశం. రాజ్యాంగంతోపాటు బైబిల్‌కు తగు ప్రాధాన్యత నిచ్చి పాలన సాగిస్తానని ఆయన ఎన్నికల్లో ప్రకటించారు. బడా పారిశ్రామికవేత్తలు, మితవాద ఇవాంజిలికల్ క్రిస్టియన్ నాయకులు, చర్చి, మిలటరీకి చెందిన ఒక వర్గం ఆయనకు మద్దతుగా ప్రచారం చేశారు. ఎన్నికల హామీలు బోల్‌సనారో విజయాన్ని సులభతరం చేశాయి. ఆస్ట్రియా, పోలండ్, హంగరీ, ఫిలిఫ్పీన్స్ తదుపరి మితవాద శక్తులకు బ్రెజిల్ మరో విజయం. వీరు పత్రికా స్వేచ్ఛకు వ్యతిరేకులు, మానవ హక్కుల ఉల్లంఘనల సమర్థకులు, స్వేచ్ఛా వాణిజ్య పిపాసులు. అంటే జాతీయ, అంతర్జాతీయ పెట్టుబడికి తొత్తులు. ఏమైనా ఆర్థికమాంద్యం, రాజకీయ సంక్షోభాల నుంచి పచ్చి మితవాదులు బలపడుతున్నారు. ఇది తిరోగమనం.

బోల్‌సనారో ఎన్నికల్లో వాట్సాప్ సందేశాలను ప్రచారంలో ఆయుధంగా వాడుకున్నాడు. తన ప్రత్యర్థి వర్కర్స్ పార్టీ నుంచి పోటీ చేస్తున్న ఫెర్నాండో హడ్డార్ గురించి తప్పుడు వార్తలు వాట్సాప్ వేదికగా ప్రచారం చేయించాడు. తప్పుడు వార్తలు అడ్డుకోవడానికి వాట్సాప్ ఎలాంటి చర్యలు తీసుకోలేదు. ఎన్నికలను పర్యవేక్షించే సుపీరియర్ ఎలక్టోరల్ కోర్టు కూడ తప్పుడు వార్తల ప్రచారాన్ని అడ్డుకునే ప్రయత్నం చేయలేదు. వాట్సాప్ 'ఎండ్ టు ఎండ్' ఎన్‌క్రిప్షన్ ఉపయోగిస్తుంది. అందువల్ల పంపే సందేశంలో ఏముందో మూడో వ్యక్తికి తెలియదు. దీనివల్ల విద్వేషభరిత సందేశాలు, తప్పుడు వార్తలు ప్రచారం అవుతాయి, మనుషుల్లో ఉద్వేగాలు, ఉద్రేకాలు, ప్రతీకారాలు పెంచుతాయి. భారత్‌లో కూడ వాట్సాప్ వార్తలు ఆర్ఎస్ఎస్, రాజకీయ పార్టీలు విరివిగా ఉపయోగిస్తూ ప్రజల మనోభావాలను ప్రభావితం చేస్తున్నాయి. ఇప్పటికే అనేక మూక హత్యలకు ఈ వాట్సాప్ సందేశాలు కారణమయ్యాయన్నది వాస్తవం.

బోల్‌సనారో జాతి ఉన్మాదాన్ని రెచ్చగొట్టే చర్యలు చేపట్టే అవకాశం ఉంది. ఆఫ్రో బ్రెజిలియన్లు కొవ్వుపట్టిన సోమరులని ఆయన అభివర్ణించారు. మహిళలు ఉద్యోగాలు చేయడం వల్లే స్వలింగ సంపర్కం పెరిగిందన్నారు. అంతేకాదు, గత ప్రభుత్వాలు ఆఫ్రికన్ దేశాలకు సహాయం చేయడాన్ని తప్పుపట్టారు. ఈ నేపథ్యంలో దేశ అధ్యక్షుడిగా బోల్‌సనారో పౌర హక్కులను కాలరాయడమే కాదు, వివిధ రాజ్యాంగ వ్యవస్థలను నిర్వీర్యం చేస్తారనే భయాందోళనలు వ్యక్తమవుతున్నాయి. ఆయన ఎన్నికైన వెంటనే విద్వేష నేరాలు నమోదయ్యాయి. స్వలింగ సంపర్కులపై, మహిళలపై, మైనారిటీలపై, పాత్రికేయులపై రెండు రోజుల్లోనే 70 దాడులు నమోదయ్యాయి. ఇప్పటికే బ్రెజిల్ అత్యంత హింసాత్మక దేశంగా అప్రతిష్ట పాలయిన దేశం, ప్రతి 24 నిమిషాలకు ఒక్క నల్లవాడి హత్య జరుగుతుంది. 2017లో 61,619 హత్యలు జరిగాయి. అతని అధ్యక్ష పదవీకాలం దేశ ప్రజలను విభజిస్తుంది తప్ప ఐక్యం చేయదు. కార్మికులపై, వారి హక్కులపై దాడులు తప్పవు. రాడికలిజాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేయవచ్చు. పొదుపు చర్యల ద్వారా సామాన్య ప్రజల జీవనం మరింత దుర్భరమవుతుంది.

ఎన్నికల తర్వాత బోల్‌సనారో వామపక్ష కార్యకర్తలను, నేతలను ఏరివేస్తానని, బ్రెజిల్ నేలపై 'ఎరుపు'కు స్థానం లేకుండా చేస్తానంటూ ప్రకటించారు. దీంతో ఆ దేశమే కాదు లాటిన్ అమెరికాను ప్రమాదపు అంచుల్లోకి నెట్టేస్తున్న సంకేతాలు స్పష్టంగా కనబడుతున్నాయి. బ్రెజిల్

# మూడున్నర దశాబ్దాల భోపాల్ బాధితుల పోరాటం

***భోపాల్ గ్యాస్ దుర్ఘటనలో బాధితులకు న్యాయం జరగపోగా మనుషుల్ని జీవచ్ఛవాలుగా మారుస్తున్న కంపెనీని మూసివేయాలని ఉద్యమం జరిగినా, 14 మందిని చంపాకనే ఆ కంపెనీని మూసివేశారని అంటున్నారు ఎనిశెట్టి శంకర్***

**1984** డిసెంబర్ 3 అర్థరాత్రి భోపాల్ పట్టణంలో అతి భయంకరమైన విషవాయువు దుర్ఘటన జరిగింది. బహుశ ఇది ప్రపంచం లోనే అతిపెద్ద పారిశ్రామిక విషాదం. 42 టన్నుల 'మిథైల్ ఐసోసైనెట్' అనే విష వాయువు లీక్ కావడం వల్ల సుమారు 5 లక్షల మందికి పైగా ప్రభావానికి గురయ్యారు.

ఇది 1977లో 'కార్బిల్' ఉత్పత్తి కోసం ఏర్పాటు చేయబడ్డ కర్మాగారం. ఇది ప్రధానంగా క్రిమిసంహార మందుగా వాడడానికి ఉద్దేశించింది. ప్రారంభంలో 2500 టన్నులు ఉత్పత్తి అయ్యేది, ప్రస్తుతం 5 వేల టన్నుల సామర్థ్యం కలిగి ఉన్నది. 1980 దశకంలో 'కార్బిల్'కు అంత ఆదరణ లేకపోవడంతో ధరలు తగ్గించడం, కార్మికులను తగ్గించడం, తరచుగా నిర్వహణ పనులు చేపట్టకపోవడం, తక్కువ ధర ఉన్న స్టీల్ వాడకం మార్కెట్‌లో కావాల్సినంత 'కార్బిల్' ఉండడంతో ఈ విషాదం జరిగే సమయంలో కర్మాగారంలో ఉత్పత్తి జరుగడం లేదు.

మిథైల్ ఐసోసైనెట్ ఉన్న ట్యాంకుల్లోకి నీళ్లు ప్రవేశించడం వల్ల రసాయన చర్య జరిగి కార్బన్‌డై యాక్సైడ్ తయారైంది. ట్యాంకులో 2000కు మించిన ఉష్ణోగ్రత, శక్తికి మించిన ఒత్తిడి పెరిగింది. అత్యవసర పరిస్థితుల్లో ఒత్తిడి తగ్గించేందుకు ఏర్పాటు చేయబడిన వాల్వులను అధికారికంగా తెరవడంతో వాతావరణంలోకి ఈ విషవాయువు చేరిపోయింది. ట్యాంకు, పైపులు ఎప్పటికప్పుడు శుభ్రం చేయకపోవడం అధిక మోతాదులో వాయువు లీక్ కావడానికి ఓ కారణం.

తక్కువ విషపూరిత రసాయనాలకు బదులుగా ఇంకా ప్రమాదకర రసాయనాలను వాడడం. చిన్న చిన్న 200 డ్రమ్ముల్లో ఈ రసాయనాలను నిలువ ఉంచే బదులు పెద్ద పెద్ద ట్యాంకుల్లో నీల్వ ఉంచడం, పైప్‌లైన్లల్లో నాణ్యత పాటించకపోవడం, 1980లలో ఉత్పత్తి నిలిచిపోయాక కనీస నిర్వహణను చేపట్టకపోవడం, పలు రక్షణ చర్యలు తీసుకోకపోవడం, డబ్బు ఆదా కోసం రక్షిత పద్ధతులను మూసివేయాలని ఎంఐసి నిర్ణయం. రిఫ్రిజిరేటర్ పనిచేస్తుంటే ఈ విషాదం జరిగేది కాదు. భారత ఇంజనీర్లు డిజైన్ మార్పులు చేసిన కర్మాగారం – దీనికోసం ఆర్థిక తగ్గింపులు చేశారు. ఈ విషవాయువు బయటికి రావడంతో 3500 నుండి 25000 మంది వరకు మృతి చెందారు. సుమారు 5 లక్షల మందికి పైగా గాయపడ్డారు.

1998లో సుప్రీంకోర్టు యూనియన్ కార్బైడ్ యాజమాన్యం భారత ప్రభుత్వానికి 470 కోట్ల డాలర్లు చెల్లించాలని తీర్పు చెప్పింది. ఇది కర్మాగారం ఉత్పత్తి 9.6 బిలియన్ డాలర్లకు ఈ సొమ్ము 20 రెట్లు. ఈ చెల్లింపు అయ్యాక ఎలాంటి కేసులు లేకుండా తీర్పు వెలువడింది. ఇందులో బాధితులకు అందింది చాలా తక్కువ. బాధితులు పలు రకాలుగా ఉద్యమించారు. చట్టపరంగా కొట్లాడడానికి భారత ప్రభుత్వం 1985 'భోపాల్ గ్యాస్ లీక్ చట్టం' చేసింది. మొదట అమెరికాలోని ఫెడరల్ డిస్ట్రిక్ట్ కోర్టు జడ్జ్ జె.ఎఫ్.కీనన్ తీర్పు చెబుతూ యుసిసి తక్షణమే బాధితుల సహాయార్థం 5 నుండి 10 మిలియన్ డాలర్ల డబ్బు జమ చేయాలని తీర్పు చెప్పింది. ఆ డబ్బు అంతర్జాతీయ రెడ్ క్రాస్ ద్వారా పంచబడు తుందని చెప్పిన రెండు రోజుల్లోనే భారత ప్రభుత్వం దాన్ని తిరస్కరించింది. మార్చ్ 1986లో 350 మిలియన్ డాలర్ల ఒప్పందానికి సిద్ధమైంది. అలాగే కంపెనీ 20 ఏండ్లలోగా 500–600 మిలియన్ డాలర్ల ఫండ్ జమచేయాలని నిర్ణయించింది. దీన్ని కూడా భారత ప్రభుత్వం వ్యతిరేకిస్తూ 3.3 బిలియన్ డాలర్లకు ఒత్తిడి చేసింది. సుప్రీంకోర్టు ఇరుపక్షాలు ఒక ఒప్పందానికి రావాలని ఆదేశించగా 470 మిలియన్ డాలర్లకు యుసిసి భారత్‌కు చెల్లించింది.

1991లో స్థానిక భోపాల్ ప్రభుత్వం 1986లో రిటైర్ అయిన ఆండర్సన్‌పై కేసు వేసింది. ఆండర్సన్ కోర్టుకు హాజరు కానందున 1992లో ఇతన్ని అరెస్టు చేసి హాజరు పర్చాలని ఆదేశించగా భారత్‌లోని ఒక చిన్న కోర్టు అలాంటి ఆదేశాలివ్వడమేమిటని యు.ఎస్. సుప్రీంకోర్టు తిరస్కరించింది. 2010 జూన్ నాటికి 70 ఏండ్ల వయస్సు పైబడ్డ ఏడుగురు భారత జాతీయులు, మాజీ యుసిసి అధికారులకు శిక్షవేశారు. కేశబ్ మహేంద్ర – నాన్ ఎగ్జిక్యూటివ్ చైర్మన్; యు.పి. గోఖలే – మేనేజింగ్ డైరెక్టర్; కిశోర్‌కుమార్ – వైస్ ప్రెసిడెంట్ జె. ముకుంద్ – వర్క్ మేనేజర్; ఎస్.పి.చౌదరి – ప్రొడెక్షన్ మేనేజర్; కె.వి.శెట్టి– ప్లాంటు సూపరింటెండెంట్; ఎస్.ఐ. ఖురేషి –ప్రొడక్షన్ మేనేజర్‌లకు రెండేండ్ల

---

ఫాసిస్టు రాజ్యంగా అవతరించడం పురోగామి శక్తుల స్వీయాత్మక బలహీనతను వ్యక్తం చేస్తోంది. చరిత్ర నిర్మాతలైన మనుషులు ప్రపంచ ఆర్థిక సంక్షోభాన్ని సమగ్ర సామాజిక విప్లవంగా మలచకపోతే, గ్లోబల్ ఫాసిజం మానవాళి+పర్యావరణ మనుగడను ప్రశ్నార్థకం చేస్తుంది. బోల్‌సనారో బలవంతంగా అమలు చేసే అమెరికా సామ్రాజ్యవాద అనుకూల విధానాల వల్ల పేదలు, కార్మికులు, నిరుద్యోగులు పోరాటమార్గం పట్టకతప్పదు. మానవ హక్కులు మృగ్యమవుతాయి. జాత్యహంకారం ప్రబలుతుంది. మైనారిటీ జాతుల బతుకు ఛిద్రమవుతుంది. ఫాసిస్టు ముప్పును తిప్పికొట్టేందుకు ప్రగతిశీల అభ్యుదయ, ప్రజాస్వామ్య శక్తులు ఐక్యంగా ప్రతిఘటించడానికి సమాయత్తం కావల్సిన సందర్భం ఇది.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

శిక్ష, లక్ష రూపాయల జరిమాన విధించింది. తీర్పు వెలువడిన వెంటనే అందరూ బెయిల్‌పై విడుదలయ్యారు. 2014లో ఆండర్సన్ చనిపోయారు.

ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్ 1994 వరకు వీరి ఆరోగ్య సంబంధిత సమాచారాన్ని తెలుపకూడదని నిషేధం పెట్టారు. 36 వార్డులు గ్యాస్ ఎఫెక్టెడ్‌గా ప్రకటించారు. 5,20,000 మంది గ్యాస్ బాధితులు వీరిలో 2,00,000 మంది 15 ఏండ్లలోపు వారు. 3,000 మంది గర్భిణులు. 2259 మంది చనిపోయినట్లు అధికారిక ప్రకటన వెలువడింది. కాని 3928 మంది చనిపోయినట్లు ప్రకటించారు. ఇంగ్రిడ్ ఇక్కమన్ మాత్రం 8 వేల మంది మృతి చెందినట్లు అంచనా వేశారు. ఇది అమెరికా బహుళజాతి సంస్థ అయిన యూనియన్ కార్బైడ్ కార్పొరేషన్ కింద యుసిఐఎల్ పేరున నడుస్తున్న సంస్థ. ఇప్పటికీ బాధితులందరికీ పరిహారాలు ముట్టలేదు. కేసు పూర్తికాలేదు. ఇన్నేండ్లయినా జరిగిన మానవ నష్టాన్ని పూర్తిగా అంచనా వేయలేదు. ఇప్పటికీ టి.బి., అనీమియా లాంటి సాధారణ రుగ్మతలతో బాధితులు బాధపడ్తూనే ఉన్నారు.

అక్కడి రసాయనాల గురించి ప్రభుత్వానికి తెలిసి ఉంటే ఈ దుర్ఘటనను ఆపేవాళ్లా? 2014 తరువాత కూడా ఐసిఎంఆర్ లాంటి అత్యున్నత సంస్థ ఈ దుర్ఘటనకు ప్రధాన కారణం కనుగొనలేకపోయామని రిపోర్టు ఇవ్వడం గర్హించాల్సిన విషయం. ట్రేడ్ సీక్రెసీ ద్వారా ఎంత మోతాదు, ఎంత ప్రమాదకరం అయిన గ్యాస్ అనే అంశాలను బహిర్గతపర్చడం లేదు. ఆ వాయువు దీర్ఘకాలిక లేక భావి జబ్బులను ప్రభుత్వం బేరీజు వేస్తే, ఈ రోగాలను నయం చేయడం లేదు. 1999లో 470 కోట్ల డాలర్లు చెల్లించారు. బాధితుల అలజడి కొనసాగుతూనే ఉంది. 3 వేల మంది చనిపోయినట్లు 30 వేల మంది గాయపడ్డట్లు కొన్ని రిపోర్టులు చెప్తున్నాయి.

ఫ్యాక్టరీ 3 రకాల క్రిమి సంహారక మందుల్ని ఉత్పత్తి చేసేది. 1.కార్బరిల్ (వ్యాపార నామం సెవిన్); 2. అల్డికార్బ్ (వ్యాపార నామంటెమిక్); 3. కార్బిల్, గ్లామా హెక్సోకోరో సైక్లోహెక్సేన్ (జి–హెచ్‌సియం) వ్యాపార నామం సెవిడాల్. ఈ దుర్ఘటన కంటే 15 ఏండ్ల ముందు – వ్యర్థాలు, బయో ప్రోడక్ట్స్, సాల్వెంట్స్, సబ్‌స్టాండర్డ్ ప్రోడక్ట్స్, యంత్రాల నుండి వచ్చే వ్యర్థాలు అన్నీ ఫ్యాక్టరీ లోపల, బయట కుప్పలుగా వేయబడి నీటి కాలుష్యం పెరిగింది. ఇవన్నీ భూగర్భ నీటిని, నేలను కలుషితం చేశాయి. ఈ రెండవ విషాదమే మొదటిదాని కంటే భయంకరం కావచ్చునని నివేదికలు చెప్తున్నాయి. ఈ వ్యర్థాలను శుద్ధి చేసే పనిని ఎవరు చేపట్టాలి? కేంద్రమా, రాష్ట్రమా, లేక కొనుక్కున్న డవ్ కెమికల్స్ వాళ్లా అన్నది తేల్చలేక దాన్ని ఎవరు స్పృశించడంలేదు.

భూగర్భ జలాల ద్వారా వ్యాప్తి చెందుతుందా లేదా అనే మరో సమస్య తెర మీదికి వచ్చింది. ఇండియా సబ్సిడరీ కంపెనీ మాత్రమే ఈ దుర్ఘటనకు బాధ్యత వహించాల్సి ఉంటుందని పదే పదే చెప్తున్నారు. ఉదా. 2009లో జరిగిన ఒక సంఘటనను చూద్దాం. మెక్సికో తీరంలో పెట్రోలు డ్రిల్లింగ్ చేస్తున్నపుడు అక్కడ వెదజల్లబడిన పెట్రోలుకు పరిహారం బరాక్ ఒబామా అడగనేలేదు. 1989లో ఎక్జాన్ వెదజల్లిన పెట్రోలు నష్టపరిహారాన్ని 1 బిలియన్ అమెరికా డాలర్లుగా నిర్ణయించారు. అంటే చచ్చిన చేపలు, జలచరాల భోపాల్ మనుషుల కంటే విలువయిందన్న మాట! చరిత్రలో భోపాల్ విషవాయువు సంఘటన ప్రపంచంలో అత్యంత పారిశ్రామిక విపత్తు/దుర్ఘటనగా నిలిచి పోయింది.

గుణపాఠం: ఇంత ఘోరం జరిగినా దీన్నుండి మన ప్రభుత్వాలు ఎలాంటి గుణపాఠం తీసుకున్న దాఖలాలు లేవు. పర్యావరణవేత్త నిత్యానంద్ జయరామన్ ప్రభుత్వాలు ఇప్పటికీ సరియైన స్థలాలను ప్రాజెక్టుల కోసం ఎంపిక చేయడం లేదని విమర్శిస్తాడు. ఉదా: తమిళనాడులోని చెయ్యార్‌ను తీసుకుందాం. ఇక్కడ థర్మల్ ప్రాజెక్టు కట్టాక నీళ్లు, నేల కలుషితమైతే ఆ విషయం ఎవర్ని అడగాలి? అని ప్రశ్నిస్తున్నారు. జపాన్ లాంటి దేశాల్లో భూకంపాలు, అణు విచ్ఛిత్తులు జరిగినపుడు ఏం చేయాలో చిన్న పిల్లలకు కూడా తెలుసు. కాని ఇలాంటి విపత్తులు జరిగితే ఏమిచేయాలో మనకు తెలిసింది చాలా తక్కువ. ఉదా: 2001లో కొడైకెనాల్‌లో మెర్క్యురీ థర్మామీటర్ మూసేశారు. కాని దాని భయంకర ఎక్సోసివ్‌కు 36 మంది కార్మికులు చనిపోయారు.

గత 10 సంవత్సరాలుగా సుప్రీంకోర్టు కమిటీ సహా సుమారు 11 కమిటీలు వేశారు. కాని ఏ ఒక్క కమిటీ దీనికి పరిష్కారం చూపలేదు. ఏ చర్యల్లేవు. భారతదేశంలోని కార్పొరేట్ సంస్థల ఏ ఒక్కదానిపై కూడా ఒక్క కేసు నడువలేదని పర్యావరణ లాయర్ టి.మోహన్ అంటాడు. ప్రభుత్వమిచ్చే పర్యావరణ హామీ పత్రాలు కర్మాగారం ప్రారంభంలో ఇవ్వాల్సి ఉండగా అవన్నీ ప్రారంభమయ్యాక అలాంటి ధృవీకరణ పత్రాలను జారీచేస్తున్నారు. ఇలాంటి సంస్థల మీద సుప్రీంకోర్టు కొరడా ఝుళిపించినా ప్రభుత్వానికి చీమకుట్టినట్లు లేదు.

మోహన్‌గారు దీని గూర్చి ఇలా వివరిస్తారు – లాస్‌ఎకోలజీ అథారిటీ అనే సంస్థ కర్మాగారాల కాలుష్యం వల్ల నష్టపోయిన రైతులకు ఎలా సహాయం చెల్లించాలనే విషయాలను తీసుకుంటారు. దీని చైర్మన్ కొన్నేండ్ల క్రితం రాజీనామా చేశాడు. ట్రిబ్యునల్ ఏమి చేయలేకుండా ఉంది. ఎవరన్నా బాధితులకు సహాయం ప్రకటిస్తే అది హేతుబద్ధతగా లేదు. బాధితులకు ఇప్పటికే న్యాయం జరుగకుండా ఉన్న నేపథ్యంలో ఈ పర్యావరణవేత్తలు, బాధితుల పక్షాన నిలబడ్డవాళ్లు ప్రభుత్వమన్నా చొరవ తీసుకొని న్యాయం చేస్తుందని వేయికళ్లతో ఎదురుచూస్తున్నారు.

2018, మే 22న స్టెరిలైట్ కర్మాగారం మూసివేయాలని కలెక్టర్ ఆఫీసును ముట్టడించడానికి వెళ్లిన 50 వేల మంది ప్రజలపై కాల్పులు జరిపితే 11 మంది చనిపోయారు. ఆ పిదప మరో ముగ్గురు చనిపోయారు. మూడు దశాబ్దాలుగా సాగుతున్న ప్రజా ఉద్యమాన్ని ఖాతరు చేయని ప్రభుత్వం 14 మంది 'బలి' అయ్యాక ఫ్యాక్టరీని ఇటీవల మూసివేసింది. కానీ వేదాంత కంపెనీ వలన జరిగిన జల, వాయు, భూ కాలుష్య నష్టాల అంచనా ఎంత? దాని నష్ట పరిహారమెంత? ఏదీ జరుగలేదు. ప్రెగ్నెన్సీ నిలబడక గర్భస్రావాలు జరిగిన మహిళల మాటేమిటి? కంపెనీ వెదజల్లిన కాలుష్యానికి గురైన ప్రాంతాల సంగతేమిటి? ఇలా ఏ ప్రభుత్వాలైనా సరే బడాబాబులకు అనుకూలంగా అన్నీ సమకూర్చి, సామాన్య జనం ప్రాణాలను ఫణంగా పెట్టి తమ రాజకీయ పబ్బం ఎన్నాళ్లు గడుపుతారు?

ప్రజల పక్షాన నిలబడి ప్రభుత్వాన్ని ప్రశ్నించేవారిపై పాలకులు, పోలీసు, న్యాయవ్యవస్థల్లాంటి వ్యవస్థలతో పాటు ప్రైవేటు వ్యక్తుల దాడులు తెల్సినవేనాయే! అయితే రాజకీయ ప్రోత్సాహంతోనే ప్రైవేటు వ్యక్తులు రెచ్చిపోతారనేది మన అనుభవాలే చెపుతున్నాయి. ఎంతటి పాలకుడైనా ప్రజాచైతన్యం ముందు తలవంచక తప్పదనేది చారిత్రక సత్యం.

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్టు)* వీ

# రాజ్యం దృష్టిలో అందరూ మావోయిస్టులే

***మోడీ నాయకత్వంలోని పాలకులు తమకు చెందని వాళ్లందరికీ మావోయిస్టులుగా, అర్బన్ నక్సల్స్‌గా ముద్ర వేసి వేధించడానికి కుట్ర పన్నుతున్నారని అంటున్నారు* లక్ష్మణ్ గడ్డం**

పాలకులకో బూచి దొరికింది. తమకు చెందనివాళ్లు, ప్రజలకు మాత్రమే దక్కిన వాళ్లందరు మావోయిస్టులుగా కనబడుతున్నారు. ప్రజల్లో నివసించే ఈ మంచివాళ్లంతా మావోయిస్టులైతే ఆ మావోయిస్టు పార్టీ ఎంత మంచిదో.

తెలంగాణలో జరుగుతున్న ఎన్నికల ప్రహసనంలో ఓటు విలువ గురించి తెలియజేసేందుకు, ఆ విలువైన ఓటు కోసం వస్తున్న రాజకీయ నాయకులను సమస్యల మీద నిలదీయండని చెప్పడం కోసం తెలంగాణ ప్రజా ఫ్రంట్ (టిపిఎఫ్) చేపట్టిన 'ప్రజా చైతన్య యాత్ర'ను మీ కింది స్థాయి పోలీసులు అడ్డుకుంటున్నారని ఫిర్యాదు చేయడం కోసం రాష్ట్ర డిజిపిని పౌరహక్కుల సంఘం అధ్యక్షుడు లక్ష్మణ్ గడ్డం, టిపిఎఫ్ బాధ్యులు రవిచంద్ర, దేవేంద్రలు నవంబర్ 19న కలిశారు. మీ ప్రచారంలో మావోయిస్టు యాక్షన్ టీంలు కలిసిపోయి హింసకు పాల్పడుతారని డిజిపి అన్నారు. కావాలంటే మేం ఎక్కడెక్కడ మీటింగులు ఏర్పాటు చేస్తున్నామో, ఎవరెవరు పాల్గొంటున్నారో వివరాలతో కూడిన వీడియోలు కూడా తీసి ఏరోజుకారోజు మీకు సమర్పిస్తాం అని, పైగా మీ ఇంటెలిజెన్స్ వ్యవస్థ, సొంత వీడియో సౌకర్యం ఉంది కదా అన్నారు. టిపిఎఫ్ బాధ్యులను ఉద్దేశించి మీరు మావోయిస్టులు కదా, ఆ మేరకు మా వద్ద ఎన్నో సాక్ష్యాధారాలు కూడా ఉన్నాయి. అందుకని మావాళ్లు నిరాకరిస్తున్నారని అన్నారు డిజిపి. అంతమాట అంటారేంటి, మేం ఎట్లా మావోయిస్టులం చిరుద్యోగులం తప్ప అన్నాడు రవిచంద్ర. అయినా సరే మీ మూలాలు మాత్రం మావోయిస్టు మూలాలేకదా నిర్ధారణగా అన్నారు.

ఊరికే నామినేషన్ వేయడానికి కనీసం పదివేల మంది గుంపుతో రాజకీయ నాయకులు వెళుతున్నప్పుడు కలిసిపోని మావోయిస్టు యాక్షన్ టీంలు, లక్షలాది మందితో భారీ ప్రచార బహిరంగ సభల్లో కలిసిపోని మావోయిస్టులు గ్రామాల్లో చిన్నస్థాయి మీటింగుల్లో కలిసిపోతే మీ కంట పడకుండా ఉంటారా అన్నాం. మూలాలు కాదు, చర్యలు ముఖ్యం కదా, చర్యలు నేరమయమైతే శిక్షలు వేయండి కాని తెలంగాణలో తిరగకుండా చేస్తామంటే అన్యాయం కదా అన్నాం. ఎవ్వరైనా ఏ రాజకీయ విశ్వాసాలనైనా కలిగి ఉండడం రాజ్యాంగం కల్పించిన హక్కు అని సుప్రీంకోర్టు కూడా నిర్ధారించింది కదా అన్నాం. చివరగా ఈ అంశాన్ని పరిశీలిస్తామన్నారు డిజిపి. ఓ ఇరవై ఐదు నిమిషాల పాటు చర్చ జరిగింది. ఏదేమైనా ఫ్రెండ్లీగానే రిసీవ్ చేసుకున్నారు. అంశాలు సీరియస్‌వి అయినా ఫ్రెండ్లీగానే చర్చించారు.

ముఖ్యమంత్రి కాకముందు మావోయిస్టు ఎజెండా అమలు పరుస్తానన్న చంద్రశేఖరరావు ముఖ్యమంత్రి అయ్యాక సామాజిక ఉద్యమకారులందరిని మావోయిస్టులుగానే పరిగణించమని ఆదేశాలిచ్చినట్లున్నారు. కనుక పోలీసులు రెచ్చిపోతున్నారు. ఇప్పటికే 21 మందిని బూటకపు ఎన్‌కౌంటర్లలో, ఏడుగురిని లాకప్పుల్లో చంపారు. ఎంతో మందిని హింసకు గురిచేశారు. చాలామందిని అక్రమ కేసులు, మావోయిస్టులతో సంబంధాలు పెట్టి జైలుకు పంపారు. రాజ్యం అన్ని చట్టవ్యతిరేక చర్యలు మావోయిస్టుల నేపంతో జరుగుతున్నవే. మావోయిస్టుల బూచి చూపి పోలీసులు రాజ్యమేలుతున్నారు.

ప్రజాపక్ష ప్రజాస్వామిక మేధావులను అర్బన్ మావోయిస్టులని ప్రధాని నరేంద్రమోడీ ప్రకటించిన తర్వాత మహారాష్ట్ర పోలీసులు మరింత రెచ్చిపోయారు. వాళ్లు వాళ్ల రాష్ట్ర సరిహద్దులు దాటి మేధావులపై దండయాత్రలు చేస్తున్నారు. లాయర్లు, ప్రొఫెసర్లు, జర్నలిస్టులు, పరిశోధకులు, రచయితలు, కవులు, కార్యకర్తలు, మహిళలు, ఉద్యమకారులందరూ అర్బన్ మావోయిస్టులుగానే కనబడుతున్నారు.

రాష్ట్ర హైకోర్టు 2018 నవంబర్ 16న అంతిమంగా వెలువరించిన తీర్పులో భాగంగా ఏ క్షణాన్నైనా విప్లవ రచయిత వరవరరావును అపహరించుకు పోతారని ఆందోళన చెందిన ప్రజా సంఘాల సమూహాలు ఆయన ఇంటి ముందు పెద్దఎత్తున ఆందోళనకు దిగారు. అక్కడే టెంటు వేసి ధర్నా చేపట్టారు. అప్పటికే ఇంకా హైకోర్టు ఆర్డర్లు వెలువడలేదు. ఆదేశాలు జారీ కాకుండా అరెస్టు చేయరనే నమ్మకంతో ప్రజా సంఘాల నాయకులంతా ధర్నా ముగిశాక సాయంత్రం వెళ్లిపోయారు. ఇదే అదునుగా భావించిన తెలంగాణ, మహారాష్ట్ర పోలీసులు వరవరరావు అపార్టుమెంట్ చుట్టూ ఎటు చూసినా అరకిలో మీటరు దూరంలో పోలీసు బలగాలను మోహరించారు. ఫ్లాటులోకి వెళ్లకుండా పోలీసులు మమ్మల్ని అడ్డగించారు.

ఈలోగా ప్రజా సంఘాల నాయకులందరికీ విషయం చేరవేయబడ్డది. అందరూ ఆఘమేఘాల మీద అతి తక్కువ సమయంలోనే పెద్ద ఎత్తున చేరుకున్నారు. ఇది జరుగుతుండగానే గడ్డం లక్ష్మణ్, రవిచంద్రలు కట్టుదిట్టమైన భారీ పోలీసుల భారీ పహారాను కళ్లుగప్పి నాలుగో అంతస్తులోని వివి ఫ్లాటుకు చేరుకున్నారు. లోపలికి ప్రవేశించిన వెంటనే గుమ్మం గ్రిల్ తాళం వేశారు కుటుంబీకులు. మా వెనకే పెద్ద ఎత్తున మహిళా పోలీసులతో పాటు మహారాష్ట్ర పోలీసులు దిగారు. వరవరరావును అరెస్టు చేయడానికి వచ్చామని చెప్పారు. వచ్చిన వారిలో మహారాష్ట్ర పోలీసులతో పాటు చిక్కడ్‌పల్లి పోలీసులు ఏసిపి ఆధ్వర్యంలో వచ్చిన వాళ్లున్నారు. నిర్ధారిత అరెస్టు వారెంట్ చూపెట్టండని వేణు అడిగాడు. అరెస్టు వారెంట్ లేదు, అది అక్కర్లేదని పోలీసులు కరుకుగా

జవాబిచ్చారు. పోలీసులు గ్రిల్ బద్దలుకొట్టి లోపలికి వచ్చి వరవరరావును తీసుకెళతామని బెదిరించారు. చిన్నపిల్లలు మహిళలు, కుంటుంబీకులు సందడిగా, ఆందోళనగా ఉన్నారు.

ఈ పరిస్థితిలో తలుపులు బద్దులుకొడితే బీభత్సంగా ఉంటుందని ఆలోచించి తెరవడానికి నిర్ణయించుకున్నారు. గ్రిల్ తెరవగానే పోలీసులు ఒక్క ఉదుటున లోపలికి దూసుకోచ్చారు. వాతావరణం ఒక్కసారిగా బరువెక్కింది. హేమక్క రజని, బన్ని, చిన్ని, సహజ అందరూ కంటతడి. తక్షణమే రాజ్యం కసాయి చర్యలకు తీక్షణంగా మారిపోతున్నారు. వివి నవ్వుతూ అందరిని ఓదార్చుతున్నాడు. ప్రతి ఒక్కరిని ఆప్యాయంగా హత్తుకున్నాడు. రాజ్యం మరింత దిగజారి నిర్బంధాన్ని అమలు పరుస్తుంది. ఈలోగా మహారాష్ట్ర పోలీసు అధికారి లోపలి గదిలోకి ప్రవేశించాడు. గది నుంచి హాలులోకి వెళ్లి హాలులోనే కూర్చోమన్నారు.

బ్యాగులు, మందులు, బట్టలు సర్దుకుని పోలీసులు కూర్చున్న హాలులోకి వచ్చి వారితో మాట్లాడాడు వివి. అరెస్టుకు సంబంధించిన అంశాలన్ని పూర్తి చేశాడు. పలుచోట్ల సంతకాలు చేశాడు. హేమక్క అంగీకారం తెలిపే పత్రంపై సంతకం చేసింది. రాజ్యం, పోలీసులు, న్యాయ వ్యవస్థల ఎడల నిరసన తెలియజేస్తూనే అరెస్టుకు సిద్ధపడుతున్నా నన్నాడు. నా అరెస్టుకు సంబంధించిన వారెంటు కాని, హైకోర్టు ఆదేశాలు కాని లేదా నూతన ట్రాన్సిట్ రిమాండ్ అర్డర్ కాని ఉన్నాయా అని అడిగాడు. పోలీసులు అవేవీ మావద్ద లేవు, లేకుండానే మిమ్మల్ని అరెస్టు చేస్తామన్నారు. అంత అన్యాయంగా న్యాయ వ్యవస్థ, పోలీసులున్న దేశం మనది. ఆ రోజు శనివారం. హైకోర్టు ఆదేశాలు సోమవారం వెలువడ తాయి. అప్పటివరకు పోలీసులు ఆగిపోవచ్చుగదా, మిన్ను విరిగి మీదపడదు కదా. వివి ఎక్కడికి పారిపోయే అవకాశమే లేదు. రెండు తెరల పోలీసు పహారా గృహ నిర్బంధ సందర్భంగా కాపలా కాస్తున్నారు.

భీమాకోరేగాం హింసాకండకు అసలు బాధ్యులైన మనోహర శంభాజీ బిడే, మిలింద్ ఎక్బోటె నిందితులపై ఎఫ్ఐఆర్ నమోదైనప్పటికీ ఎటువంటి అరెస్టులు జరగలేదు. పోలీసులు చట్టాలను ఒకరి విషయంలో చట్టబద్ధంగా మరొకరి విషయంలో చట్ట వ్యతిరేకంగా అమలు చేస్తారు. ప్రజా సంఘాలు అక్రమ అరెస్టుకు నిరసనగా చిక్కడ్‌పల్లి రోడ్డులో రాస్తారోకో నిర్వహించాయి.

2018 ఆగస్టు 28న కూడా ఇదే రీతిలో వివిని తెలంగాణ సోలీసుల సహకారంతో మహారాష్ట్ర పోలీసులు అకస్మాత్తుగా ఎత్తుకుపోయారు. ఆ రోజు దేశ వ్యాప్తంగా వివిధ రాష్ట్రాల్లోని ఐదుగురు మేధావులను అరెస్టు చేశారు. వరవరరావుతో పాటు బొంబాయి హైకోర్టు న్యాయవాదులు వెర్నాన్, అరుణ్ ఫెరీరా, ఫరీదాబాద్‌కు చెందిన న్యాయవాది, కార్మిక నాయకురాలు సుధా భరద్వాజ్, న్యూ ఢిల్లీకి చెందిన పీపుల్స్ యూనియన్ ఫర్ డెమోక్రటిక్ రైట్స్ సంస్థ బాధ్యుడు గౌతం నవలఖలు ఉన్నారు. వీరంతా మావోయిస్టు పార్టీతో ప్రత్యక్ష, పరోక్ష సంబంధాలున్నాయని పూణె పోలీసులు కేసులు పెట్టారు. అంతే కాకుండా ప్రధాన మంత్రి నరేంద్రమోడీ హత్యకు పథకం వేశారని కూడా కేసులు నమోదు చేశారు. ఒకసారి కాంగ్రెస్ నాయకులు, ఈసారి ప్రజా సంఘాల నాయకులు హత్య చేసేటంత బలహీన ప్రధాన మంత్రి భారతదేశానికి ఉండడం ఈ శతాబ్దాపు అత్యంత విశాదకర సందర్భం.

ఈ ఐదుగురి అరెస్టు సందర్భంగా మరికొందరి ఇళ్లపై దాడి చేసి సోదాలు చేశారు. హైదరాబాద్‌లో వరవరరావు కూతుళ్లు బన్ని, చిన్ని ఇళ్లపై దాడి చేసి సోదాలు చేశారు, జర్నలిస్టు క్రాంతి ఇంట్లో కూడా సోదాలు చేశారు. ఇంకా బొంబాయిలో న్యావాది సుసాన్ అబ్రహం, రాంచీలో ఫాదర్ స్టాన్లీ స్వామి, గోవాలో ప్రొఫెసర్ ఆనంద్ తేల్‌తుంబ్డే ఇళ్లలోకి చొరబడి సోదాలు నిర్వహించారు. వీళ్లందరి మీద మావోయిస్టు లతో సంబంధాలున్నాయన్న ఆరోపణలే.

అయితే ఈసారి ఈ అరెస్టులను ప్రజాస్వామిక పౌర సమాజం ఖండించింది. రచయితలు, సామాజిక ఉద్యమకారులు, న్యాయమూర్తులు, కవులు అంతర్జాతీయ స్థాయిలో కూడా ఖండించారు. సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ మార్కండేయ కట్జూ సహితం ఖండించారు. కాంగ్రెస్ పార్టీ తీవ్రంగా ఖండించింది. సుప్రీంకోర్టు మరింత తీవ్రంగా వ్యాఖ్యానించింది. 'అసమ్మతి ప్రజాస్వామ్యానికి భద్రత కవచం లాంటిదని, అది ప్రెషర్ కుక్కర్‌లా పేలిపోతుందని' తీవ్రంగా వ్యాఖ్యానించింది.

2018 జూన్ 6న మహారాష్ట్రలో ప్రముఖ న్యాయవాది సురేంద్ర గాడ్లింగ్‌ను, దళిత నాయకుడు సుధీర్ దావ్లేను, మానవ హక్కుల కార్యకర్త మహేష్ రావత్‌ను, ప్రొఫెసర్ షోమాసేన్‌ను, రాజకీయ విడుదల కమిటీ నాయకుడు రోనా విల్సన్‌ను అరెస్టు చేశారు. వీరందరి మీద మావోయిస్టుతో సంబంధాలున్నాయనే నేరాలు మోపి జైలల్లో తోసేశారు.

నిజానికి భీమాకోరేగాం ద్విశతాబ్ది సంస్మరణ సందర్భంగా రెండు లక్షల మంది దళితులు కదం తొక్కారు. మింగుడుపడని సంఘ్‌పరివార్ సంస్థలు శంభాజీ బిడే, మిలింద్ ఎక్బోటె నాయకత్వంలో బ్రిటిష్ రాజ్‌ను సమర్థించిన దేశద్రోహులకు నివాళులర్పిస్తారా అంటూ దాడిచేస్తే రాహుల్ పతంగ అనే దళిత కార్యకర్త చనిపోయాడు. తెలంగాణ నుండి బొంబాయికి బతకడానికి పోయినవారిలో ఏడుమంది కార్మికులపై మావోయిస్టు ముద్రవేసి జైలుకు పంపారు.

తెలంగాణ ప్రజాస్వామిక వేదిక నాయకులు చిక్కుదు ప్రభాకర్, బల్లా రవీందర్, దుర్గా ప్రసాద్, దుడ్డు ప్రభాకర్, రాజేంద్ర ప్రసాద్, నజీర్‌లను ఛత్తీస్‌గఢ్ పోలీసులకు అప్పగించి 6 నెలలు సుక్మా జైలులో నిర్బంధించారు. డెమోక్రటిక్ స్టూడెంట్స్ యూనియన్ నాయకుడు కంచెర్ల బద్రి, సుదీర్, రంజిత్‌లను జైలుపాలు చేశారు. తెలంగాణ విద్యార్థి సంఘం నాయకులు కోట శ్రీనివాస్‌ను, మహేష్‌లను జైలులో నిర్బంధించారు. పౌరహక్కుల సంఘం వరంగల్ జిల్లా కార్యదర్శి రమేష్ చందర్, బొబాలిపై ఈ సంబంధాల కేసులు బనాయించి జైలుకు పంపారు. ఢిల్లీ యూనివర్సిటీ ప్రొఫెసర్ సాయిబాబాను రెండేళ్లుగా నాగపూర్ జైలు అండా సెల్‌లో బంధించి జీవించే పరిస్థితులను మృగ్యం చేస్తున్నారు.

రాజ్యం దృష్టిలో వీళ్లంతా మావోయిస్టులే. అందుకే అత్యంత దుర్మార్గమైన, అప్రజాస్వామికమైన చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (అన్‌లాఫుల్ ఆక్టివిటీస్ ప్రివెన్షన్ యాక్ట్) ఉపా చట్టాన్ని ఆయుధంగా వాడుతున్నది. ఉపా చట్టం ప్రభుత్వంపై అసమ్మతిని, రాజకీయ అభిప్రాయాన్ని నేరంగా పరిగణిస్తుంది. భావ ప్రకటన స్వేచ్ఛను, సంఘటితమయ్యే హక్కును చట్ట వ్యతిరేకంగా భావిస్తుంది.

బిజెపి పాలనలో పౌర, ప్రజాస్వామిక, లౌకిక భావనలు, విలువల అస్తిత్వానికి ప్రమాదం ఏర్పడింది. చరిత్రలో ప్రజలు నియంతలకు వ్యతిరేకంగా పోరాటాలు, త్యాగాలు చేసి హక్కులు సాధించుకున్నారు. ఆ పోరాటాల వారసత్వాన్ని కొనసాగించాల్సిన బాధ్యత మనపై ఉంది.

*(రచయిత అధ్యక్షులు పౌరహక్కుల సంఘం)* వీ

# పెట్టుబడిదారీ ఉత్పత్తి-శ్రమదోపిడీ-మార్కెట్ సంక్షోభం - 3

***పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో శ్రమదోపిడీ జరిగే పద్ధతిని వివరిస్తున్నారు* రమేష్ పట్నాయక్**

*(గత సంచిక తరువాయి భాగం...)*

**1) ఈ** పట్టణ పారిశ్రామిక పెట్టుబడిదారీ వర్గం గ్రామీణ రంగానికి 4,500 కోట్ల రూపాయలు ముడి సరుకుల నిమిత్తం చెల్లించి ఉంది. కావున గ్రామీణ రంగం వద్ద 4,500 కోట్ల రూపాయలు ఉన్నాయి. గ్రామీణ రంగం ఇందులో 200 కోట్ల రూపాయలు ప్రభుత్వానికి పన్ను చెల్లిస్తుంది, మిగిలిన 4,300 కోట్ల రూపాయలతో పట్టణ పారిశ్రామిక పెట్టుబడిదారీ వర్గం నుండి సరుకులు కొనుగోలు చేయగలుగుతుంది. గ్రామీణ రంగం అంటే రైతులు, వృత్తికారులు, భూస్వాములు అని గమనించాలి. వారిమధ్య జరిగే అంతర్గత లావాదేవీలను కూడా మనం ఇక్కడ పరిశీలించనవసరం లేదు.

2) అలాగే పట్టణ కార్మికులు వారికి అందిన 500 కోట్ల రూపాయల వేతనాలలో 400 కోట్ల రూపాయలు వ్యవసాయ ఉత్పత్తులను గ్రామాల నుంచి కొనుగోలు చేస్తారు. 100 కోట్ల రూపాయలతో పారిశ్రామిక వస్తువులు కొనుగోలు చేస్తారు అనుకుందాం. గ్రామీణ రంగం తాను పట్టణ కార్మికుల నుండి పొందిన 400 కోట్ల రూపాయలను పట్టణ పారిశ్రామిక వస్తువుల కొనుగోలుకు ఉపయోగిస్తుంది.

3) పట్టణ పారిశ్రామిక రంగం ప్రభుత్వానికి నెలకు 100 కోట్ల రూపాయల పన్నులు చెల్లిస్తుంది. గ్రామీణ వ్యవసాయ రంగం ప్రభుత్వానికి ప్రతినెలా 200 కోట్ల రూపాయల పన్నులు చెల్లిస్తుంది. ప్రభుత్వం మొత్తం పన్ను ఆదాయం నెలకు 300 కోట్ల రూపాయలు. ఈ ఆదాయంలో ప్రభుత్వం తను చేపట్టే అభివృద్ధి, సంక్షేమ, పరిపాలన, మిలిటరీ కార్యక్రమాల కొరకు 100 కోట్ల రూపాయల విలువగలిగిన పట్టణ పారిశ్రామిక సరుకులు కొనుగోలు చేస్తుంది. మిగిలిన 200 కోట్ల రూపాయలను మంత్రులకు, అధికారులకు, సైనికులకు, పోలీసులకు, ఉద్యోగులకు జీతాలుగా ఇస్తుంది.

4) ప్రభుత్వం నుండి జీతాలు, భత్యాలు పొందినవారు తమకు అందిన 200 కోట్ల రూపాలలో 80 కోట్ల రూపాయలతో పట్టణ పారిశ్రామిక వస్తువులను కొనుగోలు చేస్తారు. మిగిలిన 120 కోట్ల రూపాయలు గ్రామీణ వ్యవసాయరంగ ఉత్పత్తులను కొనుగోలు చేస్తారు. గ్రామీణ వ్యవసాయ రంగం తనకు ప్రభుత్వ ఉద్యోగుల నుంచి అందిన సదరు 120 కోట్ల రూపాయలతో తిరిగి పట్టణ పారిశ్రామిక వస్తువులను కొనుగోలు చేస్తుంది.

అంటే ఒక నెలలో మొత్తం 5,500 కోట్ల రూపాయల ఉత్పత్తిలో 4,300 + (100+400) + 100 + (80 + 120) = 5100 కోట్ల రూపాయల ఉత్పత్తులు అమ్ముడుపోతాయి. 400 కోట్ల రూపాయల విలువగల వస్తువులు పట్టణ పారిశ్రామిక పెట్టుబడిదారీ వర్గం వద్దే మిగిలి ఉంటాయి. ఇందులో ఒక 100 కోట్ల రూపాయల విలువగలిగిన సరుకులను పెట్టుబడిదారులు, వారి కుటుంబ సభ్యులు, వారికి, వారి కుటుంబాలకు సేవలు అందించేవారు, వారు పోషించే మత, ధార్మిక సంస్థలలో ఉన్నవారు ఖర్చు చేస్తారనుకుందాం. ఈ 100 కోట్ల రూపాయలలో 50 కోట్ల రూపాయలు పట్టణ పారిశ్రామిక వస్తువులపై యథాతథంగా ఖర్చు చేస్తారు. మరొక 50 కోట్ల రూపాయల పారిశ్రామిక సరుకులను గ్రామీణ రంగానికి అమ్మి వ్యవసాయ ఉత్పత్తులను కొనుగోలు చేసి వాడతారు. తనకందిన 50 కోట్ల రూపాయలలో గ్రామీణ రంగం మరొక విడతగా పారిశ్రామిక వస్తువులు కొనుగోలు చేస్తుంది. ఈ విధంగా, మరొక 100 కోట్ల రూపాయల సరుకులు ఖర్చవుతాయి లేదా అమ్ముడుపోతాయి. ఇంకా 300 కోట్ల రూపాయల సరకులు మిగిలి ఉంటాయి. ఇవి ఎవరు కొనాలి? పెట్టుబడిదారులు తమ అవసరాల మేరకు సరుకులు వ్యయపరచారు. మిగిలిన 300 కోట్ల రూపాయల సరుకులను వారు వాడుకోలేరు. కార్మికులు తమ మొత్తం వేతనాలతో సరుకులు కొనుగోలు చేసినారు. వారు తమ కొనుగోలు శక్తినంతా ఉపయోగించారు. వారి దగ్గర ఇంకా కొనుగోలు శక్తి లేదు. పెట్టుబడిదారులకు వాడుకునే శక్తి లేదు, కార్మికులకు మరింత కొనుగోలు చేసే శక్తి లేదు. ఉండి తినలేని వాడొకడు, లేక కొనలేనివాడు మరొకడు. ప్రభుత్వానికి చేరిన పన్ను ఆదాయం కూడా ఖర్చయిపోయింది. ప్రభుత్వానికి మరి ఏమాత్రం కొనుగోలు శక్తి లేదు. అదనంగా నోట్లు ముంద్రించడమంటే నోటు విలువను తగ్గించడమే. కాబట్టి ఆ ప్రత్యామ్నాయం పనికిరాదు. గ్రామాలలో ఉండే శ్రామిక రైతులు, వృత్తికారులు, భూస్వాముల వద్ద కొనుగోలు శక్తి మరెంత మాత్రమూ లేదు. ఈ వర్గాల వారు తమ పంటలు, ఇతర ఉత్పత్తులు పట్టణంలో అమ్మగా వచ్చిన డబ్బుతో ఇప్పటికే పారిశ్రామిక సరుకులు కొనుగోలు చేసినారు. మరి ఈ 300 వందల కోట్ల రూపాయల సరుకులు ఎవరు కొనుగోలు చేయాలి? ఈ మిగులు సరుకులు కొనగలిగేది భూస్వాములు మాత్రమే! ఆ విషయం పరిశీలిద్దాం.

భూస్వాముల దివాలా : భూస్వాములు వారి ఆదాయంతో చేసిన కొనుగోళ్లు ఇప్పటికే గ్రామీణ రంగ కొనుగోళ్లలో భాగంగా గణించి ఉన్నాము. అయితే సాధారణంగా ఆధునిక పారిశ్రామిక ఉత్పత్తులు అందుబాటులోనికి వచ్చిన తరువాత భూస్వాముల కొనుగోళ్లు వారి ఆదాయాన్ని మించి ఉంటాయి. ఇది ఒక చారిత్రాత్మక వాస్తవం. వారు ప్రతినెలా మిగిలిపోయిన 300 కోట్ల రూపాయల పారిశ్రామిక వస్తువులను కొనుగోలు చేస్తారు. అలా కొనుగోలు చేయడానికి వారివద్ద డబ్బు ఉండదు కదా! అందుకై వారు అప్పు రాసుకోమంటారు. ఆ విధంగా వారు ప్రతినెలా 300 కోట్ల రూపాయలు పట్టణ పెట్టుబడిదారీ వర్గానికి బాకీ పడతారు అనుకుందాం. ఈ విధంగా పెట్టుబడిదారుల వద్ద ఉన్న మొత్తం సరుకులు ఖర్చయిపోతాయి లేదా అమ్ముడుపోతాయి. భూస్వాములు మిగిలిన 300 కోట్ల రూపాయల విలువైన సరుకులు

ప్రతినెలా తమ ఆదాయంకంటే అధికంగా అప్పుచేసి, పట్టణ పెట్టుబడిదారులకు బాకీపడుతూ కొనుగోలు చేశారనుకుందాం. అయితే ఈ విధంగా మూడు సంవత్సరాలు గడిచేసరికి పెట్టుబడి రెండు రెట్లు అవుతుంది. ప్రతినెలా 600 కోట్ల రూపాయల విలువైన సరుకులు మిగులుతాయి. భూస్వాముల కొనుగోళ్ళు 600 కోట్లకు పెరుగుతాయి. ఇలా పారిశ్రామిక సరకులు ఎంత మిగిలితే అంత మొత్తం భూస్వాములు ఖరీదుచేస్తూ పోతారు. ఆడంబర ఖర్చులు చేసే భూస్వాములు పెట్టుబడిదారుల వద్ద అప్పు చేస్తూ మిగిలిన సరకులు కొంటూ ఉంటారు. అప్పుకు మింజువలె చివరకు తమ డిమిస్నీ భూములను పెట్టుబడిదారులకు దఖలుపరుస్తారు. పెట్టుబడిదారులు వ్యవసాయ రంగంలోనికి కూడా ప్రవేశించి ఉత్పత్తి ప్రారంభిస్తారు. అది తరువాత మాట. ఈ విధంగా భూస్వాముల ఆస్తి అంతా పెట్టుబడిదారులకు చేరుతుంది. భూస్వాములు బుక్కా ఫకీరులవుతారు. పెట్టుబడిదారీ ఉత్పత్తుల ముందు పోటీకి నిలువలేక బట్టలు నేసేవారు, కుండలు చేసేవారు ఇలా మొత్తం వృత్తికారులందరూ దివాలా తీస్తారు. వారు పట్టణాలకు వలసపోయి రోజు కూలీలవుతారు. పెరుగుతున్న పరిశ్రమలకు కార్మికుల కొరత లేకుండా ఉంటుంది. భూస్వాములలో కొంతమంది పారిశ్రామిక వేత్తలు అవుతారు, కొద్దిమంది బ్యాంకర్లు అవుతారు. అత్యధికులు దివాలా తీస్తారు. పెట్టుబడిదారులు వ్యవసాయరంగంలో కూడా ప్రవేశించడంతో రైతులు కూడా పోటీకి తట్టుకోలేక దివాలా తీస్తారు. అప్పుల పాలవుతారు, క్రమక్రమంగా వారి భూములు కూడా పెట్టుబడిదారుల పాలవుతాయి. అయితే కొంత శాతం వృతికారులే పరిశ్రమల అధిపతులుగా, కొంత శాతం రైతులు వ్యవసాయ పెట్టుబడిదారులుగా ఎదిగిన చరిత్ర ఉంది. మరొకవైపు ఎన్‌సర్కిల్‌మెంట్ చట్టాలు తీసుకువచ్చి గ్రామ కంఠాలను, రైతుల సాగులో ఉన్న భూములను పెట్టుబడిదారులు చట్టపరంగా కబ్జాచేశారు. గ్రామాలలో కూడా కొత్త వర్గాలు ఏర్పడ్డాయి. మొత్తంగా చెప్పుకోవాలంటే గ్రామీణ రంగంలో కూడా పెట్టుబడి పూర్తిగా విస్తరిస్తుంది. రైతులు భూ పెట్టుబడిదారుల కింద వ్యవసాయ కూలీలవుతారు. భూస్వామ్య వర్గం, వృత్తికారుల వర్గం, రైతువర్గం ఉనికిని కోల్పోవడంతో, అంటే ఆ వర్గాలలో ఉన్నవారు ఇతర వర్గాలలో చేరిపోవడంతో గ్రామాలలో కూడా పెట్టుబడిదారీ, కార్మిక వర్గాలు పుట్టి పెరుగుతాయి. చివరికి గ్రామాలలో కూడా మిగిలిన వర్గాలన్నీ నశించి ఈ రెండు వర్గాలే మిగులుతాయి. అంటే ఇటు పట్టణాలలో, అటు గ్రామాలలో కూడా మిగిలేది పెట్టుబడిదారులు, కార్మికులే అన్నమాట. ప్రభుత్వం, ప్రభుత్వం నుంచి వేతనాలు పొందిన వర్గం కూడా ఉంటుంది. తిరిగి మిగులు ఉత్పత్తుల సమస్య తలెత్తుతుంది. ఇక్కడ మనం ప్రధానంగా అంతిమ ఫలితం పైననే దృష్టి పెట్టాలి. ఈ ప్రక్రియల ఫలితంగా ఉత్పత్తి రంగంలో రెండు వర్గాలే మిగులుతాయి. మధ్యతరగతి వర్గాన్ని పక్కన పెడితే, పెట్టుబడిదారులు, బ్యాంకర్లు, వ్యాపారస్తులు ఒకవైపు, గ్రామీణ మరియు పట్టణ కార్మికులు మరోవైపు. దీనినే కారల్ మార్క్స్ సమాజం రెండు పెద్ద శత్రు శిబిరాలుగా చీలిపోవడం, పరస్పర విరుద్ధ ప్రయోజనాలతో ఎదురుబొదురుగా నిలబడడం అంటాడు. ఈ రెండు వర్గాలలో ప్రభుత్వం పెట్టుబడిదారీ శిబిరం వైపుననే నిలబడుతుందని మార్క్స్ విశ్లేషించి చూపిస్తాడు. ఆధునిక రాజ్య పాలనా యంత్రాంగం పెట్టుబడిదారుల సామాన్య ప్రయోజనాలను చక్కబెట్టే ఒక కమిటీ మాత్రమే అని కారల్ మార్క్స్ చెప్తాడు. మరొక ప్రధానమైన విషయం ఏమిటంటే ఈ ప్రక్రియలు నడిచిన మొత్తం కాలంలో పెట్టుబడిదారులు ఉత్పత్తి చేసిన పారిశ్రామిక ఉత్పత్తులు వివిధ ఆటంకాలు వచ్చినా అమ్ముడుపోయాయి. అంటే సమాజంలో అన్ని వర్గాల ఆస్తి పెట్టుబడిదారుల పెట్టుబడిగా మారేవరకు ఈ 'ప్రగతిశీల ప్రక్రియ' కొనసాగింది. ఇంగ్లాండులో అన్ని వర్గాల ఆస్తి పెట్టుబడిదారుల ఆస్తిగా, పెట్టుబడిగా మారడాన్ని గమనించాము. కాస్త లేటుగా ప్రారంభమైనా కూడా, ఫ్రాన్స్, డెన్మార్క్, జర్మనీ, మొత్తం పశ్చిమ యూరప్ దేశాలు ఇదే మార్గాన్ని అనుసరించాయి. ఆ క్రమంలో అవి తూర్పు యూరప్ దేశాలను, భారత్, చైనా, ఆసియా, ఆఫ్రికా దేశాలను తమ ఆధీనంలోనికి తీసుకున్నాయి. ఆయా దేశాలు వలసలుగా గాని, అర్థవలసలుగా గాని మారిపోయాయి. ఆ దేశాల ముడి సరుకులు కొల్లగొట్టబడ్డాయి. ఆ దేశాలలో తమ సరుకులను విస్తారంగా అమ్ముకుని అక్కడి వృత్తికారులను, వ్యవసాయదారులను, చివరికి పరిశ్రమలను ఐరోపా పెట్టుబడిదారులు దెబ్బతీశారు. అనంతర కాలంలో ఆయా దేశాలలో పరిశ్రమలు పెట్టి కార్మిక శ్రమను కారుచౌకగా దోపిడీ చేసి అదనపు విలువను తమ తమ దేశాలకు తరలించుకుపోయారు. ఆ కారణంగానే ఈ దేశాలు వెనుకబడిన దేశాలుగా మిగిలిపోయాయి. అయితే ఇదంతా ఉత్పత్తి సాంకేతికతలో వాటికున్న ఆధిపత్యం వలన మాత్రమే జరగలేదు. తూర్పు బెంగాల్ (ప్రస్తుత బంగ్లాదేశ్) ప్రాంతంలో పట్టు కార్మికుల వేళ్ళు నరకకుండా వారిని పోటీలో గెలవలేకపోయారు. చైనా ప్రజల చేత బలవంతంగా నల్లమందు తినిపించకుండా చైనాపై వాణిజ్య రగంలో ఆధిపత్యం సాధ్యం కాలేదు. ఇంకా దుర్మార్గంగా ఆఫ్రికా గిరిజనులను ఎత్తుకుపోయి అమెరికాలో బానిసలుగా అమ్మకుండా వారి పెట్టుబడి పెరగలేదు. అమెరికాలో, ఆస్ట్రేలియాలో స్థానిక తెగలను రక్తపాతంలో ముంచి తుడిచిపెట్టకుండా వారి పెట్టుబడి పాలన విశ్వవ్యాప్తం కాలేదు. ఉత్పత్తి రంగంలో సాంకేతిక ఆధిపత్యం ఒక్కటే పెట్టుబడి అధికార విస్తరణకు చాలలేదని రెండవ వైపు పెట్టుబడిదారీ రాజ్యానికి యుద్ధ రంగంలో గల సాంకేతిక ఆధిపత్యం కూడా అవసరమైందని ఇక్కడ ప్రత్యేకంగా చెప్పుకోవాలి. పశ్చిమ ఐరోపా పెట్టుబడి ఇతర దేశాలను వలసలుగా మార్చడంలో మోసపూరిత విధానాలను, అనేక అనైతికత మార్గాలను కూడా అనుసరించింది. మతాన్ని కూడా ఉపయోగించింది.

మనం మరలా మార్కెట్ లెక్కలకు వద్దాం. ఇంతవరకు జరిగిన చర్చలో సరుకులను మనం ఏక మొత్తంగానే పరిగణించాము. కాని ఆర్థిక శాస్త్రంలో సరుకులను, వేతన సరుకులు, డాబుసరి సరుకులు, పెట్టుబడి సరుకులు (యంత్రాలు, పనిముట్లు) అని విభజిస్తారు. కార్మికులు బతకడానికి అవసరమైన కనీసంగా ఉపయోగించవలసిన సరుకులను వేతన సరుకులు (వేజ్ గూడ్స్) అంటారు. అందుకు అదనంగా భూస్వాములు, పెట్టుబడిదారులు, బ్యాంకర్లు, వ్యాపారులు, మధ్యతరగతివారు ఉపయోగించే ప్రత్యేకమైన సరుకులను డాబుసరి సరుకులు అంటారు. (లక్జరీ గూడ్స్). అలానే ఉత్పత్తిలో ఉపయోగించే యంత్రాలు, పనిముట్లు, ముడి సరుకులను, సహాయక సరుకులను పెట్టుబడి సరుకులు (క్యాపిటల్ గూడ్స్) అంటారు. పరిశ్రమలు మూడు రకాలుగా ఉంటాయి. ఉత్పత్తులు మూడు రకాలుగా ఉంటాయి. ప్రతి రంగంలో సప్లై డిమాండ్‌ల సరితూకం ఉంటేనే మార్కెట్ వ్యవస్థ ముందుకు వెళుతుంది, విస్తరిస్తుంది. ఈ మూడింటిని వేరు వేరుగానూ, పరస్పర సంబంధంలోనూ చూపించడానికి మార్క్స్ ఒక పద్ధతిని రూపొందించాడు. అందులో కొన్ని సమస్యలు తలెత్తాయి. అయితే అవి కూడా పరిష్కారమయ్యాయి. మార్క్స్ రూపొందించిన పద్ధతి కొన్ని మార్పులతో ఉపయోగకరంగా ఉంది. ఈ వ్యాస పరిమితిలో దానిని వివరించలేము.

*(ఇంకా ఉంది...)*

*(రచయిత విద్యా పరిరక్షణ కమిటీ నాయకులు)* వీ

### కుల నిర్మూలన పోరాట సమితి మహా సభలు

కుల నిర్మూలన పోరాట సమితి (కెఎన్‌పిఎస్) 20 ఏళ్ల మహాసభలు గుంటూరులోని ఎన్‌జిఒ కళ్యాణ మండపంలో అక్టోబర్ 28, 29 తేదీల్లో జరిగాయి. కళ్యాణరావు మాట్లాడుతూ దేశంలోని నాలుగు సామాజిక వర్గాలపై దాడులు జరుగుతున్నాయని ఆందోళన వ్యక్తంచేశారు. దళితులు, ఆదివాసీలు, మైనారిటీలు, మావోయిస్టులపై దాడులు జరుగుతున్నాయన్నారు. దోపిడి ప్రపంచీకరణగా రూపాంతరం చెందిందన్నారు. పాలకులు దేశంలో, రాష్ట్రంలో సహజ సంపదను మల్టీ నేషనల్ కంపెనీలకు దోచిపెడుతున్నారన్నారు. సామాన్య ప్రజలకు విద్య, వైద్య అందని ద్రాక్షగా మారిందన్నారు. దాడులు, అత్యాచారాలు జరిగితే నేరస్తులపై చర్చ జరగకుండా బాధితులపై చర్చ జరిగే దౌర్భాగ్య పరిస్థితికి తీసుకొచ్చారన్నారు. కుల నిర్మూలన కోసం సమాజంలోని అభ్యుదయ, ప్రజాస్వామికవాదులంతా ఏకం కావాలని పిలుపునిచ్చారు.

### టివైఎఫ్, టిపిఎఫ్ నేతల అరెస్టు

తెలంగాణ ప్రజా ఫ్రంట్ రాష్ట్ర కార్యదర్శి మెంచు రమేశ్‌ను, తెలంగాణ యూత్ ఫెడరేషన్ నాయకులు మోహన్ రాజ్, పాండు రంగారెడ్డి, గణేష్, శ్రీను, మరో ఇద్దరు కార్యకర్తలను పోలీసులు అక్టోబర్ 30న అక్రమంగా అరెస్టు చేసి ఉపా కేసు నమోదు చేసి ఖమ్మం జైల్లో నిర్బంధించారు. అరెస్టులను ఖండిస్తూ అదే రోజు సుందరయ్య విజ్ఞాన కేంద్రం వద్ద ప్రజాసంఘాలు ధర్నా నిర్వహించాయి. అరెస్టు చేసిన వారిని మెజిస్ట్రేట్ ముందు హాజరు పరచాలని టిపిఎఫ్ రాష్ట్ర అధ్యక్షుడు నలమాస క్రిష్ణ డిమాండ్ చేశారు.

### భావ ప్రకటనా స్వేచ్ఛకోసం సామూహిక స్వరం

భావ ప్రకటన పరిరక్షణ కోసం సామూహిక స్వరం సంస్థ నవంబర్ 3న బహిరంగ సభ నిర్వహించింది. సభలో ప్రజాసమస్యలపై పోరాడే వారి ఫోన్ ట్యాపింగ్, అరెస్టులు, గృహనిర్బంధాలతో గొంతుకలను ప్రభుత్వాలు నులిమేస్తున్నాయని ఆందోళన వ్యక్తంచేశారు. రోహిత్‌వేముల ఆత్మహత్య ఘటన తమను కలిచివేసిందని, రాజ్యాంగం కల్పించిన హక్కులు అమలు కావడం లేదన్నారు. ఎవరు మాట్లాడకుండా చేయడంలో భాగంగానే ప్రభుత్వం ఇందిరాపార్క్ వద్ద ఉన్న ధర్నాచౌక్‌ను ఎత్తివేయించిందని అన్నారు. ఈ సభకు తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ నుండి మేధావులు, ప్రజాస్వామిక వాదులు, ప్రజలు పెద్ద సంఖ్యలో హాజరయ్యారు.

### జాతశ్రీ మృతి

ప్రముఖ నవలా, కథా రచయిత జాతశ్రీ(70) భద్రాద్రి కొత్తగూడెం జిల్లా కేంద్రంలోని విద్యానగర్ కాలనీలో అనారోగ్యంతో నవంబర్ 4న మృతి చెందారు. సింగరేణిలో పనిచేసిన ఆయన సింగరేణి ఇతివృత్తంగా నవలలు, కథలు రాశారు. ఆయన రాసిన కుట్ర అనే కథకు 'పట్టికోట ఆళ్వారు స్వామి' అవార్డు లభించింది. ఆయన అభ్యుదయ రచయితల సంఘం ఉమ్మడి ఖమ్మం జిల్లా కార్యదర్శిగా పనిచేశారు. ఆయన అసలు పేరు చార్లెస్ కలం పేరు జాతశ్రీ. ఆయన 'బలిపశువు', 'వెదురుపొదలు నినదించాయి' తదితర నవలలను రాశారు. ఆయన చలివేంద్రం కథా సంకలనం తెచ్చారు. ప్రత్యక్ష ఉద్యమాలను నవలీకరించిన గొప్ప రచయిత.

### కపిలవాయి లింగమూర్తి మృతి

సాహిత్య చారిత్రక పరిశోధకుడు డా. కపిలవాయి లింగమూర్తి (94) నవంబర్ 6న మృతి చెందారు. నాగర్‌కర్నూల్ జిల్లా అచ్చంపేట మండలం జినుకుంట గ్రామంలో 1928 మార్చ్ 31న జన్మించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి ఎంఎ (తెలుగు) చేశారు. 1954లో నాగర్‌కర్నూల్ జాతీయ పాఠశాలలో తెలుగు పండితులుగా, 1972లో పాలెంలోని ప్రాచ్య కళాశాలలో తెలుగు ఉపన్యాసకుడిగా పనిచేశారు. 2014లో తెలుగు విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసింది. పండరినాథ విఠలశతకం, ఆర్యశతకం, తిరుమలేష శతకం, దుర్గా శతకం, గద్వాల హనుమద్య వచనాలు, కపిలవాయి గేయ కంఠికలు, ప్రబోధ పరహం, మామిళ్లపల్లి దేవస్థాన చరిత్ర, ఉప్పునుంతల కథల వంటి 113 రచనలు చేశారు.

### రౌతు రామిరెడ్డి మృతి

తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట యోధుడు ఎర్రబోతు రాంరెడ్డి(90) నవంబర్ 10న మరణించారు. నల్లగొండ జిల్లాలోని అప్పాజీపేట గ్రామంలో జన్మించిన రాంరెడ్డి చిన్న వయసులోనే రజాకార్లకు వ్యతిరేకంగా పోరాడి జైలు జీవితాన్ని అనుభవించారు. 14 ఏళ్ల వయసులోనే ఆయనకు ఉరిశిక్ష వేశారు. యువత నిరసనలు చేపట్టడంతో ఆ శిక్షను రద్దు చేశారు. స్వాతంత్ర్యం తర్వాత అప్పాజీపేట సర్పంచ్‌గా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. వరుసగా 30 ఏళ్లపాటు ఆరుసార్లు సర్పంచ్‌గా గెలిచారు.

### రాయలసీమ సత్యాగ్రహం

రాయలసీమ సాగునీటి సాధన సమితి, రాయలసీమ ప్రజాసంఘాల సమన్వయ వేదికల ఆధ్వర్యంలో నవంబర్ 16న విజయవాడ ధర్నా చౌక్‌లో శ్రీబాగ్ ఒడంబడిక అమలు చేయాలని డిమాండ్ చేస్తూ రాయలసీమ సత్యాగ్రహం జరిగింది. వక్తలు మాట్లాడుతూ ఏళ్ల తరబడి సాగునీరు అందక రైతులు ప్రతి ఏడాదీ ఒక్క పంటతోనే సరిపెట్టుకుంటున్నారన్నారు. సహనం నశించి సత్యాగ్రహ దీక్షకు దిగారన్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ శాఖను అనంతపురంలో ఏర్పాటు చేయాలని, రాజధాని లేదా హైకోర్టు...ఏదైనా ఒకటి రాయలసీమలో ఏర్పాటు చేయాలని డిమాండ్ చేశారు. ఇందులో 40 ప్రజా సంఘాల ప్రతినిధులు, రాయలసీమ రైతులు, కార్మికులు, విద్యార్థులు పెద్దఎత్తున పాల్గొన్నారు.

### వరవరరావు అరెస్ట్, కొనసాగుతున్న నిరసనలు

భీమా కోరేగావ్ కేసులో విరసం నేత వరవరరావును మహారాష్ట్ర పోలీసులు నవంబర్ 17న ట్రాన్సిట్ వారెంట్‌పై పూణేకు తరలించారు. ఈ అరెస్టును ఖండిస్తూ పౌరహక్కుల, ప్రజా సంఘాల కార్యకర్తలు గాంధీనగర్‌లోని వరవరరావు ఇంటివద్ద రోడ్డుపైన బైటాయించి ఆందోళన చేశారు. తెలంగాణ ప్రజాస్వామిక వేదిక ఆధ్వర్యంలో అరెస్టును ఖండిస్తూ దేశ వ్యాప్తంగా అక్రమంగా నిర్బంధించిన ప్రజాస్వామిక వాదుల్ని విడుదలచేయాలని డిమాండ్‌చేస్తూ నవంబర్ 25న హైదరాబాద్‌లోని ఇందిరాపార్క్ వద్ద ధర్నా నిర్వహించింది. ఈ ధర్నాలో వక్తలు భీమా-కోరేగాం కేసు ఓ కట్టుకథ అని, హక్కుల నేతల అరెస్టు వెనక భారీ వ్యూహముందని ఆరోపించారు.

### తెలంగాణ రచయితల వేదిక రాష్ట్ర మహాసభలు

తెలంగాణ రచయితల వేదిక రాష్ట్ర మహాసభలు నవంబర్ 17న బాగ్‌లింగంపల్లిలోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో జరిగాయి. 70 ఏళ్ల పరిపాలనలో భారత రాజ్యాంగం అపహాస్యం పాలయిందని సుప్రీంకోర్టు రిటైర్డ్ న్యాయమూర్తి జస్టిస్ సుదర్శన్‌రెడ్డి ఆవేదన వ్యక్తంచేశారు. చాలా మంది రచయితలు తమ ఆత్మగౌరవాన్ని వదులుకొని ప్రభుత్వ నిర్ణయాలకు వంతపాడుతున్నారన్నారు. ప్రభుత్వ విధాన నిర్ణయాలను ప్రశ్నించకపోగా, వాటిని రచనల రూపంలో తీసుకురావడం పొరపాటని, రచనలు ఆలోచింపజేసేలా ఉండాలన్నారు. నేడు రాష్ట్రంలో సత్యం మాట్లాడాలంటేనే భయంగా ఉందన్నారు. సత్యం మాట్లాడిన వారి గొంతు నొక్కేస్తున్నారన్నారు. ఈ సభకు జయధీర్ తిరుమలరావు అధ్యక్షత వహించారు.

### ధర్నాచౌక్‌పై నిషేధం ఎత్తివేత

ధర్నాచౌక్ వద్ద నిరసనలు తెలియజేడంపై ప్రభుత్వం విధించిన నిషేధాన్ని హైకోర్టు ఎత్తేసింది. ధర్నాచౌక్ వద్ద నిరసనలు, సభలు, సమావేశాలకు అనుమతినివ్వాలని న్యాయస్థానం నవంబర్ 13న ప్రభుత్వాన్ని ఆదేశించింది. నగరంలో ధర్నా చేయకుండా మారుమూల ప్రాంతాల్లో లేదా అరణ్యంలో చేస్తారా అని వ్యాఖ్యానించింది. నిరసన తెలపడం ప్రజాస్వామిక హక్కు అని స్పష్టం చేసింది. హైదరాబాదులోని ఇందిరా పార్క్ సమీపంలోని ధర్నాచౌక్ వద్ద ధర్నాలు, ర్యాలీలు నిషేధించారని, నిరసన తెలిపే హక్కును కోల్పోయామంటూ ప్రొ. పి.ఎల్. విశ్వేశ్వరరావు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తికి రాసిన లేఖను హైకోర్టు సుమోటోగా స్వీకరించి విచారించింది. హైకోర్టు ఆదేశాలు ఆరువారాలపాటు అమల్లో ఉంటాయని, దీనిపై కౌంటర్ వేయాలంటూ సర్కారుకు ఆదేశించింది. వీ

